# వారెవ్వా!

కొందరు ఛాయాచిత్రకారులు ప్రదర్శించిన ఫొటోగ్రఫీ ట్రిక్కులివి...




వామ్మో...
ఎంతపొడవైన చెయ్యో?!



బాబూ...
నీకు
మూడుకాళ్లా?!



రాతిశిల్పానికి
రమణీయ చుంబనం
అమ్మ...నీ కమ్మనీ ముద్దు?!



గట్టిగా తన్నకు
బాబోయ్
పడిపోతుంది




సంపుటి -31
సంచిక - 6
జులై 2008
366వ సంచిక


- మనసున ఉన్నదీ.. 4
- యర్రంశెట్టి సాయి అపార్ట్‌మెంటాలజీ
  కౌన్ బనేగా కరోర్‌పతి 6
- హాస్యం దివ్యౌషధం 12
- టాంక్‌బండ్ కథలు-9
  శత్రువు 111
- సంధ్యావందనం లక్ష్మీదేవి ఇదీవేదం
  స్త్రీ - ప్రతిభావంతురాలు 114
- కాలాతీతం
  ప్రపంచ ప్రసిద్ధ నవలల
  పరిచయ వేదికలో గైడి మపాసా నవల
  ఒక జీవితం నిర్వహణ: ఎం.వసంత 118
- చతుర ప్రవేశిక విజేతలు 124
- చతుర కతలు 127
- చతుర ప్రపంచం
  సేకరణ : ఎం.కావ్య
- చతురోక్తులు, వారెవ్వా!
  సేకరణ : కె.రఘు


ముఖచిత్రం : కాజల్ ఫొటో : జయకృష్ణ

ముఖపత్రాలంకరణ : రాజు యాట

రకకాల తెగుళ్లతో
పంట దెబ్బతిని అప్పులపాలై
కన్నీరు మున్నీరవుతున్న
బక్కరైతులపక్షాన
నిలిచి
సమున్నత లక్ష్యసాధన కోసం
ఉద్యమించిన ఉదాత్తుడి
స్ఫూర్తిదాయక చరితే
వసంతరావు దేశపాండే
ఆవిష్కరణ

**భూమి గుండ్రంగానే ఉండాలి**

14 వ పేజీలో

బొమ్మలు: ఆనంద్



# మనసున ఉన్నదీ...



★ చతురలో ప్రచురితమవుతున్న వైవిధ్యభరిత నవలలు చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. దాంతో క్రమం తప్పని పాఠకురాలిగా మారిపోయాను. 'కొత్తగాలి' శీర్షిక ద్వారా అందిస్తున్న మినీ కవితలు సాహిత్యాభిమానులను, ఔత్సాహిక కవులను ఎంతగానో అలరిస్తున్నాయి. 'ప్రవేశిక' పూరించేందుకు పుస్తకమంతా ఒకేరోజు మూడుసార్లు చదివాను. అంతటి ఆసక్తి కలుగచేస్తున్న 'చతుర'కు కృతజ్ఞతలు.

– శైలూషి, అరసవిల్లి, శ్రీకాకుళం జిల్లా

★ జూన్ నెల చతురలో 'మిసెస్ కాసులమ్మ ఎలియాస్ వికాసిని' నవల బాగుంది. సువిశాల ప్రపంచంలో తన ఉనికిని నిరూపించుకోవాలని భావించిన ఆధునిక మహిళ అడుగడుగునా ఎదుర్కొనే అవాంతరాలు, అనేకానేక సమస్యలను సునిశితంగా ఈ నవల చర్చించింది. రచయిత వసుంధరగారికి ప్రత్యేక అభినందనలు. అలాగే, 'చతుర ప్రపంచం', 'మనసున ఉన్నదీ...' శీర్షికలు మాకు నచ్చాయి.

–ఉప్పలపాటి శ్రీను, శ్రీశైలం డ్యాం

★ చతుర, విపుల జంట పత్రికలు వైవిధ్యంగా ఉంటున్నాయి. 'ప్రవేశిక', 'వినోదిని' శీర్షికల గడువు తేదీ గతంలో కంటే ముందుకు జరిగినట్లు తెలుస్తోంది. ఇదివరకులా 20 తేదీవరకూ ఈ గడువు ఉంటే బాగుండుననిపిస్తోంది. జవాబులను అవకాశం ఉంటే మరుసటి సంచికలో ప్రచురిస్తే బాగుంటుందనే నా సూచన. పరిశీలించగలరు.

– మంచాళ శ్రీలక్ష్మి, సాగర్‌నగర్, విశాఖపట్టణం

★ 'మిసెస్ కాసులమ్మ ఎలియాస్ వికాసిని' నవల భార్యాభర్తల మధ్య అనురాగాలు, అవగాహనారాహిత్యాల నడుమ సాగిన కథలా అనిపించింది. భర్త చనిపోయిన తర్వాత వికాసిని సింగర్‌గా ఎదుగుదల చూస్తే మొగుడైన మగవాడు తన జీవితకాలంలో భార్య స్వాతంత్రాన్ని హరించాడనే అనుకోవలసివస్తుంది. టాంక్‌బండ్ కథ బాగుంది.

– అక్కినపల్లి రామారావు, విశాఖపట్టణం

★ 'మిసెస్ కాసులమ్మ ఎలియాస్ వికాసిని' నవల శీర్షికలోనే కొత్తదనాన్ని చూపించి ఆకట్టుకుంది. కథనానికి తగ్గట్టు రవి గారి చిత్రాలు సజీవతను ఉట్టిపడేలా చేసాయి. 'చతుర ప్రపంచం' ఫీచర్ అంటే మాకెంతో ఇష్టం. చతుర ప్రవేశికలో విజేతలుగా నిలిచిన అయిదుగురికి బహుమతులిచ్చినట్లుగా...అన్ని సమాధానాలు సరిగా పంపించిన మిగిలినవారికి కూడా చతుర సంచికలను బహూకరిస్తే బాగుంటుందని నా సూచన.

–నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం టౌన్

★ 'ఆడవారి ఆటలకు అర్థాలే వేరు' శీర్షికన యర్రంశెట్టి సాయి అందించిన 'అపార్ట్‌మెంటాలజీ' మమ్మల్ని నవ్వుల్లో ముంచెత్తింది. ఇది చదువుతుంటే బుల్లితెరలో ప్రదర్శితమవుతున్న డాన్స్‌షోలు గుర్తొచ్చి తెగ ఆనందపడిపోయాం. హాస్యచతురోక్తులతో సాయి గారు కథనాన్ని హాయి హాయిగా నడిపిస్తున్నారు. అభినందనలు.

– కృతి, వారాసిగూడ, సికింద్రాబాద్

---

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net

# నాజీ నేరస్థుల లైబ్రరీ

లండన్‌లో ఉన్న అనేక లైబ్రరీలలో లైనర్ లైబ్రరీకి ఓ ప్రత్యేకత ఉంది. ఇందులో కేవలం రెండో ప్రపంచ యుద్ధంలో జరిగిన అనేక నేరాలకి సంబంధించిన పుస్తకాలు, పత్రికలు మాత్రమే ఉంటాయి. నిజానికి ఈ లైబ్రరీ పుట్టింది లండన్‌లో కాదు. ఇది హాలండ్‌లోని ఆమ్‌స్టర్‌డామ్‌లో ఆవిర్భవించింది.




నాజీలు అధికారంలోకి రాగానే జర్మనీలో నివసించే డాక్టర్ లైనర్ నాజీల వల్ల యూరోప్‌కి సంభవించే ప్రమాదాన్ని ముందుచూపుతో గ్రహించాడు. వారి అరాచకాలని చరిత్ర చేయాలనే కోరికతో ఆయన ఓ లైబ్రరీని స్థాపించదలిచాడు. ఇది జర్మనీలో ఉంటే ప్రమాదమని, సరిహద్దు దాటి హాలండ్ దేశానికి వెళ్లి, ఆమ్‌స్టర్‌డామ్‌లోని పార్క్ హోటల్‌లో ఓ గది అద్దెకు తీసుకున్నాడు. నాజీల నేరాలను వివరించే ప్రతి పుస్తకాన్ని, పాంప్లెట్‌ని, దినపత్రికల్లోని వార్తల్ని, ప్రజల అనుభవాల్ని సేకరించసాగాడు. ఇవన్నీ జర్మనీ నుంచి, యూదుల సానుభూతిపరుల నుంచి రహస్యంగా అందసాగాయి. నాజీల అరాచాకాలను లైనర్ ప్రపంచ రాజకీయ వేత్తలకు, పత్రికా విలేకరులకు పంపసాగాడు.

1939 నాటికి ఈ లైబ్రరీలో పదివేల ఐటమ్స్ చేరాయి. హోటల్ గదిలో ఇక చోటు లేక ఓ ఇల్లు అద్దెకు తీసుకుని సహాయకులని నియమించుకున్నాడు. వీరిలో ఒకరు పారిస్‌లో పని చేసే జర్మన్ పత్రికా విలేకరి డాక్టర్ కర్ట్ జైలన్ జిగర్. హిట్లర్ యుద్ధోన్మాదాన్ని పసిగట్టగానే ఈ లైబ్రరీని లండన్‌కు తరలించారు లైనర్. డాక్టర్ కర్ట్ ఆమ్‌స్టర్‌డామ్‌లోనే ఉండి, హిట్లర్ ఆక్రమించిన దేశాల్లోని నాజీల అరాచకాలను సేకరిస్తూనే ఉన్నాడు.

1940లో జర్మన్స్ హాలండ్‌ను ఆక్రమించుకున్నారు. డాక్టర్ జైలన్‌జిగర్‌ను వారు అరెస్ట్ చేసి కాన్సన్‌ట్రేషన్ కేంప్‌కి తరలించారు. రెండో ప్రపంచ యుద్ధం ముగిసే సమయంలో అతను వారి చేతిలో మరణించాడు. యూరోప్‌లోని మిగిలిన దేశాలను కూడా నాజీలు ఆక్రమించుకోవడంతో స్విట్జర్లాండ్, స్వీడన్, స్పెయిన్‌లాంటి తటస్థ దేశాలనుంచి ఈ లైబ్రరీకి సాయం లభించింది. ఆ దేశ ప్రజలు నాజీల అరాచకాలని సేకరించి, లండన్‌లోని డేవన్ షైర్ స్ట్రీట్‌లోని ఈ లైబ్రరీకి పంపసాగారు. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో ఈ లైబ్రరీని బ్రిటిష్ ఎంపీలు, మిత్రదేశాల ప్రభుత్వాలు, పత్రికా విలేకరులు, రేడియో ప్రసార కర్తలు విరివిగా ఉపయోగించుకున్నారు.

యుద్ధానంతరం నాజీల మీద జరిగిన యుద్ధ నేరాల కేసుల్లో ఈ లైబ్రరీ పబ్లిక్ ప్రాసిక్యూటర్స్‌కి చాలా సహాయం చేసింది. మరో ముప్పై ఏళ్ల పాటు ఈ లైబ్రరీకి సమాచారం అందుతూనే ఉంది. మార్టిన్ బోర్‌మేన్, గోబెల్స్‌లాంటి అనేక




కమంది విచారణలకు సంబంధించిన సమాచారం ఈ లైబ్రరీలో లభ్యమవుతుంది.

నాజీల చేతిలో హింసకు గురైన లక్షలాది మంది యూరోపియన్లకు లైనర్ లైబ్రరీ మెమోరియల్‌గా నిలుస్తుంది.

## అపార్ట్‌మెంటాలజీ-6



# కౌన్ బనేగా కరోర్‌పతి

యర్రంశెట్టి సాయి

కౌన్‌బనేగా కరోర్‌పతి ప్రోగ్రాం మళ్ళీ మూడోసారి స్టార్ట్ అయింది.

ఆరోజు పొద్దునే అసోసియేషన్ ప్రెసిడెంట్ హామీద్‌మియా అపార్ట్‌మెంట్స్‌లో ఉన్నవారందరికీ ఎస్ఎంఎస్ పంపించాడు.

ఇవాళ మన రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లో 'సి' బ్లాక్‌లో ఉంటున్న మీనాక్షమ్మ గారు 'కౌన్‌బనేగా కరోర్‌పతి'లో పార్టిసిపేట్ చేసేందుకు సెలక్ట్ అయినయ్. దాన్దిక్కు కెళ్ళి సాయంత్రం అయిదు గంటలకు ఆమెకు అభినందనసభ చేయనీకి నేను నిర్ణయించింది. అందరూ రాండ్రి!"

అందరూ ఆశ్చర్యపోయారు.

ఎప్పుడూ కోడల్తో గొడవపడుతూండే మీనాక్షమ్మ ఇలా హిందీ ప్రోగ్రామ్స్ చూస్తుందని గానీ, ఇలా ఆ ప్రోగ్రామ్స్‌లో పార్టిసిపేట్ చేసేందుకు ప్రయత్నిస్తుందని గానీ ఎవరికీ తెలీదు.

"మీనాక్షమ్మకు ఇంత జనరల్ నాలెడ్జ్ ఉందా" అడిగాడు శంకరమూర్తి విజయ్ యాదవ్‌ని!

"ఉందంట! ఆమె అల్లుడు ఓసారి మాటల్లో నాతో చెప్పాడు. అతనికెలా తెల్సిందీ అంటే వాళ్ళమ్మాయిని పెళ్ళిచూపులు చూడ్డానికి వెళ్ళినప్పుడు అతని జనరల్ నాలెడ్జిని 'టెస్ట్' చేయడానికి ఒక ప్రశ్న వేసిందట.

"నీళ్ళు కొంచెం కూడా అంటకుండా, నీళ్ళల్లో తడవకుండా ఎన్నో సముద్రాలు దాటిన బస్ పేరేమిటో చెప్పు- చూద్దాం"

ప్రశ్న విని అతను షాకయ్యాడు.

ఆ ప్రశ్నకు ఈ జన్మలో తను సమాధానం చెప్పలేనని వప్పుకున్నాక ఆమె చెప్పిందంట!

ఆ బస్ పేరు క్రిస్టోఫర్ కొలంబస్ అని! అప్పుడు తెలిసిందంట అతనికి!

వాళ్లత్తగారి ఫాదర్- ఆమెను ఆ రోజుల్లో ఐఎఎస్ చేయించడానికని కోచింగ్ ఇప్పించాడంట! ఆ కోచింగ్ సెంటర్లో అన్నీ ఇలాంటివే నేర్పించారంట ఆమెకి. అయితే ఆమె బాడ్‌లక్ ఏమిటంటే ఆమె డిగ్రీ పూర్తి కాలేదు. అయిదేళ్లవరకూ ఒక సబ్జెక్ట్ ఉండిపోయింది.

దాంతో ఆమె ఐఎఎస్ అవాలన్న వాళ్ల ఫాదర్ కోరిక కూడా అలాగే ఉండిపోయిందిట" అంటూ వివరాలు మొత్తం సప్లయ్ చేశాడు.



కౌన్ బనేగా కరోర్ పతీ అంటే అందరికీ లైకింగ్ ఉండటం వల్ల మా ఫ్లాట్స్‌తో చాలామంది ఆ సాయంత్రం మీటింగ్‌కి హాజరయ్యారు.

అందరూ మీనాక్షీదేవిని తెగ పొగిడేశారు.

ముఖ్యంగా లేడీస్!

"నాకూ మీనాక్షమ్మకూ నాలుగేళ్ల నుంచీ పరిచయం! మాకెదురుగ్గా ఉన్న అపార్ట్‌మెంట్ కాబట్టి ఎప్పుడూ కలుసుకుని మాట్లాడుకుంటూండేవాళ్లం! ఆమెకూ, ఆమె కోడలికీ ఎప్పుడూ ఏదొక గొడవలవుతూండేవి. మా కోడల్తో కూడా నాకూ అదే ప్రాబ్లమ్. ఒకసారి నేను ఆవిడను మా ఇంటికి పిలిపించాను. "మీనాక్షిగారూ! నేను ఇందాక మార్కెట్ కెళ్లినప్పుడు ఒక మాంచి పుస్తకం కొనుక్కొచ్చాను- మనకి చాలా ఉపయోగపడుతుంది. చదువుతారా? " అనడిగాను.

"ఏ పుస్తకం అది? " అనడిగిందామె.

"కోడళ్లను చిత్రహింసలు పెట్టటం ఎలా? అనే పుస్తకమండీ!"

అదే ఆవిడ స్థానంలో ఇంకే అత్తగారున్నా ఎగిరి గంతేసి తీసుకునేది. కానీ మీనాక్షిదేవి అందరిలాంటి స్త్రీ కాదు, ఆమె స్పెషల్!

ఆమేమందో తెలుసా!

"అలాంటి పుస్తకాలు వద్దండీ! ఎందుకంటే నేను కనుక్కున్న పద్ధతుల్నే ప్రయోగించటం నా కిష్టం" అని అంటే ఆమె ఇన్నోవేటివ్ టైపన్నమాట! కాపీలు కొట్టే రకం కాదు-" అంటూ ముగించింది సీతారామచంద్రన్.

ఆఖర్లో మీనాక్షీదేవి మాట్లాడింది.



"నేను ఐఎఎస్ కోచింగ్ కెళ్లిన రోజుల్లో కార్ల్‌మార్క్స్ గురించి చాలా చదివాను. అయితే అదేమీ ఇప్పుడు గుర్తులేదుగానీ ఒక్క జోక్ మాత్రం గుర్తుంది. కార్ల్ మార్క్స్ చనిపోయాక అతని భార్యను విలే కరులు వారి వైవాహిక జీవితం గురించి అడిగిన ప్రశ్నలన్నింటికీ జవాబులిచ్చాక ఆఖర్లో ఓ మాట అంది.

"మా వైవాహిక జీవితం ఆనందంగానే గడిచింది కానీ ఆయన 'కాపిటల్' గురించి రాయడం కంటే దాన్ని ఎంతోకొంత సంపా దించి ఉంటే ఇంకా ఎంతో ఆనందంగా ఉండేవాళ్లం!

కనుక మన లేడీస్ కందరికీ ఏజ్ పెరు గుతున్నకొద్దీ ఆర్థికంగా కొడుకుల మీదా, భర్తామీదా ఆధారపడటం కూడా తగ్గి పోయి, తనక్కావలసినవన్నీ సమకూర్చుకో డానికి అవసరమైనంత డబ్బు బ్యాంక్‌లో ఉండేలా ప్లాన్ చేసుకోవాలి" అంటూ ముగించింది.

అందరూ తప్పట్లు కొట్టారు.

ఆ మర్నాడే ఆమె 'కౌన్ బనేగా కరోర్ పతి' ప్రోగ్రామ్‌లో పాల్గొనటానికి బాంబే వెళ్లిపోయింది.

ఆమె ప్రోగ్రాం ఎప్పుడు వస్తుందా అని మా అపార్ట్‌మెంట్స్‌లో ఆడా, మగా ఆఖరికి యువతీయువకులు కూడా ఉవ్విళ్లూరి పోతూ ఎదుర్చూశారు.

చివరకు ఆరోజు రానేవచ్చింది.

మీనాక్షిదేవి వచ్చి హాట్ సీట్లో కూర్చుంది.

అమితాబ్ ముందు మామూలుగా చాలా తేలిక ప్రశ్నలడిగినా, ఆమె అరవై వేలు సంపాదించేసరికి కొంచెం క్లిష్టమ యిన ప్రశ్న వదిలాడు.

"మీనాక్షీజీ! జార్జ్ బెర్నార్డ్‌షా ఒక గొప్ప రచయిత అని మీకు తెలుసు. అతనికి ఎక్కువ ఇష్టమైనదేంటి? "

ఎ. పూలు బి. పుస్తకాలు సి. చిన్నపిల్లలు డి. చెక్కుబుక్కు.

అనడిగాడు హిందీలో!

ఆయన సంగతి నాకు తెలీదు గానీ

"నన్నడిగితే ఎవరికయినా చెక్కుబుక్కు ఇష్టం- అందుకని అదే కరెక్ట్ ఆన్సర్" అందామె ఇన్‌స్టెంట్‌గా.

అమితాబ్ ఆశ్చర్యపోయాడు.

"పక్కా!"

"పక్కాన్నర!"

"లాక్ కియాజాయే"

"మళ్ళీ ఊడకుండా లాక్ చేయండి"

"సహీ జవాబ్" అని అరిచాడు అమి తాబ్ "ఆప్ సాఠ్ హజార్ జీత్ చుకేహై"

"ఒకసారి! షాని అడిగారు- మీ బుక్స్ అన్నిటిలోకి మీకే బుక్ అంటే ఇష్టం అని! వెంటనే ఆయన 'చెక్‌బుక్' అని జవాబి చ్చాడు" అన్నాడు హిందీలో. "మీరు కరెక్ట్ ఆన్సర్ చెప్పారు"

వెంటనే ఇంకో ప్రశ్న అడిగాడు

"రాణీ ఝాన్సీ లక్ష్మీబాయ్ మరణం ఎలా సంభవించింది? "

ఎ. ఆత్మహత్య బి. శత్రువు చేతిలో సి. సహజ మరణం డి. యుద్ధంలో

ఈ నాలుగింట్లో ఏది కరెక్ట్ ఆన్సర్? దీనికి జవాబు చెప్తే ఒక లక్షా ఇరవై వేలు గెల్చుకుంటారు. లేకపోతే ఈ అరవై వేలు కూడా పోతుంది. ఈ కొశ్చెన్‌తో మీనాక్షి ఆలోచనలో పడింది.

"సమాధానం తెలీకపోతే మీకు మూడు ఆప్షన్స్ ఉన్నాయ్ మీనాక్షీజీ! ఆడియన్స్ పోల్- లేదా ఫోనె ఫ్రెండ్ - లేదా ఫిఫ్టీ ఫిఫ్టీ-" అన్నాడు అమితాబ్.

"ఫోనెఫ్రెండ్ వాడుకుంటాను" అందామె ఛప్పున.

"ఎవరికి ఫోన్ చేస్తారు? "

"మా కోడలికి!"

"మీ కోడలికా? ఆమెకి సమాధానం

తెలుస్తుందా?"

"హిస్టరీ గ్రాడ్యుయేట్ కదా! తెలీకపోడా నికేం మాయరోగం?"

వెంటనే అమితాబ్ మీనాక్షి ఇంటికి ఫోన్ చేశాడు.

ఆ ప్రోగ్రాం చూస్తున్న కోడల్తోపాటు మేమంతా కూడా ఆమె ఇంట్లోనే ఉన్నాం.

ఫోన్ మోగింది.

ఛప్పున అందుకుంది మీనాక్షి కోడలు.

"హలో-"

"హలో జయప్రదాజీ! కౌన్‌బనేగా కరోర్ పతీసే మై అమితాబ్ బోల్ రహాహు!"

"అబ్బ! ఎంత కాలానికి అమితాబ్‌జీ- చిన్నప్పటినుంచీ నా డ్రీమ్ ఎప్పటికయినా మిమ్మల్ని కల్సుకుని ఆటోగ్రాఫ్ తీసుకోవాలని! పోనీలెండి! కనీసం మీతోమాట్లాడే ఛాన్సయినా దొరికింది. ఆ పాట ఇప్పటి క్కూడా నా ఫేవరేటేనండీ- మేరే అంగ్ నేమే తుమారా క్యా కామ్ హై... మొత్తం పాట పాడి వినిపించనా? బైహార్ట్ చేశాను చిన్నప్పుడే...." హిందీలో చెప్తోంది. అమితాబ్ కంగారు పడ్డాడు.

ఆమె ప్రవాహాన్ని అడ్డుకుపోతే ప్రోగ్రామ్ మటాష్ అయిపోతుందని అర్థమయింది.

"థాంక్యూ! థాంక్యూ జయప్రదాజీ! మీ అత్తగారు మీనాక్షీదేవి ప్రస్తుతం ఇక్కడ హాట్ సీట్‌లో కూర్చుని ఉంది"

"ఏంటి? ఆమె కూర్చున్న సీట్ హాట్‌గా ఉంటుందా? అబ్బ! బాగా కాలిపోవాలి! అప్పుడుగానీ నాకు ఆనందంగా ఉండదు. అసలు ఆమె మీద సలసలకాగే వేణ్ణీల్లు కొట్టాలని నాకెప్పటినుంచో కోరిక! ఇన్నాళ్లకు మీరయినా నా కోరిక కొంతవరకూ తీర్చారు"

"హాయ్ -హాయ్ జయప్రదాజీ - వన్‌మినట్ -ఏక్ మినిట్ రుకియే-"

"ఓ సారీ - కొంచెం ఎక్కువగా మాట్లాడినట్లున్నాను- సారీ అమితాబ్‌జీ!"

"జయప్రదాజీ అత్తగారు ఇప్పటికే అరవైవేలు గెల్చుకున్నారు. ఇప్పుడు...."

"ఎందుగ్గెల్చుకోదు. ఎప్పుడూ ఎవరి దగ్గర ఎంత కాజేద్దామా అనేగా కుళ్లు ఆలోచనలు! డబ్బంటే గడ్డితినే రకం కాబట్టే కదా మొన్నే మా పుట్టింటి వాళ్ళని వేధించుకుతిని రెండు లక్షలు కాజేసింది? ఆడపడుచు కట్నం చాల్లేదని ఇంకో యాభై గుంజింది..."

అమితాబ్ తల పట్టుకున్నాడు.

"హాయ్ జయప్రదాజీ! మీ అత్తగార్ని మేమడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పటంలో మీ సాయం కోరుతోంది-" అన్నాడు ఆమె ధోరణిని అడ్డుకోడానికి ప్రయత్నిస్తూ-

"ఆ! ఎందుక్కోరదు? అడ్డమయిన చాకిరీ చేయడానికి ఉంది నేనేగా? నేను తప్ప ఇంకెవరున్నారని దీనికి? మెచ్చుకోడానికేమో కూతురు కావాలి! ఆడిపోసుకుడానికీ, చాకిరీ చేయించుకోడానికీ నేను కావాలి! పెళ్లయిందగ్గర్నుంచీ ఆడుతున్న భాగోతమేగా ఇది! మా అపార్ట్‌మెంట్స్‌లో కోడళ్లందరికి తెలుసు! కావాలంటే వాళ్లతోనే చెప్పిస్తా! చూస్కోండి! ఇదిగో శారదా- మాఅత్త గురించి చెప్పుకొంచెం-"

అమితాబ్ కంగారుగా మధ్యలో జొరబడి ఆమెని ఆపటానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు గానీ అతని వల్ల కావటం లేదు.

దాంతో మా అపార్ట్‌మెంట్స్ వాళ్ళందరూ రెండు గ్రూపులుగా చీలిపోయారు. అత్తలందరూ ఒక గ్రూపు - కోడళ్ళందరూ ఒక గ్రూపు-

"జయప్రదాజీ! ఒక్క నిమిషం! హలో- మీకు సరయిన సమాధానం ఎన్నుకోడానికి నాలుగు సమాధానాలు ఉంటయ్. అందులో కరెక్ట్ సమాధానం మీరు చెప్పాలి. అందుకు మీకిచ్చే సమయం




ముప్పయ్ సెకండ్లు- మీ సమయం ఇప్పుడే ప్రారంభమయింది..." అనగానే మీనాక్షి మాట్లాడింది

"జయా! ప్రశ్న ఏంటంటే- ఝాన్సీ లక్ష్మీ బాయ్ మరణం ఎలా సంభవించింది?

ఎ. ఆత్మహత్య బి. శత్రువు చేతిలో సి. సహజ మరణం డి. యుద్ధంలో

ఈ నాలుగు జవాబుల్లో ఏదో ఒకటే కరెక్ట్"

"అవునుమరి- మీరేం మాట్లాడినా నాలుగర్థాలుంటాయ్‌గా! అందుకే- మీ సంగత్తెల్సే అమితాబ్‌గారు అలా నాలుగు సమాధానాల ప్రశ్నవేశారు? చూసుకోండి- మీ నాలుక ప్రతిభ బాంబేవరకూ కూడా పాకేసింది."

"ఏమే- నేనెంత ఆప్యాయంగా మాట్లాడుతున్నాను- నువ్వెలా మాట్లాడుతున్నావు? నీకేమయినా సంస్కారం ఉందా అసలు? "

"అబ్బో సంస్కారం గురించి నీ దగ్గరే నేర్చుకోవాలి! పెళ్ళయిన మూడో రోజునే మా భార్యాభర్తల మధ్య పుల్లలు పెట్టినదానివి కాదూ నువ్వు-" అమితాబ్ కంగారుగా ఇంటర్ ఫియర్ అవటానికి ప్రయత్నిస్తున్నాడు. "హలో మీనాక్షీజీ- యే జగడా కర్‌నేకా సమయ్ నహీ హై.... హలో- జయప్రదాజీ-"

"సారీ అమితాబ్‌జీ- మీరంటే నాకు చాలా గౌరవం! అందుకే మొత్తం పురాణం విప్పటంలేదు. లేకపోతే దాన్ని ఎక్కడుంచాలో అక్కడుంచేదాన్ని..."

ఆ మాటకు మీనాక్షికి కోపం ముంచుకొచ్చింది.

"ఏమిటే నువ్వేంటే నన్ను ఉండేది! నిన్నే ఎక్కడుంచాలో అక్కడ నేనుంచుతా!" అమితాబ్ మళ్ళీ కల్పించుకోక తప్పలేదు.

"హలో మీనాక్షీజీ- ప్లీజ్- ఇది మీ ఇల్లు కాదు- కౌన్ బనేగా కరోడ్‌పతి ప్రోగ్రామ్- భారతదేశమంతా ఈ ప్రోగ్రాం చూస్తోంది..."

"సారీ భయ్యా- నాక్కాదు- బుద్ధి దానికి చెప్పండి-"

"హలో జయప్రదాజీ-"

"సారీ అమితాబ్‌గారు- ఈ గొడవలో ప్రశ్నేంటో మర్చిపోయాను-" అంది కోడలు-

మీనాక్షి మళ్ళీ చెప్పింది ప్రశ్నంతా!

ఝాన్సీ లక్ష్మీబాయి మరణం ఎలా సంభవించింది?

ఎ) ఆత్మహత్య బి) శత్రువు చేతిలో-

ఆ- గుర్తుకొచ్చిందిలే- ఈ నాలుగూ కాదు- వాళ్ళత్తగారే కిర్సనాయిలు పోసి అగ్గిపుల్ల గీసి తగలబెట్టి ఉంటుంది. ఇంకా కట్నాలు కానుకలు తెమ్మని కోడలిని వేధించుకుతినటం- తేకపోతే కాల్చి చంపటం.. మనింట్లో కిర్సనాయిలు లేదు కాబట్టి నేను బతికిపోయానుగానీ..."

"ఏమిటే - ఊరుకుంటున్నకొద్దీ రెచ్చిపోతున్నావ్ - నువ్వు మాత్రం తక్కువేంతిన్నావని?

ఇదిగో అమితాబ్‌జీ! అదిలా పత్తిత్తులాగా కబుర్లు చెప్తుందిగానీ అదెంత గుండెలు తీసిన బంటో తెలుసా? కాపురానికొచ్చిన రెండోరోజు నుంచే నా కొడుకుని నా మీదకు ఉసిగొల్పింది"

"ఏక్ మినిట్ మీనాక్షిజీ..." ఈలోగా కోడలు అందుకుంది.

"ఏంటి? నేను ఉసిగొల్పానా? మీ అబ్బాయి చేతగాని మొగుడు గనుక నువ్వాడించినట్లల్లా ఆడుతున్నాడు. పెళ్ళాంకి మర్యాద ఇవ్వటం తెలీని చవట మీ అబ్బాయి!- దద్దమ్మ ! తల్లి కొంగు పట్టుకు తిరిగే సన్యాసి..."

"ఏంటి పెళ్ళాంకి మర్యాద ఎందుకివ్వటం లేదు, రాత్రిళ్ళు వాడు నీ కాళ్ళు పిసకటం నేను చూడలేదనుకుంటున్నావా? నీ వేషాలు నా దగ్గర కాదు- అన్నీ చూస్తూనే ఉన్నా-"

"హలో మీనాక్షిజీ-" అమితాబ్ అరుస్తున్నాడు 'చెమటలు తుడుచుకుంటూ'

"అసలు వాడు పరమ ఆడంగి వెధవ కాబట్టే నాకిన్ని తిప్పలు! వాడు మగాడిలాగా ఉంటే నాకీ గొడవలెందుకు..."

"హలో మీనాక్షిజీ -హలోజయప్రదాజీ-" అమితాబ్ నానా తంటాలూ పడుతున్నాడు ఆ గొడవ ఆపటానికి.

"వాడు బుద్ధిగా ప్రవర్తిస్తే నువ్విలా నోరేసుకు నా మీద పడతావా? అసలు- ఈ ఇల్లు నా పేరున ఉందని ఇంట్లో ఉండనిస్తున్నారు గానీ లేకపోతే నన్నేనాడో బయటకు గెంటేవాళ్లే- మీరిద్దరూ కలసి-"

"హలో మీనాక్షీజీ-"

"ఉండవయ్యా- నీకూ కోడలొచ్చిందిగా- నీకు మాత్రం తెలీదా ఈ కోడళ్లు ఎంత నంగనాచులో- అయినా నిన్నడిగితే నీకేం తెలుస్తుందిలే! కోడళ్ళ జాతకం అత్తనడగాలి! నీ భార్య జయకు తెలుస్తుంది నీ కోడలి భాగోతం. మీ మగాళ్ళకేం ఉంది? తప్పించుకు తిరగటం తప్ప ఇంకేం తెలుసు మీకు"-

"హాయ్ మీనాక్షీజీ... ఆప్ కా సమయ్ సమాప్త్ హోగయా..."

"అవును మరి! నువ్వు కూడా మా కోడలివైపే పలుకుతున్నావ్‌గా! ఇంక నా సమయం సమాప్తమవక ఏమవుతుంది?

"ఏం! ఆ మాటే నా కోడలికి చెప్పగలిగావా? దాని నోరు చూసి భయపడ్డావా? "

"హాయ్ జయప్రదాజీ- ఆప్ కా సమయ్ సమాప్త్ హోగయా... "

"ముందు మా అత్త మొదలెట్టింది. గనుక దాని టైమ్ సమాప్తం చేయండి- నాది సమాప్తం చేస్తే నేనూరుకోను."

అమితాబ్ ఆఖర్లో లేచి నిలబడి నమస్కారం చేశాడు.

"అమ్మా మీనాక్షీ- అమ్మా జయప్రదాజీ. అబ్ మేరా సమయ్ సమాప్త హోగయా! మై ఏ ప్రోగ్రామ్ ఛోడ్ కే భాగ్ జారహాహూ..." అంటూ బయటకు పరుగెత్తాడతను. అక్కడ ప్రోగ్రాం ఆఫ్ అయిపోయిందిగానీ, మా అపార్ట్‌మెంట్స్‌లో అత్తల గ్రూపుకి, కోడళ్ళ గ్రూపుకి ఫైటింగ్ అప్పుడే స్టార్టయింది. ©

# హాస్యం దివ్యౌషధం



నిత్య జీవితంలో ప్రతి మనిషికీ హాస్యం తప్పనిసరి. హాస్యం లేని జీవితం వ్యర్థం. నవ్వు లేనిదే జీవితానికి పరిపక్వత లేదు. జీవితంలో హాస్యం ప్రభావం ఎంతో ఉన్నతమయినది. చిరునవ్వుతో సమన్వయం సాధించవచ్చు. చక్కని బాంధవ్యాన్ని నెలకొల్పవచ్చు. నవ్వు ఓ విచిత్రమయిన భాష. హాస్యానికి వయోభేదం లేదు. పసిపిల్లల నుండి వృద్ధుల వరకు హాస్యాన్ని ఆస్వాదించవచ్చు. దీని శక్తి అమోఘం. మనిషిలో కలిగే మానసిక ఒత్తిడులను రూపుమాపి ఉత్సాహం, ఉల్లాసం, ఉత్తేజం కలుగజేస్తుంది.

సాధారణంగా మానవ జీవితం దుఃఖభాజనమనే చెప్పాలి. ఎప్పుడో, ఎక్కడో ఆకాశంలో మెరుపు మాదిరి సుఖం కనిపిస్తుంది. సుఖంలో సంతోషం, కష్టంలో దుఃఖం పొందడం మానవసహజం.

మానసిక ఆందోళనకు, తాత్కాలికంగా ఉపశమనం కలిగించి ఉల్లాసం, ఆనందం ప్రసాదించే శక్తి హాస్యంలో ఉంది. మనోవికాసం కలిగించే హాస్యం వలన మానసిక ఒత్తిడి నుండి విముక్తి పొందవచ్చు. మనసు నిశ్చింతగా ప్రశాంతంగా ఉంటే ఆరోగ్యం చేకూరుతుంది. జీవితం సుఖప్రదమవుతుంది.

హాస్య ప్రవృత్తి గల వ్యక్తి ఉత్సాహంగా, ఆనందంగా జీవితాన్ని గడుపుతాడు. చుట్టుపక్కల వారిని సంతోషపెడతాడు. హాస్యదృష్టి గల మనిషి జీవితంలో సంభవించే ఒడిదుడుకులకు చలించడు. ఆటుపోట్లను నిర్భయంగా, ధైర్యంగా ఎదుర్కొనగలుగు

తాడు.

హాస్యాన్ని ఆరు భాగాలుగా విభజించవచ్చు. నేత్రవికాసంతో అధరచలనం కలిగినది స్థితము. పళ్ళు కనిపించే విధంగా నవ్వడం హసితముగా మధురస్వరంతో నిండిన నవ్వును విహసితముగా, తల భుజాలు ఎగురవేయుచు నవ్వడము అవహసితముగా, శరీరమంతా కదుపుతూ కంపించిపోయేలా నవ్వే నవ్వును అతిహసితముగా పిలుస్తారు.

హాస్యంలో ఎన్ని రకాలున్నా, స్మితము, హసితములు మాత్రమే ప్రధానమయినవి.

**నవ్వుతో ప్రయోజనాలు ఎన్నెన్నో..**

✦ పనిలో ఆసక్తి కలిగించి విసుగు, అలసటను దూరం చేస్తుంది.

✦ మెదడు చురుకై జ్ఞాపకశక్తి, సృజనాత్మకత పెరుగు తుంది. అల్జీమర్స్ వ్యాధుల్లాంటివి రావు.

✦ అనెస్థీషియా ఇచ్చిన ప్రభావం కలుగజేయడంతో బాధలు మటు మాయమవుతాయి.

✦ మంచి హార్మోన్లు విడుదలయి రోగనిరోధక శక్తి పెరుగుతుంది.

✦ ప్రాణాంతకమైన కణుతులను నాశనం చేసేందుకు మంచి కణాలు ఉత్పత్తి అవుతాయి.

✦ హృదయారోగ్యాన్ని పరిరక్షిస్తుంది.

హాస్య ప్రియత్వాన్ని ప్రత్యేకంగా అలవరచుకొని అభివృద్ధి చేసుకొనవచ్చు. కొద్దిపాటి శ్రమతో ఎవరయిన అలవరచుకొనవచ్చు. హాస్యం దివ్యౌషధంగా పనిచేసి, మనసును ఉత్తేజపరచి, ఉత్సాహాన్ని పెంపొందింపజేస్తుంది.

పరిస్థితులను ఉన్నదున్నట్లుగా చూడటం హాస్యలక్షణం. అంటే మనకు

హాస్యస్ఫూర్తి లేకుంటే నేనెప్పుడో ఆత్మహత్య చేసుకునే వాడ్ని.

-గాంధీజీ



మనమే ఇతరులు చూపినట్లు చూసుకోవడం. దీనివలన మనలోని గర్వం, అతిశయం, అహంభావం ఉపశమిస్తాయి.

సాధారణంగా చాలామంది జీవితాన్ని తేలికగా గ్రహించలేరు. అలాంటి వారికి హాస్య దృష్టికవసరమయిన సమతాభావం ఉండదు.

జీవితంలో సంభవాలను విషాదాంతాలుగా భావించరాదు. జీవితాన్ని సంపూర్ణంగా గ్రహించాలి. ధైర్యాన్ని విడనాడరాదు.

హాస్యం అసత్యంగా ఉండగూడదు. ఇతరులను అవహేళన చేసి, వారి మనసును గాయపరచేదిగా కూడదు. సున్నితంగా, లలితంగా, మృదువుగా, చమత్కారంగా ఉండాలి. సర్వజనావళిని ఆనందింపజేసే విధంగా ఉండాలి. ఒక వ్యక్తికి గానీ, సమాజానికి గానీ ప్రయోజనకరమయినది కావాలి. హాస్యదృష్టికి ఆత్మవిశ్వాసం ముఖ్యం. హాస్యప్రియుడయిన వ్యక్తికి యోచనా సామర్థ్యం అమితంగా ఉంటుంది. ఇది విజ్ఞానం కంటే ప్రాధాన్యత గలిగినది. సమర్థత లేని విద్య విజ్ఞానం రెక్కలు లేని పక్షివంటిది.

అత్యుత్తమ హాస్యం వలన మానసిక ఒత్తిడులు ఉపశమిస్తాయి. మానవ మనుగడ సుఖకరమవుతుంది. జీవితం ఆనందమయం చేసుకోడానికి హాస్యానికి మించిన దివ్యౌషధం లేదనే చెప్పాలి.

-సువర్చల

'మనతల్లి అన్నపూర్ణ...మన అన్న దానకర్ణ...'
అని జబ్బలు చరుచుకోవడమే కానీ, వాస్తవానికి
ఆరుగాలాలు శ్రమించినా నోట్లోకి నాలుగువేళ్లు
పోలేని బక్కన్నలు వారు.
తాము బాగుపడాలని, తమ భవిష్యత్ భద్రంగా ఉండాలని
సంప్రదాయపంటలకు బదులుగా వాణిజ్యపంటలను
పండించిన... ఆ బక్కరైతులకేం ఒరిగింది?
తెల్లబంగారమైన పత్తే వారిపాలిట విపత్తుగా మారితే
ఇక చేసేదేముంది? రైతుకంట కన్నీరు కాదు పన్నీరు
ఒలికించటానికి ఏంచేయాలో తెలియచెప్పే
వసంతరావు దేశపాండే నవల
**భూమి గుండ్రంగానే ఉండాలి**
ఈనెల చతుర కానుక.

# భూమి గుండ్రంగానే ఉండాలి

- వసంతరావు దేశపాండే

అది భారతదేశంలోని ఒక పల్లె.
ఆంధ్రప్రదేశ్‌లోని ఒక ఊరు.
అన్ని ఊళ్ల లాగానే ఆ ఊళ్లో
అధికవృష్టి, అనావృష్టి ఉన్నాయి.
కరువులు - కాటకాలు ఉన్నాయి.
ఆరుగాలాల కష్టం,
ఆకుమడి కల్లాలు
కష్టం, సుఖం ఉన్నాయి.
ఆ వూళ్లో లేనివి
గుడి లేదు, మసీదు లేదు,
మూఢ భక్తి లేదు,
మఠాలు లేవు.
సారా దుకాణం లేదు,
టీ కొట్టు లేదు,
సోమరితనం లేదు, షోకుల్లేవు,
పెద్ద పెద్ద ఆశయాల్లేవు, ఆశలు లేవు.
ఆ వూరికి నిత్యం ప్రవహించే ఏరుంది.
ఊరి చుట్టూ దట్టమైన అడవుంది.
ఆ వూరిలో
ఎండాకాలం ఎండలెక్కువ.
వానాకాలం వానలెక్కువ.
శీతాకాలంలో చలెక్కువ.
అమాయకత్వం ఎక్కువ.
అజ్ఞానం ఎక్కువ.
మంచిపట్ల నమ్మకం ఎక్కువ.
అలాంటి ఆ ఊళ్లో...

పడమటి ఆకాశంలో సూర్యుడు బండి చక్రంలా దిగబడి పోతున్నాడు. ఆకాశం అప్పుడప్పుడే ఎర్రబడుతోంది.

విశ్వనాథం బడినుండి గుర్రమెక్కి వస్తున్నాడు. ముందు విశ్వనాథం కూర్చున్నాడు. వెనుక సైసోడు కూర్చున్నాడు.

గుర్రం టకాటకా నడుస్తుంది. రోజూ బడికి గుర్రంపైన వెళతాడు విశ్వనాథం. ఆ ఊరినుంచి బడి రెండు కోసులు. ఆ ఊరి నుండి అంతదూరం బడికి వెళ్లి చదువుకునేది విశ్వనాథం ఒక్కడే. విశ్వనాథం ఈడు పిల్లలెవరు బడికి పోరు. పొద్దునే లేచి యింత చద్దన్నమో, వేడి రొట్టో, గటకో తిని చద్ది కట్టుకొని చేలకో, పశువులు తోలుకొని అడవికో పోయేవారు. ఏ పని లేనివాళ్ళు వాగులో పడి ఈతలు కొడతారు. చేపలు పడతారు. ఇంకా సమయం చిక్కితే చెట్టెక్కి ఏ కాలంలో ఏ పండుంటే ఆ పండు, ఏ కాయుంటే ఆ కాయ తింటూ కాలం గడుపుతారు.

రోజు గుర్రమెక్కి బడికి పోవడం విశ్వనాథానికి విసుగు. అందుకని ఇంట్లోకి వెళ్లగానే పుస్తకాల సంచి మూలపడేసి, బట్టలు మార్చుకుని సుభద్రమ్మ పెట్టింది యింత తిని యింట్లోంచి బయట పడతాడు.

చదువు పేరుతో తాను చాలా నష్టపోతున్నానని విశ్వనాథం అభిప్రాయం. ఆ కాలవగట్లు, చెట్లు, కాయలు, ఆటలు ఇవేమి తనకు దక్కడం లేదని బాధ.

నిన్న తండ్రితో పాటు ఊళ్లో కొచ్చిన విశ్వనాథం పట్టుబట్టి గాండ్ల మల్లయ్య గానుగ మొద్దుమీద ఎక్కితే చాలా బాగనిపించింది. నేడు కూడ అతడి కాళ్లు అటే పరుగు తీశాయి.

గాండ్ల మల్లయ్య గానుగెద్దును అదిలిస్తూ మధ్య మధ్యలో గానుగలోని నువ్వులను లోపలికి తోస్తున్నాడు. గానుగెద్దుకు కళ్లకు గంతలు కట్టి ఉన్నాయి. అదే పనిగా తిరిగి తిరిగి విసుగొచ్చిన ఎద్దు అప్పుడప్పుడు మధ్యలో అలాగే నిలబడిపోతుంది.

అప్పుడు మల్లయ్య "హలా! నడు నీ అవ్వ, మిగిలిన పిండి ఎవడు గానుగాడిస్తడు నీ..." అంటూ అదిలిస్తున్నడు.

దినమంతా గానుగ చుట్టూ తిరుగుతూ ఎటూ తోచక ఆ ఎద్దుతో గాని, పోతుతో గాని మాట్లాడ్డం అతడికి అలవాటు. నడిచి నడిచి అలసినప్పుడు గానుగ మొద్దుమీద బండలా కూర్చొని మరీ ఎద్దును అదిలిస్తాడు మల్లయ్య.

అంతలోనే తూనీగలాగ పరుగెత్తుకొచ్చాడు విశ్వం. అతనికి పెట్టిన పేరు విశ్వనాథం కాని అందరూ అతన్ని విశ్వం అనే అంటారు. మరీ దగ్గరివాళ్లు ముద్దుగా "విస్సు" అని కూడా అంటారు.

"నన్ను యీ గానుగ బండపై కూర్చోబెట్టు" అంటూ వెంటపడ్డాడు.

"వద్దయ్యా పడిపోతావ్" అన్నాడు మల్లయ్య.

"నిన్న మా నాన్నతో వస్తే కూర్చోబెట్టావ్గా, నేడు వద్దంటావేంటి"

"దినాం గుర్రమెక్కి చలో చలో అంటూ బడికెళ్ళేటోడివి. గాడిదలాంటి గీ గాను గెద్దు ఎక్కడెందుకు చెప్పయ్య, ఇదేమన్నా ముందుకు పోతదా, వెనక్కు పోతదా, ఉన్నతానే ఉంటది".

"అయినా సరే నాకు యీ గానుగ బండ మీద ఎక్కడమే యిష్టం. ఎక్కించు, కాదంటే మా నాన్నను వెంట తెస్తా"

"నువ్వెక్కితే ఇది అరిగేదా తరిగేదా.. రా" అంటూ పదిలంగా విశ్వాన్ని గానుగ బండపై కూర్చోబెట్టాడు మల్లయ్య.

"భలే భలే హలా" అంటూ గానుగ ఎద్దును అదిలించసాగాడు విశ్వం.

అంతలోనే చిన్న పెద్ద అందరూ జమీందార్ ఇంటివైపు పరుగెత్తసాగారు. విషయం ఏమిటని అడిగాడు మల్లయ్య.

"ఊళ్లోకి జమీన్ దొరగారు వచ్చారట. వస్తూ వస్తూ దొరగారు అదేదో కొనుకొచ్చారట. అందులోంచి మనుషులు మాట్లాడతారట. పాటలు కూడ పాడతారట. చూద్దాం అని వెళుతున్నాం."

"నేను వస్తున్నా" అంటూ మల్లయ్య గానుగెద్దును ఆపి దాని మెడ నుండి కాండిని దించి, నువ్వు కూడ నడుబాబు మీ ఇల్లు కూడా జమీన్ దొరగారి యింటి పక్కనే గదా" అంటూ విశ్వాన్ని గానుగ బండ మీద నుంచి దించాడు.

విశ్వానికి అప్పుడే యింటికి వెళ్లాలని లేదు. అందుకని యింకో వీధి గుండా పరుగులంకించాడు. అటునుంచి వాగు వైపు జుమ్మంటూ నోటితో శబ్దం చేస్తూ పరుగెత్తసాగాడు. వాగు ఒడ్డున ఎర్రగా కాలుతున్న పిడకలను గుండ్రంగా అమర్చారు. అందులోంచి ఎర్రగా కాలిన ఇనుప కమ్మీపట్టా వన్నెతేలి మిరుమిట్లు గొలుపుతోంది. ఆ పక్కనే ఒక ఎద్దును తాళ్లతో కట్టి పడగొడుతున్నారు. అది కిందపడి తన్నుకుంటోంది పారిపోటానికి. అయినా నలుగురు మనుష్యులు దాన్ని బలంగా అదిమి పట్టారు. కమ్మరి ఊశన్న మోకాళ్లపై కూర్చొని ఎద్దు డెక్కల అడుగు భాగాన ఇనప నాడాలను ఉంచి, ప్రత్యేకంగా తయారుచేసిన మేకులతో నాడా ఊడి రాకుండా కొడుతుంటే విశ్వం కళ్లప్పగించి చూస్తున్నాడు.

"దానికి నొప్పి పెట్టదా" అంటూ అడిగాడు విశ్వం అప్రయత్నంగా.

"దానికి నొప్పి పెట్టకుండానే యీ నాడాలు కొట్టడం"

"మరి అది అలా గింజుకుంటుందేమిటి? "

"నొప్పితో కాదు. అలా పండి, నాడాలు కొట్టించుకొనుడు యిష్టం లేక" అంటూ చెప్పారు ఎవరో.

విశ్వానికి తను ఏడో తరగతి చదువుతున్నా యిన్ని విషయాలు పుస్తకాల్లో ఉండవనిపించింది. ఉన్నవి యింత ఆసక్తికరంగా, దృశ్యాత్మకంగా కనిపించవనిపించింది.

'జమీన్ దొరగారి- బంగ్లాలో అదేదో వింత వస్తువు తెచ్చారట. అది మాట్లాడుతుందట, పాడుతుందట' అనే వార్త ఆ కమ్మరి కొలిమికి చేరింది.

గబాగబా పని ముగించుకొని అక్కడున్న వాళ్లంతా జమీందార్గారి బంగ్లాలో



## కొత్తగాలి...

**తల్లిది**
**పిల్లల పెంపకం**
**తండ్రిది**
**ఆస్తి పంపకం**

-బి.మోహనకుమారి, చెన్నై

ఆ వింత వస్తువును చూడ్డానికి పరుగు లాంటి నడకతో ముందుకు కదిలారు. అయిష్టంగా వాళ్లతో పాటు యింటివైపు దారితీసాడు. విశ్వం.

జమీందార్‌గారి బంగ్లా యింతెత్తున పడుకున్న సింహంలా ఉంది. ఆ బంగ్లాకు యిరవైమెట్లు, ఆ మెట్లెక్కాక విశాలమైన స్థలం. ఆ స్థలం మధ్యలో రెండంతస్తుల మేడ, ఆ మేడపైన రెండు కర్రలను అమర్చడానికి ఇద్దరు మనుషులు ప్రయత్నిస్తున్నారు. ఆ వెదురు కర్రలకు జానెడు వెడల్పుతో నాలుగైదు బారల పొడుగున్న రాగి వలను అమర్చడానికి కష్టపడుతున్నారు వాళ్లు. ఆ రాగి వల నుండి ఒక తీగ ఆ పాటల పెట్టెలో అమర్చాడు ఒక మనిషి.

ఆ అమర్చినవాడు ఆ పెట్టె వెంట బస్తీ నుంచి వచ్చినట్టున్నాడు. ఆ పెట్టెలోంచి మరో తీగను దూరంగా భూమిలోకి అమర్చాడు. తరువాత అదేదో పెట్టెలోంచి - ఒక తీగను మళ్లీ ఆ పాటల పెట్టెలోకి అమర్చాడు. అవేవో త్రిప్పాడు. ఒక నిమిషం తరువాత ఆ పాటల పెట్టెలోని ఒక చిన్న దీపం పైసంత ఉంది. అది వెలిగింది ఆకు పచ్చగా మెల్లగా. అందులో రకరకాల శబ్దాలు రాసాగాయి. ఆ శబ్దాలు విన్న జనం కొందరు భయంగా ఒక అడుగు వెనక్కు వస్తే మరికొందరు ఆసక్తిగా దీని సంగతేంటి అన్నట్టు ముందుకు ఒక అడుగేసి చూడ సాగారు. ఆ పెట్టె వెనక భాగాన సందుల్లోంచి గాజు బుడ్లలోంచి వెలుగులు కనిపించసాగాయి. కాసేపటికి ఆకాశవాణి ఢిల్లీ కేంద్రం అంటూ ఎవరో మాట్లాడసాగారు. అందరూ నోళ్లు వెళ్లబెట్టి చూస్తూ విస్తుపోసాగారు. అచ్చం ఎదురుగుండా మనిషి నిలబడి ముచ్చట్లు చెపుతున్నట్లే ఉంది.

రేడియోలోంచి మాటలు రావడంతో జమీందార్‌గారు ఇంట్లోంచి పొడుగాటి వరండాలోకి వచ్చి ఇంత పొడుగు వరండా దాటి ఆరుబయట వాకిట్లోకి వచ్చారు. అంతసేపు ఆరుబయట మెట్లమీద ఉన్న జనంలో కలకలం తగ్గింది. జమీందార్ గారి వెనకాలే పూజారి శ్రీధరాచారి వచ్చాడు. జమీందార్‌గారు కూర్చునే కుర్చీని తన భుజం మీది తుండుగుడ్డతో ఒకసారి దులిపి తన భక్తి శ్రద్ధలను ప్రకటించుకున్నాడు.

జమీందార్‌గారు పేరుకే జమీందార్. చుట్టూ ఒక పది గ్రామాలకు ఆయన వతన్‌దార్. బాగా భూమి ఉండడంతో అందరూ జమీందార్ దొర అని అంటారు. అతడికి వేట, గుర్రపు పందాలంటే యిష్టం. ఆ రెండు ఉంటే అతడికి ఏమీ అక్కర్లేదు. ఆ ప్రాంతం వ్యవహారాలన్నీ పటేల్ పట్వారీలే చూసుకుంటూ ఉంటారు. జమీందార్‌గారు యీ ఊళ్లో ఉన్నారు. కాబట్టి ఒక నాలుగూళ్ల మధ్య పటేల్, మరో నాలుగుళ్ల మధ్య పట్వారీ నివాసముండి అతడి వ్యవహారాలు చూస్తూ ఉంటారు. జమీన్ వ్యవహారాల్లో పాపం పుణ్యం అంతా ఆ ఇద్దరిదే. జమీందార్ గారు ఎప్పుడో రెండు మూడు నెలలకు ఒకసారి వచ్చి వారం పదిరోజులు ఉండి కావలసినంత డబ్బు సమకూర్చుకొని మళ్లీ ఏ పట్నానికో వెళ్లిపోతాడు. ఏళ్ల తర



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

★ 'చతుర'లో ప్రచురితమవుతున్న ప్రవేశికలలోనే సమాధానాలు నింపి గడువుతేదీలోపు కార్యాలయానికి అందేలా పంపించాలి. జెరాక్స్‌లు, తెల్లకాగితాలపై రాసిన జవాబులు పరిశీలనకు స్వీకరించరు.

★ 'మనసున ఉన్నదీ...' పాఠకుల శీర్షిక. 'చతుర' సంచికలపై, శీర్షికలపై తమతమ అభిప్రాయాలను స్వేచ్ఛగా, నిర్మొహమాటంగా వ్యక్తం చేసే వేదిక. స్పష్టంగా, క్లుప్తంగా పాఠకులు తమ అభిప్రాయాలను ఏనెల సంచికపై ఆనెల రాయండి.

**చతుర**


**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**



బడి సరియైన అజమాయిషీ లేక భూమి మీద రాబడి పెద్దగా రాదు. వచ్చింది కిందివాళ్లు తినగా మిగిలింది జమీందార్ గారిది. కాని అతడి షోకులకు, విలాసా లకు, జల్సాలకు యింట్లో ఉండే నగానట్రా, బ్యాంకు ఖాతాలు చాలా మట్టుకు ఖాళీ అయిపోతున్నాయని జనం అనుకుంటూ ఉంటారు.

ఊరి నుండి వచ్చినప్పుడు ఊళ్లో ఉండే పెద్దలకు కబురు పంపి గంట రెండు గంటలు పిచ్చాపాటి వేయడం అతడికి అలవాటు. నేడు కూడా అలాగే కొంత మందికి కబురు అందింది. కబురు అంద కపోయినా కొంతమంది వచ్చి కలిసి వెళుతూ ఉంటారు.

రేడియోలో హిందీలో, ఇంగ్లీషులో వార్తలు అయిపోయాయి. స్తంభానికి కట్టి వేలాడదీసిన గ్యాస్ లైటు గుడ్డిగా వెలుగు తోంది. ఉండీ ఉండీ ఆరిపోబోతుంది. అంతలోనే మంగలివెంకన్న ఇంట్లోంచి ఆదరబాదరాగా వచ్చి గ్యాసు లైట్‌ను కిందకు దింపి పంపుకొట్టి, రెండు మూడు సార్లు గట్టిగా నోటితో ఊదడంతో పెట్రో మాక్స్ లైట్ దివ్యంగా వెలగసాగింది.

జమీందార్‌గారితో పిచ్చాపాటి వేసేవాళ్లు, కుశలం అడిగేవాళ్లు ఒక్కొక్కరే వస్తు న్నారు. అంతలోనే రఘునాథంగారు కూడా వచ్చారు. వెంట కొడుకు విశ్వ నాథం కూడా ఉన్నాడు. రఘునాథం గారికి ఆ ఊళ్లోను, చుట్టుపక్కల రెండు మూడు ఊళ్లలో భూములున్నాయి. చదు వుకున్నవాడు. నెమ్మదస్తుడు. ఊరి జనం మంచి, చెడు, కష్టం సుఖం చెప్పుకునే అందరి మనిషి. రఘునాథంగారు వచ్చి పేరుపేరుగా అందరినీ పలకరించారు.

రేడియోలోంచి హిందీ పాటలు శ్రావ్యంగా వినిపిస్తున్నాయి. పాటకు పాటకు మధ్య కొంత నిశ్శబ్దం. అప్పుడం దుకున్నారు జమీందార్‌గారు. "గ్రామఫోను రికార్డులు కొనలేక చస్తున్నామనుకోండి. అందుకని యీ రేడియో తెచ్చాను. దీంతో ఎప్పటి వార్తలు అప్పుడే తెలుస్తాయి. పేపరు ఎలాగూ మన ఊరివరకు రాదు. ఇటు దీంతో వార్తలు వినొచ్చు అటు పాటలు వినొచ్చు" అన్నారు రఘునాథం గారితో.

"నిజంగా చాలా మంచి పనిచేసారు" అంటూ మెచ్చుకున్నారు రఘునాథం గారు.

"అయ్యగారు యీ రేడియో ఒక్కటే కాదు, మరొక కొత్త వస్తువు కూడా తెచ్చారు. దీన్ని వస్తువు అనొచ్చో లేదో నాకైతే తెలియదు గాని" అంటూ ఒక పిడి కెడు పత్తి గింజలు చూపించారు శ్రీధరా చారి.

"ఇవి పత్తి విత్తనాలు. మనవైపు ఎవరం దీన్ని పంటగా పండించడం లేదు. కాని మహారాష్ట్రలో, అటు ఆంధ్ర ప్రాంతంలో యిప్పటికే యీ పంటను మహా జోరు మీద పండిస్తున్నారు. మన ప్రాంతంలో కూడా అక్కడక్కడ పండిస్తున్నారు. మన ఊళ్లో కూడా పండించాలని కొంత విత్తనం తెచ్చాను. దీన్ని అమెరికన్ కాటన్ అంటారు" అన్నారు జమీందార్ గారు.

"పత్తి విత్తనాలు మనకు కొత్తవేం కాదు. మన యింట్లో అక్కడక్కడ వత్తులకు, దారాలకు, యింకా యితర ఉపయోగాలకు పెరటి చెట్టుగా పెంచుకోవడం చూసాం. కాని పెద్ద ఎత్తున పంటగా మనవైపు లేదు ఇది" అన్నాడు రఘునాథంగారు.

"పిచ్చి కాత కాస్తుంది. మళ్లీ ధర కూడా ఎక్కువే. పూర్తిగా రూపాయల చెట్టు అను కోండి ఇది" అన్నారు జమీందార్‌గారు.

మెట్లమీద నిలబడిన జనం ఎగబడి చూస్తున్నారు. సమాజంలో ఉన్న వర్ణ వ్యవస్థ ప్రకారం ఆ మెట్లమీద జనం నిల

బడి ఉన్నారు. అగ్రవర్ణాల వారు పైన అరుగుమీద కుర్చీల్లో, బెంచీమీద కూర్చు న్నారు. తర్వాతి వర్గంవారు మెట్లమీద కూర్చొని అన్నీ చూస్తూ, గమనిస్తూ వింటు న్నారు. మెట్ల కింద చివర్ల హరిజనులు, గిరిజనులు ఉన్నారు. శ్రీధరాచారి అంద రికి ఆ కొత్త రకం పత్తి విత్తనాలు చూపిం చాడు.

"మీరు కూడ పండిస్తానంటే బస్తీనుంచి, రేపే మనిషిని పంపి తెప్పిస్తా, అందరు వేసి చూడండి. పంట జోరుగా ఉంటుంది. చెట్టంతా పూతా కాతా.. చేతి నిండా రూపాయి బిళ్ళలే అనుకోండి" అన్నారు జమీందార్.

"తెప్పించండి, మీతో పాటు మేము? " అన్నారు రఘునాథం గారు.

"అలాగే" అన్నారు జమీందార్‌గారు.

పత్తి బట్టల తయారీకి ఉపయోగపడు తుందని వాళ్లకు తెలుసు. ఊళ్లోని పద్మ శాలీ కుటుంబాల వాళ్లు బస్తీ నుంచి దారం కొనితెచ్చి గుడ్డలు నేయడం వాళ్లు చూస్తు న్నదే. కాని, ప్రత్తిని పండించడం గురించి కాని, దాన్ని దారంగా మార్చడం వరకూ జరగాల్సిన వివిధ ప్రక్రియల్ని గురించి గాని వాళ్లకేమీ తెలియదు. కనుక వాళ్ల దృష్టిలో ప్రత్తి కేవలం అమ్ముకోవడానికి తప్ప మరెందుకు పనికిరాని పంట. ఏమైతేనేం జమీందారు మాట నిలబెట్టుకు న్నారు.

ఊళ్లోకి పత్తి విత్తనాల ప్రవేశం, ఔత్సా హిక రైతులు చేలలో విత్తడమూ జరిగిపో యింది. ఆ యేడు పత్తి పంట బాగానే పండి, పండించిన వాళ్లు నాలుగు కాసులు కళ్ల చూడడంతో మిగతా వాళ్లలోనూ ఆశ రగులుతోంది. ఫలితంగా సాంప్రదా యంగా సాగుతున్న పంటల విస్తీర్ణం తగ్గి, పత్తి సాగు విస్తరించింది. పర్యవసానంగా వస్తుమార్పిడి పద్ధతి సన్నగిల్లి వర్తక విధానం తలెత్తింది.




పడమటి పొద్దు తల్లి కడుపులో పడబో తోంది. ఆకాశంలో పక్షులు కయ్యర్ కయ్యర్ మంటూ అరుస్తూ తమ గూళ్ల వైపు కదులుతున్నాయి. పశువుల కాప రులు తమ పశువులను ఇంటి దిక్కు మళ్లిస్తూ జీవాలను లెక్కజూసుకుంటు న్నారు. చాలామంది అప్పటికే అరకలు విప్పి, ఇంటి ముఖాన పోయేందుకు సిద్ధ మవుతున్నారు. ఇంటి ముఖాన వస్తున్న వాళ్లకు బక్కన్న ఇంకా అరక బట్టి ఉండటం చూసి ఒకవైపు ఆశ్చర్యం మరో వైపు ఆనందం కలిగాయి.

బక్కన్న నిన్న మొన్నటివరకు పశువుల గాసిన పోరగాడు. అన్న చాటు తమ్ముడు పోయినేడు అన్న చనిపోవడంతో ఉన్న భూమి పంచుకొని అన్నభార్య ఇద్దరు పిల్లల్ని తీసుకొని పక్కూరుకు 'పాటు' (మారుమనువు) పోయింది. అప్పట్నించి బక్కన్న ఒంటిచేతిగాడయ్యాడు. చిన్నపుడే తల్లి తండ్రీ పోవడంతో బక్కన్నకు అన్ని పనులూ వచ్చు అందుకని ఎలాంటి ఆయాసం లేకుండా యింత వండుకొని తింటూ ఇరుగు, పొరుగుల సలహా సంప్ర దింపులతో పదెకరాల భూమి సాగుకు దిగాడు బక్కన్న. పనిమీద పడితే యింకో ధ్యాస వుండదు అతడికి. అందుకని వెనకా ముందు చూసుకోకుండా అరక నడుపుతు

న్నాడు.

"ఏం పిల్లగా, భూమి అంతా యియ్యాల్లనే పొతం చేస్తావా ఏంది? జర అటు చూడు, పొద్దెట్ల గూకుతున్నదో" అందొకామె.

"జప్న పోతే అడిగెటోళ్లు లేరు. ఆలస్యమయితే అలిగెటోళ్లు లేరు. అందుకే దించిన తలకాయ లేపకుండా గుంటుక కొడుతుండు" అని యింకొకరంటే.

"ఊల్లెగింత మందున్నరు. ఎవల్లనో ఒకల్లను చూసి కట్టుకోరాదయ్యా. ఏల్లకింత అండిపెడతది, సద్ది దెస్తది, ఈ యాల్లకు పొద్దుగూకింది పోదాం పా మొగుడా అని గూడ చెప్పతది. ఏమంటవ్" అంటూ రెట్టించింది వదిన వరుసైన ఒకామె.

బక్కన్న ఏమీ మాట్లాడ్డం లేదు. సిగ్గుతో తలవంచుకొని చకచకా అరక యిడిసి, అన్ని సర్ది వాళ్లతోపాటు ఎడ్లు తోలుకొని



వచ్చి నిలబడ్డ వాళ్లతో కలిసాడు.

"ఏం పిల్లడా... నేను నిజంగానే అడుగుతున్న. లగ్గం జేసుకోరాదు. అటు ఇటు రెండు తీర్ల పనులు చేసుకొని పరేషాన్ ఎందుకవుతవు? " అని ఒకామె అంటే.

"నువ్వొరుకోవే ఎనకా ముందు ఎవలూ లేనోడు. ఏమని చెప్తడు" అని యింకో ఆమె అంటే "దేనికన్నా యాల్ల రావాలి. పిల్లగాడు కష్టపోతు, బుద్ధిమంతుడు, నేడు గాకుంటే రేపు ఏ అయ్యన్న నడిచి వచ్చి పిల్లనిస్తడు మా మరిదికి" అని యింకో ఆమె వెనకేసుకొచ్చింది.

బక్కన్న ఏమీ మాట్లాడలేదు.

అందరితో కలిసి మౌనంగా నడుస్తున్నాడు. పశువుల మందలు అప్పుడే యింటిదారి పట్టడంతో ఎవరి నడక ఎదగడం లేదు. ప్రతి యింటికి కావలసినంత పశుసంపద, ప్రతి ఇంటికి కనీసం ఒకటి రెండు ఆవులు, ఒక బర్రె, రెండు మేకలు, కోళ్లు. అన్ని మందలు మేయడానికి పోయి సాయంత్రం యింటి ముఖం పట్టినపుడు చేలో కెళ్లిన మనుషులకు ఎప్పుడు యింట్లో పడదామా అని వుంటుంది. కాని ఆవుల మందలు, బర్రెల మందలు, మేకలు, గొర్లు, నడవడానికి యింత సందియ్యవు. అయినా ఓపిగ్గా పశువులను తప్పించుకుంటూ చకచకా నడుస్తున్నరు- చేల్లోంచి యిండ్లకు మళ్లిన వాళ్లు.

పశువుల గిట్టలతో లేచిన దుమ్ము ఊరి పానాది పొంటె నిలువెత్తు ఎర్రటి ధూళి మేఘం కమ్ముకుంది. వాకిట్లో, కొట్టాల్లో కట్టేసిన లేగదూడల పెయ్యలు తమకు పాలిచ్చే తల్లుల రాకను గుర్తెరిగినట్లు మోరలెత్తి చూస్తూ అరుస్తున్నాయి.

చూస్తుండగానే చీకట్లు ముసురుకుంటున్నాయి. రాని పిల్లల గురించి 'కొక్... క్కొక్... క్కొక్...' అంటూ కోళ్లు అరుస్తూ వెతుక్కుంటున్నాయి.

క్రమశిక్షణ గల సిపాయిల్లా పశువులు యిండ్లకు జేరి వేటి గూటాల ముందు అవి నిలబడ్డాయి. బక్కన్న కోళ్లను కమ్మి, పశువులను కట్టేసి వాటి ముందు యింత మేత పడేసి, గోలెంలోని నీళ్లలో కాళ్లు మొఖం కడుక్కొని వెంటనే ఏదో గుర్తొచ్చిన వాడిలా చటుక్కున యింట్లోకి వెళ్లి పొద్దున చేసి పెట్టుకున్న పప్పును, రొట్టెలను చూసుకున్నాడు. ఎందుకన్న మంచిదని పప్పును వాసన చూసాడు. పాచి పోలేదు. రొట్టెలకు చీమలు పట్టాయి. పట్టిన చీమలను ఊది వదిలించి తృప్తిగా శ్వాస పీల్చుకున్నాడు. ఈ పూటకు వంట తప్పిందని అతడి సంతోషం.

దూరంగా పక్క వీధిలో సుంకరోడు డప్పు చాటింపు వేస్తున్నడు. మాటలు లీలగా వినిపిస్తున్నాయి. ఇటువైపు వచ్చినపుడు వినొచ్చని వినే పని మాని పాలు పితకడానికి దూడను వదిలాడు.

పిండిన పాల ముంతను అలాగే పట్టుకొని నాలుగిల్ల ఆవల ఉన్న రఘునాథం గారి యింటి ముఖం పట్టాడు బక్కన్న. రఘునాథం చిన్నపాటి భూస్వామి. ఆ ఊళ్లో జమీందార్‌గారి తర్వాత రఘునాథం గారే కలిగినవాళ్లు. ఆయన యింట్లో పాడి పశువులు అన్ని ఒక్కసారే వట్టిపోయాయి. బక్కన్నకు పాల ఉపయోగం లేదు కాబట్టి ఒకపూట పాలు వాళ్లకు యిచ్చేస్తాడు.

బక్కన్న పాలు పట్టుకొని లోపలికి వెళుతుంటే రఘునాథంగారి శ్రావ్యమైన కంఠం వినిపించింది. ఆయన భాగవతంలోని పోతన పద్యాలను రాగయుక్తంగా పాడి వినిపిస్తున్నాడు. రోజూ కాసేపు సాయంకాలం భోజనానికి ముందు తులసికోటలో దీపం పెట్టాక భాగవతంగాని, రామాయణం గాని చదవడం ఆయనకు అలవాటు. ఒక అరగంట అందరూ పనులు

**కొత్తగాలి...**

**పూర్వం**
**మిర్చి 'ధర' మండేది**
**ఇపుడు-**
**ఏకంగా 'మిర్చి' మండుతోంది**

-శైలూషి, శ్రీకాకుళం

మానేసి ఆ పారాయణాన్ని వింటూ ఉంటారు.

దూరంగా లాంతరు పెట్టుకొని రఘునాథంగారి కొడుకు విశ్వనాథం, ఒక్కడే ఏదో చదువుకుంటున్నాడు. బక్కన్న వెళ్లిన కాసేపటికే రఘునాథం గారి పారాయణం ముగిసింది. ఎవరి పనుల్లో వాళ్లు మళ్లీ చొరబడ్డారు. అంత సేపు పారాయణాన్ని వింటూ ఉన్న మంగలి వెంకన్న, చాకలి రాజన్నలు కూడా తమ తమ పనుల్లోకి మళ్లారు.

మంగలి వెంకన్నకి రోజూ రఘునాథం గారి యింట్లో, జమీందారుగారి యింట్లో లాంతర్లు తుడిచి, కిరసనాయిలు పోసి లాంతర్లు వెలిగించి ఎక్కడ తగిలించాల్సిన వాటిని అక్కడ తగిలించి పోవడం అతడి పని. అవసరమైనపుడు గడ్డాలు, క్షవరాలు చేయడంతోపాటు రోజూ ఇంట్లో దీపాలు వెలిగించడం అతడి విధుల్లోకి వచ్చేది. అవసరమైనప్పుడు ఒంటికి మాలిష్ చేయడం, కాళ్లలో ముళ్లు గుచ్చుకుంటే తీయడం కూడా అతని పనే. పెళ్లిల్లు, పేరంటాళ్లలాంటి శుభకార్యాలు జరిగితే ఆహ్వానాలు అందించడం, పత్రికలు పంచడం చాకలి రాజయ్య పనైతే, ఆ శుభ కార్యాలకు దివిటీలు వెలిగించడం, అవసరం అనుకుంటే సన్నాయి వాయించడం కూడా మంగలి వెంకన్న పనే.

బయట మళ్లీ సుంకరోడి డప్పు వినిపించింది. డప్పు కొట్టడం అయిపోవడంతో చాటింపు మొదలుపెట్టాడు. "అందరూ వినుండ్లి... ఆడోళ్లు, మొగోళ్లు, పిల్లలు, పెద్దలు, ముసలోళ్లు, తసలోల్లు, కుంటోళ్లు, గుడ్డోల్లు అందరూ ఇనుండ్లి. ఇయ్యాల రాత్రి జమీన్‌దొర గారి బంగ్లా ముందు ఈ ఊరి పనోళ్లు చాకలి, మంగలి, సుంకరి కుమ్మరి, కమ్మరి, వడ్లోళ్లు అన్ని పన్లోల్ల పంచాయితీ ఉన్నది. అందరూ రావాలి. రాకుంటే పంచులు చేసిన తీర్పుకు కట్టువడి ఉండాల. అందరూ రండహో" అంటూ మళ్లీ డప్పు కొట్టి వెళ్లిపోయాడు.

ఆ ఊళ్లో అన్ని వృత్తులవాళ్లు తమకిచ్చే 'దాని' (పంట) గురించి అసంతృప్తిగా ఉన్నారు. అన్ని వృత్తుల వాళ్లు ఊరిమీద అందరికి కావలసిన తమ వృత్తి పనులు చేసి పెడతారు. చేసిన పనికి డబ్బులివ్వడం అంటూ ఏమీ ఉండదు. పండిన పంటలో అరకకు ఇంత అని ఖరారు చేసింది ఇవ్వాలి. పండించిన ప్రతి పంటలో వృత్తిపని వాళ్లకు 'దాని' ఇవ్వాలి. అదే వాళ్ళ జీవనాధారం. ఈమధ్య కాలంలో వాణిజ్య పంటలైన పత్తి రావడంతో వృత్తి పనివాళ్లకు పంటలో ఎవరూ వాటా ఇవ్వడం లేదు. 'దాని' కింద పత్తి పంటను కొలవడం లేదు. రైతులు వేసే పంట విస్తీర్ణంలో పత్తి శాతం రోజురోజుకు పెరుగుతోంది. పత్తి బదులు ఇంకో పంట వేసి ఉంటే, దాంట్లో నాలుగు గింజలు వీళ్లకూ దక్కేవి. వృత్తి పని వాళ్లు పత్తి పంటలో 'దాని'ని ఆశించలేదు. అలా అందరూ 'దాని' కింద పత్తిని ఇచ్చినా అందరి దగ్గర జమ చేసుకొని వచ్చిన మొత్తాన్ని బస్తీకి వెళ్లి అమ్ముకోలేదు. ఇప్పుడు ఆ దాని గురించే పంచాయితీ.

ఇంటికెళ్లిన బక్కన్నకు సంధ్యా దీపం ఇంకా ముట్టించనే లేదనే ధ్యాస వచ్చి నిప్పుకోసం పక్కింటికి వెళ్లాడు. ఆడదిక్కు

లేని సంసారం. బక్కన్న ఇంట్లో నిప్పు ఎప్పుడూ ఆరిపోతూనే ఉంటుంది. అలా ఆరిపోయినప్పుడల్లా ఇంకొకరింటికి వెళ్లి నిప్పు తేవలసిందే. అగ్గిపెట్టెలు ఏ కల వాళ్లో వాడే వస్తువులు. ఆ ఊళ్లో ఒక ఇంటి నుంచి ఇంకో ఇంటికి నిప్పు అడుక్కో వడం రివాజు. ఒక్కోసారి నాలుగైదు ఇళ్లు తిరిగితే గాని నిప్పు పుట్టేది కాదు. తప్పని సరి పరిస్థితుల్లో చకుముకి రాయితో నిప్పు రాజేసేవారు.

పక్కింటి నుంచి పిడక మీద ఇంత నిప్పురవ్వ అడుకొచ్చి వాకిట్లో ఆరిపోయి ఉన్న కుంపటిని అంటించాడు. కుంపటి రాజుకొని, వాకిట్లో ఇంతెత్తున మంటలేచి నాలుగు దిక్కుల వెలుగు వ్యాపించింది. అందులోంచి ఒక పుల్లతో ఆముదపు దీపం వెలిగించాడు బక్కన్న. "ఇంకా చాకలి రాజన్న రాలేదేంటా" అని అనుకుం టుంటే రాజన్న రానే వచ్చాడు.

"రొట్టెయ్యే బక్కన్నా" అంటూ రావడం తోనే అరిచాడు.

బక్కన్న ఇంట్లోకి వెళ్లి ఒక రొట్టె దాని పైన ఇంత పప్పు వేసుకొని వచ్చి రాజన్న గిన్నెలో వేసాడు. రాజన్న మూడు గిన్నెలు వేరువేరుగా పట్టుకున్నాడు. రొట్టె కూరలకు ఒక గిన్నె, జొన్న గటకకి ఒకటి, పప్పుకి ఒకటి. రోజూ సాయంకాలం బట్టలు ఇచ్చి వెళ్లి చీకటి పడ్డాక తిండివేళకు మళ్లీ వస్తాడతను. ఇంట్లో ఉండే సభ్యులను బట్టి ఒకటి లేదా రెండు రొట్టెలు ఇంత కూరనో పప్పో వెయ్యాలి. రొట్టెలు లేకుంటే జొన్న గటక అయినా వేయొచ్చు.

పండగలకు పబ్బాలకు బువ్వ వెయ్యాలి. ఇదిగాక సంవత్సరానికి ఇంత 'దాని' (ధాన్యం పంట) కూడా ఉంటుంది. చాకలి రాజన్న ఇంట్లో ఎప్పుడోగాని వంట చేయడం జరగదు. అందరూ సాయం కాలం వండిందే వేస్తారు. వేయాలి కాబట్టి ఏదో ఒకటి వేయరు. ఎంగిల్లు ముంగిల్లు అసలు వేయరు. ఇదంతా పల్లెటూరి రివాజు.

"నీ రొట్టెలు మస్త్ కడక్ గుంటయ్ బక్కన్న. రోజూ పొదిమికి మల్ల అండు కోవా ఏంది? " అంటూ అడిగాడు రాజన్న.

"నీకు తెల్వందేముంది రాజన్న, ఒక పూట అండుకొని రెండు పూటలు తింట సేను. అందుకే పొద్దుగాల్ల చేసిన రొట్టె కాస్త సక్త్ గుంటది" అన్నాడు. "అయినా తీయ్ అందరు గరమ్ గరమ్ మెత్తటి రొట్టెల్లో నీ దొక్కటే గిట్లుంటది. పండ్లు డాల గని ఇసుంటి రొట్టె తింటే ఆ మజానే ఏరు. సంక్రాంతికి సక్కిలాలు తిన్నట్లుం టది. అవేగని పంచాయితీకి అస్తున్నవా లేదా" అన్నాడు రాజన్న.

"అస్త, ఎందుకురాను గింత తిని ఎల్త ఇగ"

"కానియ్ మరి జప్పున తిని అచ్చేయ్ ఆ" అంటూ రాజన్న వెళ్లిపోయాడు.

జమీన్ దొరగారి బంగ్లా దగ్గరకు ఒక్క రొక్కరే వస్తున్నారు ఊరివాళ్లు. మంగలి ఎంకన్న పెట్రోమాక్స్ లైట్ ముట్టిచ్చే పనిలో ఉన్నాడు. పెట్రోమాక్స్ లైట్ లో కిరసనాయిల్ పోసి పంపుతో గాలి కొడు తుంటే దాని 'మెంటల్' పుటుక్కున కూలి కిందపడింది. కూలిన ఆ పెట్రోమాక్స్ లైట్ మెంటల్ బూడిదకోసం నా కంటే నాకని ఎగబడుతున్నారు పిల్లలు.

"దానికియ్యకు నా కియ్యి" అని ఒక రంటే,

"నాకు దగ్గుంది, నాకే ఇయ్యి" అని మరొకరు, నాకంటే నాకని పోటీ పడుతు న్నారు పిల్లలు.

"ఎవ్వల్లకివ్వ నాకే దగ్గుంది" అంటూ వెంకన్న ఆ మెంటల్ బూడిదను అరి చేతిలో పోసుకుని బుక్కేసాడు. మెంటల్ బూడిద సగం వెంకన్న మీసాల్లోనే



పడింది. అది చూసి పిల్లలు ఘొల్లుమని నవ్వారు.

వెంకన్న కొత్త మెంటల్ తెచ్చి కట్టి, పెట్రోమాక్స్ లైట్ వెలిగించి, దాన్ని ఒక కొక్కానికి తగిలించి జెండా ఎక్కించినట్లు ఒక తాడును లాగుతుంటే లైట్ పైకి పోతుంది. లైట్ పైకి చేరాక కింద కర్రకు తాడును బిగించి కట్టాడు. చుట్టూ పెట్రోమాక్స్ లైట్ వెలిగిపోతోంది. పండగలకు, పబ్బాలకు ఇలా ఏమైనా ప్రత్యేకంగా పంచాయితీలు జరిగితే పెట్రోమాక్స్ లైట్ వెలిగిస్తుంటాడు వెంకన్న. ఆ ఊళ్లో వెంకన్నకు తప్ప ఎవరికి పెట్రోమాక్స్ లైట్ వెలిగించడం రాదు.

ఇంకా జమీందారుగారు ఇంట్లోంచి బయటకు రాలేదు. ఊళ్లోని పెద్దలు ఒక్కొక్కరే వస్తున్నారు. జమీందార్‌గారికి ప్రత్యేకమైన పెద్ద కుర్చీ ఉంది. అందులో

జమీందార్‌గారు తప్ప మరెవరూ కూర్చోరు. ఆ కుర్చీకి ఎదురుగా మరో నాలుగైదు మామూలు కుర్చీలు వేసివున్నాయి. ఇంకో పక్క రెండు బెంచీలు వేసివున్నాయి. రఘునాథంగారు వస్తుంటే అందరూ లేచి నిలబడి 'దండాలయ్యా' అని కొందరు 'నీ కాల్మొక్త దొర' అని కొందరు, పలకరించారు.

రఘునాథంగారు అందరినీ చిరునవ్వుతో పలకరించారు. రఘునాథం వెంట విశ్వనాథం కూడా ఉన్నాడు. ఇప్పుడిప్పుడే లోకజ్ఞానం వస్తున్న కొడుకు 'నేనూ వస్తా' అంటే వెంటపెట్టుకొని వచ్చాడు. రఘునాథంగారు కూర్చుంటే విశ్వనాథం తండ్రి కుర్చీ వెనుక నిలబడ్డాడు. ఇంకా కొందరు ఊరి పెద్దలు వచ్చారు. రావడం తోటే వారు రఘునాథం గారిని చూసి "రాం రాం" అంటూ చేతులు జోడించి నమస్కరించారు.

రఘునాథంగారు కూడా లేచి నిలబడి 'రాం రాం' అంటూ చేతులు జోడించారు. రఘునాథంగారు ఊరి పంచుల్లో ఒకరు. ఇంకా ఇతర పంచులు కూడా ఒక్కొక్కరే వచ్చి వారి వారి స్థానాల్లో ఆసీనులవుతున్నారు.

ఊళ్లో వాళ్ల స్థాయిని బట్టి, ఆర్థిక స్థోమతను బట్టి ఎవరి స్థానాన్ని వారు అలంకరిస్తున్నారు.

ఊరిపై వృత్తులు చేసుకునే వాళ్లు విడిగా గుంపుగా తమలోతాము మాట్లాడే విషయం గురించి చర్చించుకుంటున్నారు.

దూరంగా వరండాలో ఉన్న రేడియోలోని హిందీ సినిమా పాట 'సోజా రాజకుమారీ'... సైగల్ గొంతులోంచి వినిపిస్తోంది. హిందీ రాక ఆ పాట ఎవరి గుండెలను తట్టడం లేదు. కాని రఘునాథంగారికి పాట అర్థమవుతుంది. పాట భావం గుండెను తగిలి అలాగే ఇంకిపోతున్నట్లుంది.

రేడియోలోని పాట అయిపోయి హిందీలో వార్తలు వస్తున్నాయి. జమీందారుగారు వరండాలోకి వచ్చారు. అందరు లేచి నిలబడ్డారు. ఎవరి స్థాయిని బట్టి వాళ్లు పలకరించారు. చాలామంది జమీందారుగారిని చూసి భూమి వైపు వంగి వంగి దండం పెట్టారు. తలపై ఉన్న తుండు గుడ్డలను తీసి భుజంపై వేసుకున్నారు. కొంతమంది చేతులు కట్టుకొని నిలబడ్డారు. జమీందార్ వెంటే రావల్సిన పూజారి అప్పుడే ఆదరా బాదరాగా జమీందారుగారి యింట్లోంచి వచ్చి, ఒక కుర్చీలో కూర్చున్నాడు.

శ్రీవైష్ణవుడు, పేరు శ్రీధరాచారి. ఆ ఊళ్లో ఒక గుడీ, గోపురం అంటూ ఏమీ లేవు. గడీలోపల ఉన్నది ఒక ఆంజనేయ స్వామి గుడి. దాన్ని ఎప్పుడో కట్టూ, కట్టూ సగంలో ఆపేశారు. ఇప్పటికీ అలాగే ఉంది. ఆ ఆంజనేయుడికి అర్చన, నైవేద్యాలేమీ లేవు. ఊళ్లో తిథి, నక్షత్రం, మంచి చెడు తెలిసిన మనిషి ఒకడు ఉండాలని, శ్రీధరాచారిని ఊరిపై ఉంచారు జమీందారుగారు. అందరూ వృత్తిపని వాల్లకు కొలిచినట్లు పూజారికి కూడ ఊరి జనం 'దాని' కొలుస్తారు. ఊళ్లో చెట్టుకు ముందు ఏ కాయ కాసినా, ఏ పండు పండినా అది ముందు యీ పూజారికి భక్తితో సమర్పించుకొని దండం పెట్టుకుంటారు. పూజారి అంటే దైవాంశ సంభూతుడని వాళ్ల భావన. జమీందార్‌గారి యింట్లో నిత్యపూజలు నిర్వహించడం, ధూపదీపాలు వెలిగించడంతోపాటు వారికి ఎప్పుడు నీడలా వెన్నంటి ఉండి, జమీందార్‌గారి వ్యవహారాలన్నీ చూస్తాడు.

"ఆ చెప్పండి ఏమిటి పంచాయితీ" అంటూ ప్రారంభించారు జమీందార్‌గారు.

పని వాళ్లకు 'దాని' పెరిగితే తనకు





## కొత్తగాలి... 

**ఓ మంచిమాట**
**పెదవి దాటితే సార్థకం**
**దాచుకుంటే**
**నిరర్థకం**

**-అవుసలి ఆంజనేయులు,**
మూసాపేట, హైదరాబాద్

కూడ గిట్టుబాటే అని పూజారి ఎప్పుడో గ్రహించాడు. వృత్తి పనివాళ్లు చేసిన పనికి హక్కుగా అడుక్కుంటే పూజారి భిక్షగా స్వీకరించి కృష్ణార్పణం అంటాడు. వృత్తి పనివాళ్లు కల్లానికో, యింటికో వెళ్లి ధాన్యం కొలిపించుకుంటే ఈయనగారి గుమ్మంలోకే ధాన్యం నడిచి వస్తుంది.

జమీందార్‌గారి మాటలకు చప్పున ఎవరూ సమాధానం చెప్పలేదు.

"ఏముందీ వాళ్లు ఆరుగాలాలు కష్టపడు తున్నారు. కాని గిట్టుబాటు కావడం లేదు. కష్టానికి ఫలితం పెంచమంటారు. అంతేగా" అన్నాడు పూజారి.

"అదిగాద్దొర, రెండు మూడేండ్లకు ఒక సారి అరకకు ఏటాయిచ్చే ధాన్యం పెంచు తున్నారు. ఇప్పుడు ముచ్చట 'దాని' గురించి గాదు. ఈ నాలుగైదు ఏండ్లలో కొత్త కొత్త పంటలొచ్చాయి. చిన్న పత్తి, పెద్దపత్తి, యింకా ఏమేమో రకాలచ్చినయి. నాలుగు పైసలొస్తయని అందరూ యీ పత్తులే ధూమ్ పండియ్య వట్టిరి. పండిం చుకోని. ఉన్న మారాజులు. ఆల్ల చేన్లు అల్ల రెక్కల కష్టం. దాన్ని కాదనేటందుకు మేమెవరం. కాని మాకు కూడ, ఏటా అర కకు యింత అని కొన్ని రూపాలు మొఖ రార్ జెయ్యుండ్లి. మా పిల్లా జెల్లా నాలుగు రూపాల మొకం జూస్తారు" అన్నడు నర్సిగాడు. నర్సిగాడు హరిజనుడు, మాట పొందిక గల మనిషి. కులానికి చిన్నాడైనా అవసరం వచ్చినపుడు ఖరాఖం డితంగా మాట్లాడ్డంలో నర్సిగాడికి మించి నోడు ఆ ఊళ్లోనే ఎవరూ లేరు అని ప్రతీతి. ఎవరితో ఎలా మాట్లాడాలో ఇంగితం తెలిసిన మనిషి.

"ఇన్నాళ్లు మన ఊల్లె రూపాల మాట లేదు. మీలు అన్ని రకాల పండించెటోళ్లు, మాకు యింత పెట్టెటోల్లు. అండ్లనె మా పొద్దులు గడిసిపోయినయి. ఇప్పుడు కాలం మారింది. పైసలేంది గడుసుడు లేదు" అన్నాడు రాజన్న.

"ఇంతకు ముందు మీ చేన్లల్ల ఇచ్చే రోజు కైకిలికి మీలు యిచ్చే ఏక్ అనా, దొవ్వానా తోని మా బీడీలకు, మంటినూనెకు సాల య్యేది. కానిగిప్పుడు ఊల్లెకే దుకానమొచ్చె. దుకాన్లకు అగ్గిడబ్బలొచ్చె. పిప్పర్‌మెం ట్లొచ్చె. గిట్ల చిన్నదానికి, పెద్దదానికి పైసతో పనివడె, మా తాటనేమో కొత్త లేకపోయే మరి" అన్నాడు వెంకన్న.

"మా యింటిది నాతోనే వాగుకొస్తది. కైకిలి పోదు. ఏడాదికి ఒక్క రూపాయి కూడ నగదు ఆమ్‌దాని లేదు నాకు మరి దుకానం కర్చులకు చిల్లి కొత్త లేకపోయే. అందుకని" అంటూ నసిగాడు చాకలి రాజన్న.

అందరికన్న ముందు విషయం రఘునా థంగారికి అర్థమయ్యింది. చేసే పనికి, రెక్కల కష్టానికి, పండే పంటకు ముడిపడి ఉన్న గ్రామీణ వ్యవస్థ ఇది. పూర్వం రైతు డబ్బు సంపాదించేవాడు కాదు. పంట పండించేవాడు. తను, తన పనివాళ్లు, తన వృత్తి పని వాళ్లకు పోను మిగిలింది ఏమైనా ఉంటే కరువు కాలంలో పనికి వస్తుందని పాతర్లలో దాచుకునేవాడు. అన్నీ వర్షాధారపు పంటలు. ఒక ఏడుపం డితే, ఒక ఏడు కాలం కలిసిరాక పండక పోయేది. అప్పుడు దాచుకున్నది పనికొ చ్చేది. ఎప్పుడైనా కాలం కలిసి వస్తే మరీ

ఎక్కువ పండితే అప్పుడు దాచుకోవలసినంత దాచుకొని, మిగిలింది బస్తీలో అమ్మి సొమ్ము చేసుకునేవారు. వాణిజ్య పంట పత్తి లాంటిది రావడంతో తిండిగింజల సాగు విస్తీర్ణం తగ్గి, వాణిజ్య పంటల సాగు విస్తీర్ణం పెరిగింది. వచ్చిన పంట మొత్తం మార్కెట్‌కు పోతుంది. ముందటి లెక్కకు రైతు ఇప్పుడు ఎక్కువ డబ్బే కళ్ల జూస్తున్నాడు. పంచాయితీ వింటున్న విశ్వనాథానికీ ఏదో కొత్త సంగతి తెలుస్తున్నట్లనిపించింది.

ఎక్కడైనా ఆర్థికమైన విషయాలే దేన్నయినా ప్రభావితం చేస్తాయి. ఇప్పుడు వృత్తి పని వాళ్లను ప్రభావితం చేస్తున్నాయని గ్రహించాడు రఘునాథం.

"ఇంత చెప్పినోల్లు మీరే ఎంతియ్యమంటరో చెప్పుండ్లి. ఇనుకుంట మల్ల మా మాట మేం జెప్తం" అన్నాడొక పంచు.

"మేమేం జెప్తం దొర. అన్నీ తెల్సినోళ్లు, పెద్ద లోకులు మీలే చెప్పాల, మా పిల్లా జెల్లా కష్టం జూసి న్యాయం అనిపించింది యింత అని మీలే ఖరారు చేయుండ్లి. ఇనుకుంటం" అన్నాడు నర్సిగాడు.

"దొరవారు మీరు చెప్పండి ముందు" అన్నాడు శ్రీధరాచారి.

"నేను చెప్పడమేమిటయ్యా. పంచాయితీ ఉంది, పంచులున్నారు. వాళ్లు చెప్తారు. ముందు వాళ్లని మాట్లాడనీయండి. రఘునాథంగారూ వాళ్ల మంచి చెడ్డలు మాకంటే మీకే బాగా తెలుసు. మీరు మాట్లాడండి" అన్నాడు జమీందార్‌గారు.

"వాళ్ల బాధంతా ధాన్యంతో పాటు ఏదో మనకు న్యాయం అనిపించినంత రొక్కం ఏర్పాటు చేయడం. వాళ్ల కోరిక సబబైందే కాబట్టి ఎంత రొక్కం అనేది నలుగురు పంచులు కలిసి మాట్లాడుకొని నిర్ణయించాలి" అన్నాడు రఘునాథం.

"సరే, అట్లనే కానీయండి. నలుగురు, మీరు ఏం నిర్ణయిస్తే అదే సయి" అన్నారు జమీందార్‌గారు.

పంచులు నలుగురు వాళ్లలో వాళ్లు తర్జన భర్జన చేసుకొని, ఒక నిర్ణయానికి వచ్చి -

"ఏడాదికి అరకకు ఐదు రూపాలు. 'దాని'తో పాటు యిస్తరు. ఊరోళ్లకు మంజూరేనా" అడిగాడు పూజారి అక్కడున్న ఊరి జనంతో.

ఎవరికి వాళ్లు లెక్కవేసుకున్నారు. ఊరి మీద ఎంత లేదన్నా ముప్పై నలభై అరకలుంటాయి. ఆ లెక్కన రెండు మూడు వందల నగదు వస్తుంది. అంటే అందరికీ తృప్తే అనిపించింది.

ఊరి జనం ఏమీ మాట్లాడలేదు. "ఏడాదికి అరకకు ఐదు అంటే వాజీబే" అని వాళ్లలో వాళ్లు తర్కించుకున్నారు.

"ఏం బక్కన్న నువ్వు జెప్పు. ఈ ఊల్లె నువ్వే అందరి కన్న ఒక చేయి చిన్న రైతువి. నీకు యిష్టమేనా అరకకు ఐదు రూపాలు" అంటూ పరాచికంగా అడిగాడు బక్కన్నను రఘునాథంగారు. అంత మందిలో బక్కన్న పేరెత్తేసరికి బక్కన్న ఒకసారి సిగ్గుపడ్డాడు. ఏమీ మాట్లాడలే.

నిజానికి బక్కన్నలాంటి ఒంటి చేయి రైతుకు ఒక్కో పనోనికి ఐదు రూపాలు చాలా ఎక్కువే. చాకలికి, మంగలికి, కంసాలికి, వడ్రంగికి, సుంకరికి, పూజారికి యిలా అందరికీ కలిపి ఏడాదికి ముప్పయి, నలభై రూపాలవుతాయి. ఇది చాలా పెద్ద మొత్తం. బంగారంతో పోల్చుకుంటే నాలుగైదు మాసాల అంటే అరతులం బంగారంతో సమానం.

రెండు రూపాయలు తాసీలు కట్టె రోజుల్లో పనివాళ్లకు, ఐదు రూపాయల నగదు యిచ్చే రోజు వొచ్చిందనుకోలేదు ఎవరూ, అంత ఆలోచించడం లేదు ఎవరు.






బక్కన్నకు పెళ్ళయింది. భూదేవి కాపు రానికొచ్చింది. భూదేవి కాపురానికొచ్చాక బక్కన్న ఉత్సాహం ద్విగుణీకృతమయింది. ముందటికన్న ఎక్కువ కష్టపడుతున్నాడు. చిన్నప్పటి నుంచి తల్లి దండ్రి లేక ఏం వండుకున్నాడో, ఏం తిన్నాడో అలా కడుపు నింపుతూ వచ్చాడు. భూదేవి ఉన్నంతలో రుచిగా వండిపెట్టేది. కడుపు నిండా తిండి, కౌగిలి నిండా భూదేవి. క్షణం కనుమరుగుకాని కాపురం యీ పల్లె ప్రజలది. ఆడది వంటింట్లో ఉన్నంతసేపు మగాడు ఏదో పనిచేసుకుంటూ యింత తిని చేనుకుపోతాడు. అతడి వెనకే ఆమె. ఆక్కడ ఒకరి ఎదురుగా ఒకరు. మళ్లీ కలిసి యింటికి వస్తారు. ఎవరికీ తీరుబడి ఉండదు. బండి చక్రాల్లా ఇద్దరు ఆ భూమి చుట్టూ అల్లుకొని తిరుగుతూ ఉంటారు.

బక్కన్న దౌర కొడుతున్నాడు. భూదేవి దౌరకు తప్పిపోయిన గడ్డిని కొడవలితో తీసేస్తోంది. నల్ల బంగారంలా భూమి ఎప్పుడు శుభ్రంగా ఉండాలంటాడు బక్కన్న. ఎక్కడ చిన్న గడ్డిపోచ కనిపించినా, రాయిరప్ప కనిపించినా ఓర్చుకో లేడు. పది ఎకరాల నేల ఒక్కతీరుగా నల్లటి రేగడిలో పచ్చటి పంటతో నిగనిగ లాడుతూ ఉంటుంది. వాకిలి చూసి ఇంటి దాని సాలి చెప్పినట్లు చేనును చూసి యింటోడి సాలి చెప్పొచ్చు. బక్కన్న చేను చూసి బక్కన్న ఎలాంటి రైతో యిట్టే చెప్ప వచ్చు.

మిట్టమధ్యాహ్నమయింది.

బక్కన్న అరక యిడిచి, ఎడ్లను పక్కనే తుమ్మల కింద కట్టేసాడు. భూదేవి సద్ది మూటను గంప కింద నుంచి బయటకు తీసి కలుపుతుంది. చల్లటి గాలి, ఏపుగా పెరిగిన పైరు, సాగుబడిలో ఎక్కడా యింత వేలుపెట్టి వంక చూపడానికి వీలు లేని పనితనం. ఎదురుగా భూదేవి, గాలి కెగిరే ముంగురులను తప్పించుకుంటూ గాలివాటంకు ఎదురుగా తల తిప్పుకుంటూ గటకలో పప్పు కలుపుతూ తెచ్చిన సద్దిని రెండు గిన్నెల్లోకి సర్దింది.

"ఆ పక్కనున్న చేను ఎవళ్లదో తెలుసా, మా అన్న పాలుది. అన్న పోయినంక మా ఒదిన మారుపెళ్లి చేసుకొనిపోయింది. ఇప్పుడా చేనును యింకోనికి బటాయి(కౌలు) కిచ్చింది. మా ఒదినకు ఆ భూమి మీద ఆపేక్ష లేదు. కొంటా మంటే మనకిస్తరు. పదెకరాలుంటది. ఎట్లన్న జేసి కొనాలి" అన్నాడు బక్కన్న దీర్ఘాలోచన చేస్తూ.

"మనకున్న యీ పదెకరాలు సాలదా ఏంది, తియ్. ఇది పొతం జేసుకుంటే సాలు" అంది భూదేవి. ఒక గటక ముద్దను బక్కన్న నోటికి అందించి తనొక ముద్ద నోట్లో పెట్టుకుంది.

"అది కాదే ముచ్చట. నలుగురు పిల్లల న్నాక మనిషికి పది ఎకరాలన్న ఉండాల్న వద్దా చెప్పు. ఎట్లన్న జేసి పైస పైస పొతంచేసి ఆ పక్కభూమి కొనుక్కుందాం" అన్నాడు బతిమిలాడుతున్నట్లు.

"గట్లనే కాని తియ్. అట్లని రంది పెట్టు కొని రెక్కలు ముక్కలు జేసుకోకు" అంటూ ఇంకో ముద్ద అందించింది.

"నువ్వుండగ నాకు రందేందే. నా మన సుల మాట నీకు కాకుంటే ఎవలకు జెప్త



అగ్రవర్ణ అహంకారం వారిని మనుషుల నుంచి వెలివేసింది. విద్యకు, విజ్ఞానానికి దూరం చేసింది. అటువంటి సమాజం నుంచి తొలిపొద్దులా ఉదయించాడో యువకుడు. తరతరాలుగా అమానవీయ పోకడలతో సమాజాన్ని విభజించి పాలించిన దురహంకారంపై సాగిన అక్షర సమరం... చతుర నవలల పోటీలో రూ. 8,000/- ప్రోత్సాహక బహుమతి పొందిన చిలుకోటి కూర్మయ్య నవల

# అభిమానం

ఆగస్టు చతుర లో మీకోసం...

చెప్పు. నాకు తల్లయిన, తండ్రయిన అన్నైన, చెల్లైనా అన్నీ నువ్వే గదే. అందు కని నీకు జెప్పిన" అంటుంటే బక్కన్న గొంతు గద్గదమయింది.

చిన్నప్పటినుంచి ఎవరి ప్రేమకు, ఆప్యాయతకు నోచుకోని బ్రతుకు బక్కన్నది. ఎవరు ఏ మాత్రం కాస్త ప్రేమను, ఆపేక్షను చూపించినా బక్కన్న మనస్సు యిట్టే కరిగిపోతుంది. ప్రేమాశ్రువులు కళ్లలోంచి కృతజ్ఞతగా తన్నుకొచ్చి కళ్లు ఆర్ద్రమవుతాయి. గొంతు గద్గదమవుతుంది.

మొగుడికి తనపట్ల గల ప్రేమకు భూదేవి మనస్సు పులకించిపోయింది. ఈ చెట్టంత మగాడికి, ఒంటిచేత్తో కొండనైనా పిండిచేయగల యీ మగాడికి తను తల్లి తండ్రి, చెల్లి, అక్క, అన్నా, తమ్ముడు. తోడునీడ అన్నీ అనుకుంటే భూదేవికి గర్వంగా అనిపించింది.

భూదేవిలో ప్రేమ పెల్లుబికింది. దానికి వ్యక్తీకరణ కావాలి. చేయిపెట్టి తింటున్న బక్కన్నను వద్దని తనే నోటికి ముద్దలందించింది- భూదేవి.

బక్కన్న తిని మూతి కడుక్కొని భూదేవి పైటతో చేతులు, మూతి తుడుచుకుంటూ, అలాగే ఆమె భుజంపై వాలి కళ్లు మూసుకున్నాడు.

భూదేవి భర్తను అలాగే లాలిస్తూ ఒడిలో చేర్చుకుంది. ఒడిలో పడుకున్న బక్కన్న తల ఒకటే గోకుడు చూసి, ఉండు నెత్తిల పేన్లున్నయేమో చూస్త అంటూ తలను ఒళ్లోకి లాక్కుంది.

"ఎందుకో గోకుతుందే.. అయినా మొగోల్ల నెత్తిల పేన్లుంటయా ఎక్కడన్న" అన్నడు అమాయకంగా.

"మొగాల్ల నెత్తిల ఉండయ్ కాని పెండ్లాన్ని ఒక ఛనం కూడా ఏమారకుండ



సన్నపిల్లలాగ అతుక్కొని ఉంటే మా ఉంటయి పేన్లు" అంటూ ఓ పేను తీసి బక్కయ్య అరచేతిలో ఉంచింది.

"అట్లనా ఉంటే ఉండని మరి పేన్లు పడ తయని పెండ్లాలకు ఎడంగుంటారా ఏంది? " అంటూ గోముగా ఆమె ఒడిలో గారాలు పోయాడు బక్కన్న.

పెళ్లయిన కొత్తలో రెండేళ్లు కష్టపడి పైసా పైసా కూడబెట్టి బక్కన్న అన్నబా పతు వదిన చేను కొన్నాడు. అది కొన్నాక బక్కన్న యిరవై ఎకరాల ఆసామి నేడు.

బక్కన్న భూమి స్వప్నం నేడు ఫలిం చింది. కన్నపేగు తెంపుకొని ఎక్కడో తీర్థంలో తప్పిపోయిన బిడ్డ తిరిగి ఇంటికొ చ్చినంత సంబరంగా ఉంది బక్కన్నకు. తమ తాతల తండ్రుల చెమటతో దడిసిన భూమి అది. తన అన్న కష్టంతో ఫలించిన భూమి అది. తన కళ్లముందే అన్నపాలు పదెకరాలు ఎవరో బటాయికి చేస్తుంటే, బక్కన్న మనసు విలవిల లాడిపోయేది. ఆ పదెకరాలను కొంటేగాని బక్కన్న మనసు శాంతించలేదు.

కొన్న పదెకరాలు అద్దంలా చేయడానికి బక్కన్న రెక్కలు ముక్కలు చేసుకున్నాడు. భార్యాభర్తలిద్దరు- పగలు రాత్రి అని చూడకుండా చేలో పెరిగిన పొదలను, ముళ్ల చెట్లను, వేళ్లూనుకొని పెరిగిన చెట్లను భూమి లోపల వరకు తవ్వి వేళ్లతో సహా నాశనం చేసేసరికి- బక్కన్న నిజం గానే బక్కపడిపోయాడు. కళ్లు ఎంత లోతుకు పోయాయి. ఒక ఏడాది పొతం చేయని నేలను తిరిగి పొతం చేయాలం టేనే రెండేండ్లు పడతాయి. అలాంటిది నాలుగేండ్లుగా బటాయి సాగులో బంజ రుగా మారిపోయిన నేలను పొతం చేయడం మాటలు కాదు. చేత తప్ప మాటలు తెలియని మనిషి కాబట్టి గొడ్డులా ఒక వైపు మామూలు వ్యవ సాయం చేసుకుంటూ గడ్డిగాదం, చెట్టూ పుట్టా- అన్నీ సరిచేసుకున్నాడు బక్కన్న. మొగడి కష్టం చూడలేని భూదేవి దినం రాత్రి భర్తను వెన్నంటి ఉండేది.

ఉయ్యాల్లోకి పిల్లగానికి కడుపు నిండా పాలుపట్టి, గొంతులో పెసరి గింజంత నల్ల మందు మింగించి ఉయ్యాల్లో పడుకోబె ట్టేది. తలుపు దగ్గరేసి, పక్కింటి ముసలవ్వకు అప్పగింత జెప్పి, ఉదయం పోతే, రాత్రి ఎప్పుడో వచ్చేది. ఒక్కోసారి చేలో చెట్టుకే ఉయ్యాల కట్టి భర్తతో సమా నంగా పనిచేసేది భూదేవి. అలా భార్యాభ ర్తలిద్దరు కలిసి భూమిని నమ్ముకొని ఆరు కాలాలు కష్టపడి బతుకుతున్నారు.

★ ★ ★

రఘునాథంగారి కొడుకు విశ్వనాథం మెట్రిక్‌లేషన్ అయిపోయింది. వెంటనే కాలేజీలో చేరాడు. ఉన్న ఊరును వదిలి దూరంగా ఉండటంతో కొన్నాళ్లు మనసు యిబ్బందిగా ఉంటుందనుకున్నాడు. కాని విశ్వనాథం కాలేజీలో ఉన్నన్నాళ్లు అన్యమ నస్కంగానే గడిపాడు. ఉన్న ఊరు, తల్లి, తండ్రి గుర్తొచ్చేవాళ్లు. రఘునాథంగారు బస్తీలో ఇల్లు తీసుకొని వంటమనిషిని పెట్టి చదివించినా విశ్వనాథంకు బస్తీ జీవితం అంతగా రుచించలేదు. ఆ పొలాలు, చేలు, చెట్లు, కాలవగట్లు, ఆ మనుషులు, ఆ ఆప్యాయత మరుపుకు వచ్చేవి కావు. కాలిబొటన వ్రేలికి చిన్న గాయమైన, కట్టు కట్టుకుని ఊళ్లో దార మ్మంటే పోతుంటే కనిపించిన ప్రతి మనిషి 'ఏమయింది- ఎలా అయ్యింది' అని పలకరించి జాగ్రత్తలు చెప్పేవారు. ఇక్కడ బస్తీలో ఒక చేయి తెగినా అడిగే వాడు లేడు. ఎవరి బతుకు వాళ్లది. పక్క వాడి ఊసు పట్టని రాజ్యం అది. మనిషి సంఘజీవి అన్నారు. కాని అది బస్తీలో మాత్రం కాదని గ్రహించాడు విశ్వనాథం.

చూస్తుండగానే ఎలాగో విశ్వనాథం డిగ్రీ అయిపోయింది. విశ్వనాథం చదివిన చదువుకు ప్రయత్నిస్తే, ఆ రోజుల్లో సుల భంగానే ఏదో ఒక ఉద్యోగం దొరికేది. కాని విశ్వనాథం అందుకు ప్రయత్నించ లేదు. చదువయిపోయాక నేరుగా మళ్లీ పల్లెకే చేరాడు.

రఘునాథంగారు గట్టునుండే వ్యవసాయం చేయించేవారు. వారికి వ్యవసాయం పనుల్లో మెలకువలు తెలుసు కాని కార్యరంగంలో ప్రవేశంలేదు. ఏనాడు సరదాకు కూడా అరకపట్టి ఎరగడు. కాని విశ్వనాథం అలా కాదు. మనం ఒక వ్యవస్థను నడుపుతున్నపుడు ఆ వ్యవస్థలో ఒక మనిషి రాకపోతే అతడు రాని లోటును మనం తీర్చగలగాలి అనే మనస్తత్వం కల వాడు.

పాలు పితికే పాలేరు రాకపోతే తానే స్వయంగా పాలు పితికేవాడు. అలాగే చేలో ఉన్నంతసేపు ఖాళీగా ఉండేవాడు కాదు. ఏదో చిన్న చితక పనులు చేస్తూ పాలేర్లతో చేయిస్తుండేవాడు.

"నీకెందుకు దొర యీ పనులన్నీ, అట్లా గట్టున కూకోండి చాలు పనులు అయ్యే జరుగుతుంటాయి". అంటే-

"పనులు జరగకకాదు. నాకూ అన్నీ వచ్చి ఉండాలి. పంట పండించడం, వ్యవసాయం నా వృత్తి. అలా ఛత్రి పట్టుకొని గట్టుమీద నిలబడి హుకుం చేయడం కాదు. మీ కష్టం ఎంతో నాకు తెల్వాలి. తెల్వాలంటే నేను ఆ పని చేసి చూడాలి" అనేవాడు విశ్వనాథం.

"పెద్ద లోకులు మీతోని మాట్లాడి గెలవ లేం" అని నోరు మూసుకునే వారు.

విశ్వనాథం ప్రవర్తన యింట్లో అతడి తల్లి సుభద్రమ్మకు తెలిసి ఆశ్చర్యపో యింది. కొడుకు చేలో పనివాళ్లతో సమానంగా ఉండడం ఆమెకు ఇష్టం లేదు. కొడుకు అనుచితంగా ప్రవర్తిస్తున్నాడనిపించింది ఆమెకు. మనసు బాధపడింది. మనసులో ఏదన్నా అనుకుంటే, వినేవాళ్లు ఉన్నా లేకున్నా నోరు విప్పి స్వగతంగా మాట్లాడ్డం ఆమెకు అలవాటు.

## కొత్తగాలి...

**పల్లెటూరు**
**ఉత్తమ ఇల్లాలు**
**నగరం**
**ఆడంబరాల ప్రేయసి**

*-సి. కామేశ్వరరావు, కాశీబుగ్గ*

"నా ఖర్మ యిట్లా కాలిపోయిందేంటో. కట్టుకున్న వాడు పేరుకు వందల ఎకరాల భూమికి ఆసామి. కాని సాధువు. ఉన్న ఊరు వదిలి కదిలింది లేదు. ఎక్కడ ఏం పండింది, ఏం ఎండింది చూసింది లేదు. అన్నీ నోటి లెక్కలు, జమా ఖర్చులు. ఏమన్నా అంటే మనకున్నది చాలదా, బతకటానికి యింకా ఏం కావాలి, అని ఎదురు ప్రశ్న"

అప్పుడే పెరట్లోంచి వచ్చిన రఘునాథం గారు సుభద్రమ్మగారి వాగ్ధాటిని గ్రహించాడు. వెంటనే "అవునే ఏం కావాలి. నీకు తినగలిగినంత తిండి ఉంది. కట్టడానికి తీరైన బట్ట ఉంది. పెట్టుకోవడానికి వంద కాసుల బంగారం ఉంటే ఇంకా ఏం కావాలి. ఇంకా నేను ఏంచేసి సంపాదించాలి. ఉన్న ఊళ్లో ఉన్న భూమిలో సెంటు భూమి కూడా బీడు పడి లేదు. అంతా సాగులోనే ఉంది. ఇంకా ఏం చేయాలీ" అని ప్రశ్నించడంతో సుభద్రమ్మ మాట మార్చింది.

"మీ సంగతి పోనీయండి. మన సంగతి అయిపొయ్యింది. మనవాడి సంగతి చూడండి. వాడు ఈమధ్య పనివాళ్లతో



కలిసి పని చేస్తున్నాడట. ఇది మన యింటా- వంటా లేదు. మనం పని చేయించుకునే వాళ్లమే కాని చేసేవాళ్లం కాదు. కాని వాడు చేస్తున్నదేమిటి? ఈ విషయం నలుగురికి తెలిస్తే చూస్తూ చూస్తూ వాడికి పిల్లనెవరిస్తారు? పిలిచి అడగండి ఏమంటాడో? "

రఘునాథంగారు పిలవక ముందే అటుగా గదిలోంచి వచ్చాడు విశ్వనాథం. "ఏమిట్రా మీ అమ్మ ఏమో అంటోంది" అన్నాడు రఘునాథం.

"ఏమో అనడం ఏమిటి? వాడు ఉచ్చం, నీచం మరిచి కులంగాని వాళ్లతో తాకితేనే మైలపడే వాళ్లతో కలిసి పనిచేయడం దేనికి? అంత గతిలేక ఉన్నామా, అంతగా పనిచేసే సరదానే ఉంటే ఏ తాలూకుదారో, తాసిల్దారో చెయ్యమనండి. కాదన్నదెవరు, ఈ మట్టి మనుషుల్లో పని చేయటానికేనా బస్తీకెళ్లి చదివింది. ఇదే చెప్పేది. ఇక అలాంటివి జరగొద్దు. మనమేమిటి, మన వంశమేమిటి, మనం చేసే పనులేమిటి" అంటూ కొడుకును నిలేసింది సుభద్రమ్మ.

"ఎవరి పని వాళ్లు చేసుకోవడంలో తప్పేంటి? " అని ప్రశ్నించి మళ్లీ తనే యిలా అన్నాడు.

"అమ్మా మన వృత్తి ఏమిటి? కుమ్మరి కుండలు చేస్తాడు, మంగలివాడు క్షవరం చేస్తాడు. చాకలివాడు బట్టలు ఉతుకుతాడు. యిలా అన్ని కులాల వాళ్లు తమ కులవృత్తులు చేస్తున్నారు. కాపువాడు వ్యవసాయం చేస్తున్నాడు. మరి మన వృత్తేమిటి? "

"మనం దొరలం. అన్ని కులాల వాళ్లతో సమానంగా మనం పని చేస్తామా? అందరితో చేయించుకుంటాం. మీ నాయన ఆ దారినే వెళ్తున్నాడు. ఆయనేం దుర్మార్గుడు అనిపించుకోలేదే" అంది సుభద్రమ్మ.

"ఎందుకొచ్చిన గొడవరా... మనం పని వాళ్లతో సమానంగా పని చేయడం ఏమిటి? అయినా నీవు పనిచేసే అవసరమేమొచ్చింది? నీవు చేస్తే గాని గడవదా, చెప్పు"

"అది కాదు నాన్నా మన పని మనం చేయడం..."

"అక్కడే పొరపడుతున్నావ్. మనం పని చెయ్యం, చేయిస్తాం.. అంతే. మా తాత-ముత్తాత, మా తండ్రి, నేను అదే చేశాం. మేమెవరం దుర్మార్గులం కాదే. ఎవడి మీద మనం జులుం చేయడం లేదు. జీతం యిస్తున్నాం. పని చేయించుకుంటున్నాం. పనికి ఇబ్బందిగా ఉంటే అదనంగా యింకో నౌకరును పెట్టుకుంటాం. నన్నర్థం చేసుకో. నీవు చేసింది ఎంత అప్రదిష్టో నీకర్థం కావడం లేదు."

"ముందు వాడికి సంబంధం చూడండి. వెంటనే ఆ మూడు ముళ్ళు వేయిద్దాం. ఇప్పుడు యీ అమ్మ చెప్తే నచ్చని విషయం రేపు వచ్చే పిల్ల చెప్తే నచ్చుతుందేమో చూద్దాం. మీరైతే ముందు సంబంధాలు చూడండి" అంది సుభద్రమ్మ.

"వాడేమన్నా ఆడపిల్లనా, ఏంటి? మా వాడు పెళ్లికి ఉన్నాడు. మీ అమ్మాయికి చేసుకుంటారా అని అడగడానికి."

పెళ్లి ప్రస్తావన రావడంతో విశ్వనాథం అక్కడి నుండి మెల్లగా నిష్క్రమించాడు. "అది కాదండి. అపురూపంగా పెంచుకున్న పిల్లను ఏ తల్లిదండ్రులైనా పొలంలో కాయ కష్టం చేసేవాడికి యిస్తామని వస్తారటండి. మనకెన్ని మిద్దెలున్నా, మేడలున్నా యిలాంటి పనులు చూసి, ఏ తండ్రి బిడ్డ నివ్వడానికి ముందుకొస్తాడు. మనమే తెలిసిన చోటికి ఏదోలా వర్తమానం పంపాలి."

"అర్థమైందే, చూస్తాను" అన్నాడు రఘునాథంగారు. విశ్వనాథంకు పెళ్ళి సంబంధాల అన్వేషణ మొదలైంది.

# చతురకు నవల రాయడం ఇష్టం



వసంతరావు దేశపాండే

పుట్టింది, పెరిగింది, ప్రస్తుతం ఉంటున్నదీ ఆదిలాబాద్ లోనే. చదివింది తెలుగు ఎం.ఎ, ఎం.ఫిల్. ఉద్యోగం చేస్తున్నది డైట్ కళాశాలలో వృత్తి బోధన. సాహిత్యంలో నవలా ప్రక్రియ అంటే ఇష్టం. నా మొదటి రెండు నవలలు 'అడవి' (1988), 'ఊరు' (1995) చతుర నవలల పోటీల్లో బహుమతులు పొందాయి. మూడవ నవల 'ఫాస్ట్ ఫార్వర్డ్' (అనూహ్య) స్వాతి వారపత్రికలో (1999) బహుమతి పొందిన నవల. నేను రాసిన నవలలు మూడు కన్నడంలో అనువాదమై... ధారావాహికంగా ప్రచురణకు నోచుకుని అక్కడి పాఠకులను కూడా విశేషంగా అలరించాయి. చతుర కోసం నవల రాయడం ఇష్టం. చతురలో నవల వస్తే- నవల చేరాల్సినంత మంది పాఠకులకు చేరుతుందని నమ్మకం. చతురలో నా మూడో నవలను అందిస్తున్న యజమాన్యానికి, సంపాదకులకు కృతజ్ఞతలు. నవలపై పాఠకుల స్పందన, అభిప్రాయాలను ఆశిస్తూ...

చిరునామా: వసంతరావు దేశపాండే, ఇం.నెం. 9-52, 'శ్రీనిలయం', టీచర్స్ కాలనీ, రాజీవ్‌నగర్, ఆదిలాబాద్-504001 సెల్: 9440001166, ఫోన్ : 08732-225652

సుభద్రమ్మ తన పంతం నెగ్గించుకొంది. ఏడాది తిరక్కుండానే విశ్వనాథంకు మూడు ముళ్ల బంధం వేయించగలిగింది. జానకి కాపురానికొచ్చింది. కాపురానికి వచ్చిన కొత్తలోనే గ్రహించగలిగింది జానకి విశ్వనాథంకు వ్యవసాయం పట్ల ఎంత మక్కువ ఉందో.

పెళ్లి హడావుడి సద్దుమణిగాక...

ఒకరోజు సుభద్రమ్మ కోడలితో కొడుకు గురించి అప్పగింతలు చెప్పింది. "చూడమ్మ జానకి... వాడు వట్టి బోళా మనిషి .ఎలాంటి డాబూ తెలియని వాడు. ఎలాంటి రంగు వాడిది. ఎంత సుకుమారంగా పెరిగాడు. ఎంత అపురూపంగా పెంచుకున్నాను వాణ్ని నేను. అయినా అన్ని మరిచి పనివాళ్లతో సమానంగా ఎండలో, వానలో, చలిలో పనిచేస్తానంటాడు. అయినా పనిచేయాల్సిన అవసరం వాడికేమిటి. వాడు చదివిన చదువుకు ఏ తాసీల్దార్ ఉద్యోగమో దొరికేది. అయినా పదిమందికి పనిచూపించి పని చేయించుకునే సత్తా ఉన్నవాళ్లం. నువ్వయినా చెప్పు తల్లి. ఆ జనంతో అంటు ముట్టు, మడి మైల గట్టున పెట్టి తిరగొద్దని. అర్థమయిందా తల్లీ! ఇప్పుడు నా చేతుల్లో లేడు. నువ్వే చూసుకోవాలి వాణ్ణి" అంటూ బాధగా ఉన్న విషయం చెప్పుకొచ్చింది.

అదేరోజు రాత్రి జానకి అత్తగారు చెప్పిన విషయం ప్రస్తావనకు తేవాలనుకొని, ఎలా మొదలుపెట్టాలో తెలియక అవస్థ పడుతోంది. సూటిగా అడిగితే బాగుండదు.

తమలపాకుల ఈనెలు తీసి సున్నం రాస్తూ ఆలోచిస్తోంది జానకి.

ఒక్కో ఆకుతో ఒక్కో చిలక చుట్టి పెడుతోంది.

విశ్వనాథం ఏదో పుస్తకం చదువుకుంటు



న్నాడు.

'తీసుకోండి' అంటూ చుట్టిన తమల పాకు చిలక అందించింది.

"ఇదేంటి... ఏదో కొత్త ఆచారం కాబో లని తిన్నాను. రోజు యిలా తమలపా కులు తినిపిస్తావా ఏంటి? నాకు ఇలా మేకలా ఆకులు నమలడం యిష్టం ఉండదు, తెలిసిందా? యింకెప్పుడు యిలా చిలకలు చుట్టకు" అన్నాడు.

"అత్తయ్యనే చెప్పింది రోజూ భోజనం తర్వాత ఇలా యియ్యమని" అంటూ సంజాయిషీగా చెప్పింది జానకి కళ్లింతగా చేసుకొని అమాయకంగా.

"ఇంకా ఏమేమి చెప్పింది నా గురించి"

"మీరు పనివాళ్లతో కలిసి పనిచేస్తారని, చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా అంద రితో.. అదే మనకంటే కింది వాళ్లతో అంటూ ముట్టు లేకుండా వాళ్లతో కలిసి పనిచేస్తారని"

విశ్వనాథం అలాగే చూస్తూ ఉండిపో యాడు తీక్షణంగా. జానకి భయపడిపో యింది.

"అలా అని నేనేమి అనడం లేదు. అన్నీ అత్తయ్య చెప్పింది..."

"చూడూ జానకీ మనం చదువుకున్న వాళ్లం. అంటరానితనం అపరిశుభ్రతకు సంబంధించింది. ఇక పనివాళ్లతో కలిసి పనిచేయడం... నేను ఎవరి మీద ఆధార పడే మనిషిని కాదు. భోజనం చేసే ప్రతి మనిషికి వంట వచ్చి ఉండాలన్నాడు మహాత్ముడు. వంట వండటం రానివాడు భోంచేయడానికి అనర్హుడు అన్నాడు. అలాగే వ్యవసాయం నా వృత్తి. నా వృత్తిలో నాకన్నీ తెలిసి ఉండాలి. నాకన్నీ వచ్చీ ఉండాలి. అవసరమైతే ఒక పని వాడు రాకపోతే నా పని ఆగిపోకూడదు. అనేది నా సిద్ధాంతం. అర్థమయిందా?"

అవునన్నట్లు తలూపింది జానకి.

"తే, తమలపాకులు" అంటూ చేయి చాపాడు విశ్వనాథం.

జానకి ఒక చిలక తీసి అందించింది.

విశ్వనాథం ఆ చిలక అందుకొని "ఇది నాకు కాదు నీకు" అంటూ ప్రేమగా జానకి నోటికి అందించాడు. జానకి విశ్వనాథం అందించిన తమలపాకు చిలకను తీసు కొంటూ సంతోషంతో సగమయింది. ఆనందంతో ఆర్ద్రమయ్యింది.




కాలం వేగంగా కదిలిపోతుంది. కొత్త కొత్త మార్పులు చోటు చేసుకుంటున్నాయి.

బక్కన్నలాంటి పేద రైతులు అధిక దిగుబడికి వాణిజ్య పంటల సాగుకు, కృత్రిమ పంటల సాగుకు కృత్రిమ ఎరు వుల వైపు పట్టణం పోవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. బస్తీలో ఎరువులతో పాటు క మీషన్ ఏజంట్లు, ఏజంట్లద్వారా వడ్డీకి డబ్బు దొరకటం మొదలయింది.

కొత్తగా పొగాకు పంట సాగుబడి మొద లయింది. నూనె గింజల సాగుబడి కింద చాలామంది పెద్ద ఎత్తున వేరుసెనగ పంట సాగు చేయసాగారు. ప్రత్తి, పొగాకు, వేరుసెనగలాంటి వాణిజ్యపంటల సాగుబడి పల్లెల్లో ఎక్కువైంది. వాటి అధిక దిగుబడికోసం కృత్రిమ ఎరువుల వాడకం, అడపాదడపా రసాయనిక మందుల వాడకం కూడా మొదలయ్యింది.

పల్లెల్లో తన మానాన తను బ్రతుకు

తున్న బక్కన్నలాంటి పేద రైతులు అధిక దిగుబడి, లాభాపేక్ష కాంక్షతో అధునిక యుగ చట్రంలోకి మెల్లమెల్లగా లాగబడుతున్నారు.

బస్తీకి పల్లెలకు నడుమ చిన్నగా కంకర రోడ్లు వచ్చాయి.

ఆ రోడ్లు, కమీషన్ వ్యాపారులు, పొగాకు ఏజంట్లు, వడ్డీ వ్యాపారులు పల్లెల్లోకి రావడానికి ఉపయోగపడ్డాయి. ఈ కాలంలో బక్కన్న ఇద్దరు పిల్లలకు తండ్రయ్యాడు.

పెరుగుతున్న కుటుంబానికి పెరుగుతున్న ఆదాయం పెద్దగా లెక్కలోకి రావడంలేదు. రైతు రెక్కల కష్టం, భూమి అద్దె, సాగుబడి, వ్యయం ఇవన్నీ రైతులెక్కలోకి తీసుకొని తన రాబడిని లెక్కించుకోవడం లేదు. రైతు బ్రతుకుతున్నాడు. ఒక ఏడు అప్పేమీ ఉండడం లేదు. ఇంకో ఏడు అప్పవుతున్నాడు. మరో ఏడు ఆ అప్పు పెరిగిపోతుంది. ఇలా నడుస్తోంది వ్యవసాయం. కాని రైతును అంటిపెట్టుకొని వ్యాపారాలు చేసే కమీషన్ ఏజంట్లు, ఎరువుల- విత్తనాల వ్యాపారులు, వడ్డీ వ్యాపారులు, పంటలను కొన్న దళారులు, ఫ్యాక్టరీల వాళ్లు దినదినాభివృద్ధి చెందుతున్నారు. రైతులు మాత్రం అప్పుల్లోనే పుట్టి అప్పుల్లోనే పెరిగి, అప్పుల్లోనే జీవించి, అప్పుల్లోనే మరణించి, చివరికి తన వారసులకు కూడా అప్పులే మిగిల్చిపోవాల్సి వస్తోంది. పల్లెటూరి రైతు బ్రతుకు నానాటికి దిగజారిపోతోంది.

ఇంకో పదేళ్లకాలం గడిచిపోయింది. ఆ గొంగడి అక్కడే ఉంది. కాని అలాగే లేదు. కొంత చీకి పోయింది. బలహీనమయింది.

బక్కన్న పిల్లలు ఇద్దరూ బడికి వెళ్తున్నారు. పెద్దవాడు పదవతరగతి. మూడు కోసుల దూరంలో ఉన్న బడికి వెళ్తొస్తాడు. అలాగే రెండవవాడు సర్కారు బడిలో ఏడవతరగతి చదువుతున్నాడు.

పొగాకు పంటలో మెలకువలు తెలియక, అధిక దిగుబడి సాధించినా నాణ్యతను సాధించలేక చాలామంది రైతులు ఆ పంట నుండి తప్పుకున్నారు. అలాగే నూనె గింజల దిగుబడిలో, వేరుసెనగలో కూడా వెనకబడ్డారు. నాగలితో దున్నితే తప్ప రాని విత్తనం మూలంగా ఆ పంట దిగుబడికి కష్టమై దాన్ని కూడా మెల్లమెల్లగా మానుకున్నారు. వాటి స్థానే పెద్ద ఎత్తున పత్తి పంట విస్తీర్ణం పెంచుకున్నారు. ముత్యాల్లాంటి పచ్చజొన్న సాగును వదిలి, హైబ్రీడ్ జొన్న సాగుకు సిద్ధమయ్యారు.

మే నెల ఎండలు మండిపోతున్నాయి.

ఎండాకాలం దుక్కులయ్యాయి. వేసంగి పనులన్నీ అయిపోయాయి. రైతు 'మిరుగు' రావడంతోనే విత్తటానికి విత్తనాలు, ఎరువుల కోసం ఆతురత పడుతున్నాడు. ఎండాకాలం ఎనిమిది గంటలకే ఎండ మండిపోతోంది. ఎండాకాలం కావడంతో బక్కన్న తొలిచుక్క పొడవడంతోనే అరక కట్టుకొని చేనుకుపోయాడు చల్లటి పూట పని అలుపు లేకుండా సాగుతుందని. ఆ వేళప్పుడైతే ఇంత పొద్దెక్కే వరకు పని చకచకా సాగుతుంది. ఎడ్లకు, మనిషికి కూడ అలుపుండదు. "ఇయ్యాల్ల ఆదిలాబాద్ పోవాల" అని మనసులోనే అనుకొని గబగబ పని ముగించుకని అరక యిడిచి ఇంటికొచ్చాడు బక్కన్న. రావడంతోనే ఆదరాబాదరా యిన్ని నీళ్లు ఒంటిపై గుమ్మరించుకొని, బట్టలు చుట్టుకొని ఒక ముంతలో నీళ్లు తీసుకొని వాకిట్లో తులసి కోటలో పోసి, అలాగే పరుగు పరుగున ఆంజనేయుడి గుడికివెళ్లి, ఐదు చుట్లు తిరిగి, యింత చంద్రం బొట్టు పెట్టుకొని హడావిడిగా యింటికి వచ్చాడు. రావడం

## డాక్టర్లపై చతురోక్తులు

**వివిధ వృత్తులపై ఎన్నో హాస్యోక్తులు వాడుకలో ఉన్నాయి. ఈసారి డాక్టర్లపై కొన్ని నవ్వులపువ్వులు మీ కోసం ప్రత్యేకం..**

ఓ సెలవు రోజున డాక్టర్‌గారింట్లో సింకు మూసుకుపోయింది. ప్లంబర్‌కి ఫోన్‌చేస్తే 'ఈరోజు సెలవు' అన్నాడు. డాక్టర్‌కి ఒళ్లు మండింది. 'నేను సెలవురోజునా ఎవరైనా పిలిస్తే వెళ్తాను' అన్నాడు. సరేనని ప్లంబర్ వచ్చి, సింకును పరిశీలించాడు. కొద్దిసేపు తనలో తను ఏదో గొణుక్కున్నాడు. తర్వాత డాక్టర్ చేతిలో రెండు ఆస్పిరిన్ బిళ్లలు పెట్టి, 'వీటిని లోపలికి వేయండి. 24 గంటల్లో సరి కాకపోతే రేపు ఉదయం వచ్చి నన్ను కలవండి' అని చెప్పి వెళ్లిపోయాడు.



తోనే "తిండి పెట్టే" అని భార్యను కేకేశాడు.

"ఏంది అంత ఎగిర్తం. యియ్యాల్ల గిట్ల ఉరకవడ్తివి. పొద్దు గాల్లనే" అంటూ సాగదీసింది భూదేవి.

"ఎగిర్తం కాదే, ఇయ్యాల్ల ఆదిలాబాద్ పోవాల. మిరుగు కార్తె దగ్గర పడుతుంది గద. ఇత్తులు, ఎరువులు తెచ్చుకోవద్దు. అదిగాక నిరుడు కొలిచిన పంటకు లెక్క చూసుకోవాలి. ఇయన్ని పన్లు జల్ది గావాల్నంటే యాల్ల పొద్దుగాల్నే పోవాల. జల్ది యింత తిండి పెట్టు" అంటూ పళ్లెం అందుకొని కూర్చున్నాడు.

"పెత్త ఆగు, అంత బేగి అయితే ఎట్ల, పడుసు పోరని లెక్క. జర నిమ్మలంగా కూసుండు. ఉడుకుడుకు రొట్టె జేసిస్త తినిపో. అట్లనే నాలుగు రొట్టెలు కట్టిస్త పట్కపో, మల్ల ఏరాత్రికి వస్తవో ఏందో".

"ఏదో కాని జల్ది, ఆలస్యమయితే ఎండయితది" అన్నాడు బక్కన్న.

"అబ్బో నీడ పట్టున ఉండే రాజకుమారుడు యియ్యాల మొదటిసారి ఎండకు పోబట్టే" అంది భూదేవి నవ్వుతూ.

"ధత్, నీ యవ్వ నాక్యాదే ఎండ, బక్కలకు ఎండయినదని, ఎండకు అరకకు నడుసుడు వేరు. బండి గుంజుకుంట ఉరుకుడు ఏరు. నువ్వు జప్పున రొట్టెలు కానీ, అంతదాంక నేను ఎడ్లకు యింత కుటార్ పెట్టి మేత ఏస్త" అంటూ పళ్లెం ముందు నుండి కొట్టంలోకి వచ్చాడు.

పది నిమిషాల్లో భూదేవి నాలుగు రొట్టెలు చేతిమీద చేసి వేడివేడిగా బక్కన్న కందించింది. మరో నాలుగు రొట్టెలు సద్ది కట్టింది. బక్కన్న బండిలో యింత మేత, సద్ది పెట్టుకొని బండి కట్టాడు.

"ఇగో నిన్నే యాల్ల పొద్దుగాల్లరా, మరీ రాత్రి జేసుకోకు ఎవ్వలన్న సోపతి జేసుకొని, రా, రాంగ పిల్లల కింత ఏమన్న 'ఫలారం' తే. దొరికితే అరటిపండ్లు తే" అంది భూదేవి.

"అట్లనే దెస్తతియ్యే. పిల్లగాండ్లేరి? " అంటూ బక్కన్న బండి అదిలించాడు.

"యింతదంక ఉంటర యింట్ల. వాగుల బడి ఈతలు గొట్టబోయిండ్లు. నువ్ జల్దిరా" అని అంటుంటే బక్కన్న బండి దడదడమంటూ వెళ్లిపోయింది.

బండి ఆదిలాబాదు చేరేవరకు పన్నెండయింది. మిట్ట మధ్యాహ్నాం. ఎండ మండిపోతోంది. ఎడ్లు నాలుకలు చాపి అసపోస్తున్నాయి.

అది కమీషన్ ఏజంట్‌గారి ఇల్లు. ఇల్లంటే ఇల్లులాగ లేదు. ముందు పెద్ద హాలు. హాలులో ఒక మూల పట్టుకొని నాలుగో వంతు వరకు తెల్లటి పరుపులు పరిచి ఉన్నాయి. ఆ మూల గోడలకు ఎందరో దేవుళ్ల పెద్ద పెద్ద ఫోటోలు తగి

లించి వున్నాయి. లక్ష్మి, గణపతి, వెంకటే శ్వరుడు, శివుడు, విష్ణుమూర్తి, సతీదేవి ఫోటోలు పెద్ద చందనం దండలతో అలం కరించబడి వున్నాయి. ప్రతి ఫోటో మూలకు అగరబత్తులు వెలిగించిన పొగ మాసికలు వున్నాయి. తెల్లటి పరుపుపై ఒక మూల మునీమ్ కూర్చొని ఉన్నాడు. అతడి ముందు ఒక చెక్కరాత బల్ల ఉంది. అటు పక్కన ఎర్రటి, పొడుగాటి దస్తరాలు న్నాయి. అందులోనే అన్ని ఊళ్ల ఆసా ముల లెక్కలుండేవి. ఇటుపక్క నల్లటి ఫోను ఉంది.

మునీమ్ తెల్లగా, బక్కగా వున్నాడు. ఇంత పొడుగున తడి కుంకుమ బొట్టుపెట్టి వాటిపై అక్షింతలు అద్ది ఉన్నాయి. అతడు ఎంత తల కదిపినా, అవి పడడం లేదు. కమాల్‌గుంది అనుకున్నాడు బక్కన్న. ఎంతన్న బస్తీ మనుషులాయే అని తనకు తానే సర్ది చెప్పుకున్నాడు.

తనలాంటి ఆసాములు యాభయివరకు ఉన్నారక్కడ. ఆ హాలు బయట, పక్క గదిలో కూర్చొని మాట్లాడుకుంటున్నారు. తెల్లటి మునీమ్ ఒక్కో ఊరి వాళ్ల ఖాతా చిట్టాతీసి, ఒక్కొక్కర్ని పిలిచి లెక్క చెప్తు న్నాడు.

రెండు గంటల తర్వాత బక్కన్న వంతు వచ్చింది. "బక్కన్న వలద్ నర్సిములు" అని పిలిచాడు. బక్కన్న వెళ్లి తెల్లటి పరు పును అంటకుండా కింద అంచుకు కూర్చు న్నడు. ఎర్రటి కుంకుమ బొట్టుపెట్టి, అక్షిం తలు పెట్టిన మునీమ్ బక్కన్న లెక్క చెప్పుకొస్తున్నాడు.

"నిరుడు నువ్ తీసుకున్నది ఇత్తనాల బాపతు పన్నెండు నూర్లు, ఎరువుల బాపతు మూడువేల మీద అయిదు నూర్లు. మందులకు రెండువేల రెన్నూరు, కైకిల్లకు చేతి ఖర్చులని ఒకసారి నాలుగు నూర్లు, మల్లొకసారి రెన్నూర్లు. పిల్లలకు, నీ పెండ్లాంకు బట్టలిప్పిచ్చిండు సేఠ్. అవొక ఏడునూర్లు. ఇట్లా అంతా గలిపి నీకిచ్చింది ఎనిమిదివేల రెన్నూర్లు. దానికి వడ్డీ ఒకవేయి నాలుగు నూర్ల నలభై ఆరు రూపాలు. ఇక నువ్ జమచేసిన పంట అంతా కలిపి, ఎనిమిది వేలు. జమా ఖర్చు లెక్క జూస్తే, నువ్వే యింకా పద హారు నూర్ల దెబ్బయి ఆరు రూపాయలు యియ్యాల బాకీ కింద.

బక్కన్నకు ఏమీ అర్థం కాలేదు. ఒకటే అర్థమయ్యింది. తను పండించి ఇక్కడ జమచేసిన పంట ఏడువేలది. తను తీసు కున్నది ఎక్కువ అన్నపుడు తనే బాకీ ఉంటాడని తెలుసుకున్నాడు.

రైతుకు కమీషన్ ఏజెంట్లు అప్పు యిచ్చేది జూన్ నెలలో కొంత, సెప్టెంబ ర్‌లో కొంత. అవసరం అనుకుంటే నవం బర్, డిసెంబర్‌లో కొంత. మూడు సార్లు యిచ్చిన రొక్కాన్ని ఒకసారి ఇచ్చినట్లు ఆ యిచ్చిన దానికి పన్నెండు నెలలకు వడ్డీ కడతాడు. నిజానికి రైతు డిసెంబరులోనే సగం పంట కమీషన్ ఏజెంటుకు ఇస్తాడు. ఇచ్చిన పంటకు వెంటనే లెక్క చేయరు. రావలసిన దానికి మాత్రం వడ్డీ వేస్తారు. మళ్లీ తూకంలో మోసం, ధరలో మోసం, వాళ్లు యిచ్చే విత్తనాలు నగదు రేటుకన్నా ఎంతో ఎక్కువ ఖరీదు. అలాగే ఎరువులు, మందులు. సగటున కమీషన్ ఏజెంటు డెబ్బయి అయిదు రూపాయల తన సొమ్మును వందకు అమ్ముతాడు. అప్పుడే ఇరవై అయిదు రూపాయలు లాభం. మళ్లీ ఆ వందమీద పద్దెనిమిది శాతం వడ్డీ అంటే రైతు డెబ్బయి అయిదు రూపాయ లకు బదులుగా నూటా పద్దెనిమిది రూపా యలు చెల్లిస్తాడు. అంటే డెబ్బయి అయిదు రూపాయలపై నలభై మూడు రూపాయలు నష్టపోతాడు. ఇదీ పల్లెలోని రైతు భారతం.







కమీషన్ ఏజెంట్లకే ఎరువుల దుకాణాలు, విత్తనాల షాపులు ఉంటాయి. మొదట్లో ఊరూరా తిరిగి మా దగ్గరికి రండి, మేం మంచి విత్తనాలిస్తాం. ఎరువులిస్తాం. మందులిస్తాం. మీ కవసరమైన డబ్బులిస్తాం. మీ పంటలకు మంచి ధరయిస్తాం అని కాళ్లా వేళ్లాపడి బతిమిలాడి పట్టుకుంటారు. ఒకసారి ఆ కమిషన్ ఏజెంటు ఊబిలో పడ్డవాడు ఇక మళ్లీ బయటకు రాడు.

అది అసలే ఊబి. ఆ ఊబిలోకి గుర్రమెక్కించి రప్పిస్తారు. ఎలాగూ గుర్రం మీదేగా వెళుతున్నాం అని అన్నెం పున్నెం ఎరుగని రైతు ఎందుకైన మంచిదని ఇంత కట్టెలమోపు తలపై పెట్టుకొని గుర్రమెక్కుతాడు. అలాంటి ఊబిలో దిగబడుతున్న రైతు భవిష్యత్తు ఎవరికి అవసరం లేదు. అయినా బ్రతకడానికి మరో మార్గం ఎంచుకోవడం ఇష్టంలేక అలా ఊబిలో పడుతూ లేస్తూ బతుకీడుస్తున్న బక్కన్నలెందరో.

మళ్లీ పంటలకు అప్పు చేయక తప్పని బక్కన్న మళ్లీ యీ ఏటికి అవసరమైన విత్తులు, ఎరువుల మందుల కోసం ఆ మునీమ్ పెట్టమన్న చోటల్లా వేలిముద్రలు వేసి ఖర్చులకు కొంత నగదు తీసుకున్నాడు. కమీషన్ ఏజెంటు షాపుల్లో నాణ్యత లేని విత్తనాలు, నాసిరకం మందులు, ఎరువులు కొని కొంత నగదు తీసుకొని బయలుదేరాడు. పిల్లలకు ఫలహారం పండ్లు కొనడం మరిచిపోలేదు.

తిరిగి పోతుంటే ఈ యేటికి ఎలాగో గడిచింది. అనే సంతృప్తే ఎక్కువ ఉంది. బక్కన్న మొహంలో అప్పయ్యానన్న ధ్యాస లేదు. ఆ అప్పులోంచి బయటపడననే ఆలోచన లేదు. ఇంకాస్త ఎక్కువ కష్టపడి యీ ఏడు పంట పండిస్తా. అప్పుడు యీ అప్పు ఎలా తీరదో చూస్తా అనే ధీమా ఉంది, ధైర్యం ఉంది.

అప్పుల్లో పుట్టి- అప్పుల్లో పెరిగి- అప్పుల్లో బతకడం ఈ దేశం రైతుకు అలవాటయిపోయింది. తరాలు గడిచినా తీరని అప్పులివీ అని బక్కన్నకు తెలియదు. దోచుకోబడే వాడు "దోచుకోబడుతున్నాడు" అని తెలియనంత పకడ్బందిగా యీ దోపిడి పద్ధతి నడుస్తుంది.

రేపు తెలిసినా అలవాటుపడ్డ ప్రాణం కాబట్టి సరే లెమ్మని సరిపెట్టుకుంటాడు.

బక్కన్న వాణిజ్య పంట లెయ్యకముందు ఎరువులు, పురుగుల మందు వాడక ముందు ఎవరికి అప్పు లేదన్న సంగతి మరిచిపోయాడు. నేడు వాణిజ్య పంటలు వేసి సాధించింది అప్పులు- అని తెలుసుకోలేక పోతున్నాడు. తను పండించిన పంటలు ఎవరికి సిరులు నింపుతున్నాయో, ఎవరు బాగుపడుతున్నారో యీ బక్కన్నలు గ్రహించడం లేదు.

విశ్వనాథంగారి వ్యవసాయం కూడా మూడు పూలు ఆరు కాయలుగా ఏమీ లేదు. పోతే బక్కన్నలాగా అప్పుకోసం ఒకరి దగ్గరికి వెళ్లాల్సిన అవసరం మాత్రం లేదు. విత్తనాలు, ఎరువులు, మందులపై బక్కయ్యలా అధిక మొత్తం చెల్లించడు. కాని మళ్లీ పండించిన పంట ధరలో, తూకంలో, మోసం విషయంలో ఇద్దరూ సమానమే. పండించిన పంట ధరలో వంద రూపాయలు పెరిగితే మురిసిపోయే రైతు, తన తూకంలో పది కిలోలు తక్కువైనా గుర్తించలేడు. గుర్తించినా సవరించలేడు. నాణ్యత తక్కువైందన్న సాకుతో ధర తగ్గించినా ఏమీ చేయలేడు.

చూస్తుండగా మరో పదేళ్లు గడిచిపోయాయి. విశ్వనాథంగారి తండ్రిగారైన రఘునాథంగారు పక్షవాతంతో బాధపడి పోయారు. ఆయన పోయిన ఆరు నెలలకే సుభద్రమ్మగారు కాలం చేశారు. ప్రస్తుతం

విశ్వనాథంగారు- జానకి మాత్రం అక్కడే ఉంటున్నారు. కలిగిన సంతానం నలుగురిలో ఇద్దరాడపిల్లలకు పెళ్లిళ్లయ్యాయి. ఒక అమ్మాయి నాగపూర్‌లో ఉంటుంది. మరో అమ్మాయి ఢిల్లీలో ఉంటుంది. ఇద్దరబ్బాయిలు. పెద్దాడు ప్రవీణ్ యం.టెక్. చేసాడు. చిన్నాడు నవీన్ ఎం.ఎస్. చేసి ఏదో స్పెషలైజేషన్ కోసమని అమెరికా వెళ్లాడు. మళ్లీ తిరిగి రాలేదు. వాడు వెళ్లిన సంవత్సరానికి యం.టెక్ చేసిన అన్నను కూడ రప్పించుకున్నాడు. ప్రస్తుతం ఇద్దరూ అక్కడే ఉంటున్నారు.

పిల్లలు పుట్టడం, పెరగడం, చదవడం, విదేశాలకు వెళ్లిపోవడం, ఆడపిల్లలు అత్తారిళ్లకు వెళ్లడం అంతా ఒక కలలా జరిగినట్లనిపిస్తుంది విశ్వనాథానికి.

పదేళ్ల క్రితం జానకి, విశ్వనాథంలు "మాకేం తక్కువ" అనుకునేవారు కాని, పదేళ్లలో విశ్వనాథం తల్లినీ, తండ్రినీ, ఇద్దరు కొడుకులను కోల్పోయాడు. ఆడపిల్లలున్నా రెండేళ్లకోసారి కూడా రావడానికి వీల్లేదు. వాళ్ల సంసారాలు వాళ్లవి. వాళ్లు ఉండీ లేనట్టే. ఆడపిల్ల తల్లికి అండగా, కొడుకు తండ్రికి చేదోడువాదోడుగా ఉంటారంటారు. జానకీ విశ్వనాథంలకు రెండూ లేవు.

ఆడపిల్లలు ఎలాగూ వెళ్లారని తెలుసు కాని మగ పిల్లలు తమతోనే ఉంటారని అనుకున్నారు. ఒకడు చదువుకొని పై ఊళ్లలో ఉన్నా, చిన్నాడన్నా వైద్యం చదివాడు కాబట్టి తమతోనే ఉంటారనుకున్నారు. అసలు వాళ్లను కన్నపుడు ఇద్దర్లో ఒకడిని వాడి యిష్టమొచ్చిన వృత్తిలో పెట్టాలని, రెండోవాడికి ఈ భూమి పుట్రా అప్పగించి వ్యవసాయం చేయించాలని అనుకున్నారు. కాని ఏదీ వీలు పడలేదు. ఎవరినీ శాసించే మనస్తత్వం కాదు విశ్వనాథంది. అందుకే అలా జరిగిందేమో అని అనుకుంటుంది జానకి.

★ ★ ★

ఊరికి దక్షిణాన ఉన్న వాడ అది. ఇరవై యిండ్లుంటాయి. కొంతమంది కులవృత్తి కొనసాగించితే, కొంతమంది వ్యవసాయ పనికి జీతం ఉండేది. వృత్తి చేసుకునే వారు ఊళ్లో ఉండే వ్యవసాయదారులకు, 'దాని' కింద తమ వృత్తి పనులు చేసి పెడుతుంటారు. అరకకు అవసరమైన పగ్గాలు, అర్నలు, జొత్తలు, మువ్వలు, గంటలతో అల్లిన అలంకరణ వస్తువులు తయారుచేసి యిచ్చేవారు. అలాగే యాజమానికి, అతడి కుటుంబ సభ్యులకు, పాలేర్లకు సంవత్సరానికి ఒక జత చెప్పులు కుట్టి యివ్వాలి. ఇవన్నీ జంతు చర్మంతోనే తయారు చేసేవాళ్లు. పంట నూర్పుళ్ల కాలంలో కల్లం చేయడం వీరి పనే. పంటను బంతి కట్టడానికి, నూర్పడానికి అవసరమైన నేలను పంట చేనులోనే శుభ్రం చేసి, నీళ్లు చల్లి అణుగొట్టి పేడ నీళ్లతో అలికి ఆ పైన గింజ ఎటుపోకుండా ఏ మోతుకాకులనో, టేకులూకులనో ఆ కల్లం నిండా భూమి కనిపించకుండా పరిచియివ్వాలి. ఇవన్నీ పనులు చేసినందుకుగాను ఊరిపై మాట్లాడుకున్న 'దాని' యిస్తారు. ఆపై చెల్లా చెదరై కల్లం దాటి పడిన గింజలూ వాళ్లవే.

ఊళ్లో ఎక్కడ పశువు చచ్చినా దాన్ని ఈడ్చేసే బాధ్యత హరిజనులదే. మంచాలు అల్లటానికి ఉపయోగించే తాళ్లు వీళ్లే తయారు చేసేది. తుంగ గడ్డితో మొదట సన్నని తాళ్లు అల్లి చుట్టచుట్టి వాటితో ఎంతో నేర్పుగా కళాత్మకమైన అల్లికలతో మంచాలను నేయడం వీళ్ల ప్రత్యేక కళ. వీరి ఆడవాళ్లు తీరిక వేళల్లో ఈత చెట్టు ఆకులను కోసుకొచ్చి, అణగబెట్టి రకరకాల చీపుర్లు, చాపలు అల్లి ఊళ్లో అంగట్లో అమ్ముతుంటారు. ఈ వస్తువుల అమ్మ

కంలో వస్తుమార్పిడే ఎక్కువ.

ఊరి అవసరానికి పోను మిగిలితేనే అంగళ్లలో అమ్ముకుంటారు.

నర్సిగాడు ఇంటి వరండాలో ఒక పక్క యింత పెద్ద తోలు ముందేసుకొని కత్తితో దాన్ని శుభ్రం చేస్తున్నాడు. అటుపక్క నులక మంచంలో నలుగురు యువకులు కూర్చుని ఉన్నారు. నర్సిగాడి భార్య గుమ్మం మీద కూర్చుని ఉంది. నర్సిగాడి కోడలు గుమ్మం పక్క తల మాత్రం బయటకు కనిపించేలా గుమ్మం పట్టుకొని నిలబడి ఉంది.

"ఇంతకు ఏమంటర్రా మీరు. నా దగ్గ రైతే ఇసం తినిపిస్తామన్నా చిల్లి గవ్వ లేదు. అసుంటప్పుడు యిరవైవేలు చేసుడు మాటలా... కన్నతల్లిని, ఉన్న ఊరును యిడిసిపెట్టి ఆ దేశం కాని దేశంల పోయి ఉండుడేంది? చెయ్యనీకి మన తాన పని లేకనా ఆం... అన్నాడు నర్సిగాడు, తోలు మీద వంపు కత్తిని చకచకా ఆడిస్తూ.

"ఇక్కడ ఏం పనున్నది మామా! ముందటి తీరు మంది మన చేతి చెప్పులు తొడుగుతున్నారా? అన్నీ కంపెనీ చెప్పులే నాయే. కాదంటే స్లిప్పర్లు, ప్లాస్టిక్ చెప్పులు. నులక మంచాలున్నాయా? తాళ్లొచ్చినయి, నవార్లచ్చినయి. ప్లాస్టిక్ నవార్లచ్చినయి. ఇప్పుడు మనం చేసే చెప్పులు, తాళ్లు ఎవరిగావాల? ఎవడడుగుతాడు మన పనిని? " అన్నాడు రాజారాం.

"మన చేతుల హునర్ (కళ) ఉన్నది. మనం చేయితోని చేసిన చెప్పుగాని, తాడుగాని ఏండ్ల తరబడి నడుస్తయ్. కాని మందికి షోకులు గావాల. మన పనిని ఎవడు జూస్తడు చెప్పు" అన్నాడు మరో యువకుడు.

"అది కాదే ముందు లగ్గమైనా, చావైనా, మంచైనా చెడ్డయినా మనం లేకుంటే నడవకపోవు. మరి యిప్పుడు? మంచికి చెడుకు మన డప్పులు మోటయినయి. బ్యాండుగాల్లు గావాల. ఆల్లు బజాయించే పాటలు గావాలి. ముందు మనం డప్పు కొడ్తే ఊరంగం వచ్చేది. శివమెత్తి ఎగిరెటోల్లమంది. ఇప్పటి పోరగాండ్లకు 'అబ్బనీ తియ్యని దెబ్బ గావాల" మన డప్పు ఎవలకు గావాల' అన్నాడు కాస్త వయసు ముదురుతున్న ఊశన్న.

"మామ అన్ని జూస్తలేడా, మామకు తెల్వదా ఏంది. ఆశిగాడు దుబాయ్ పోకుడు మాకు సమ్మతమే. కాని 'ఇదే' లేదు" అంటూ నర్సిగాడి భార్య డబ్బు లేదన్నట్లుగా చూపుడువేలుపై బొటనవేలుని ఎగరేస్తూ సైగజేసింది.

నర్సిగాడు కోడలు కళ్లప్పగించి ఎవరు మాట్లాడితే అల్ల దిక్కు కళ్లు యింత చేసుకొని చూస్తుంది. బయట కూర్చున్న వాళ్లకు నర్సిగాడి కోడలు సగం మొహం, గుమ్మానికి పట్టుకున్న ఎర్ర గాజులున్న చేయి మాత్రం కనిపిస్తున్నాది.

"ఇన్నవు గద అల్లుడు. మీ అత్తమాట-సైగ. ఆ పోరడు దుబాయ్‌కి పోయి నాలుగు రాల్లు కమాయించి తేవాల్నని నాకు మాత్రం లేదా. చేతిలో అదే లేదు. అది లేకుండా ఏమనుకుంటే ఏం లాభం" అంటూ తోలుమీద పాదాలసైజు అట్టల నుంచి పెన్సిల్‌తో గుర్తులు వేస్తున్నాడు.

"ఎవల్లనన్న ఒక యాడాది కోసం ఒక యిరవై వేలు అడగరాదే. మల్ల ఆల్లయాల్లకు డబల్ బంగారం ధరలో యిస్తంగని గట్ట చూడరాదు" అన్నాడు రాజారాం.

దుబాయ్ వెళ్లే కూలీలకు పెట్టుబడి పెట్టే పద్ధతుల్లో ఈ బంగారం పద్ధతి ఒకటి. ఇరవైవేలు అవసరమైతే యిరవై వేలు తీసుకోవడం, ఆ యిరవై వేలకు ఆ రోజు మార్కెట్‌లో ఎంతనైతే బంగారం వస్తుందో ఏడాది తర్వాత రెండింతలు బంగారం తెచ్చిచ్చి యిరవైవేల అప్పు తీర్చు



కోవడం లేదా నేటి బంగారం ధరకు ఏడాది తర్వాత రెండింతలు డబ్బు చెల్లించడం పద్ధతి. అలా అని కాగితం వ్రాసుకుంటారు యిచ్చేవాళ్లు. దుబాయ్ వెళ్లిన వాడికి మొదటి ఏడాది ఏమీ గిట్టదు. అక్కణ్ణుంచి మొదటి ఏడాది డబ్బు పంపి అప్పు నుంచి రుణ విముక్తుడవుతాడు. ఇక తర్వాత మిగిలేది లాభం. మధ్యలో వచ్చేప్పుడు- రకరకాల ఫారెన్ వస్తువులను తెచ్చి ఇండియాలో అమ్ముకొని దారి ఖర్చులను సమకూర్చుకుంటారు. కెమెరాలు, టేపు రికార్డులు, వాచీలు, బట్టలు, కలర్ టి.వి.లు, వి.సి.ఆర్.లు, వి.సి.పి.లు యిలా ఆధునికమైన వస్తువులను రకానికొకటి చొప్పున తెచ్చి, ఉన్నన్నాళ్లు షోకు చేసి వెళ్లే ముందు అమ్మేసి మళ్లీపోతారు. ఇలాంటి దుబాయ్ వెళ్లే లేబర్‌లకోసం యీ ప్రాంతం నుండి వారానికి ఒక వీడియోకోచ్ లగ్జరీ బస్ బొంబాయి వెళుతుందంటే అర్థం చేసుకోవచ్చు.

దుబాయ్ వెళ్లేవాళ్లు, వెళ్లాలనుకునేవాళ్లు, వెళ్లివచ్చేవాళ్లు ఏ సంఖ్యలో ఉన్నారో తెలుసుకోవడానికి వెళ్లే వాళ్లంతా పెద్దగా చదువురాని కూలీలే. అంతా కాంట్రాక్టు కూలీలు. బ్రోకర్స్ ద్వారా కూలీలను సమకూర్చే ఏజన్సీల ద్వారా వీళ్లంతా ఏడాది, రెండేళ్లు, ఐదేళ్లు ఇలా రకరకాల కాంట్రాక్టులపై వెళుతుంటారు.

సాధారణంగా ఐదేళ్లకు తక్కువ కాకుండా ఎవరు వెళ్లినా పెద్దగా లాభించేది ఏమీ ఉండదు. ఐదేళ్లలో మధ్య



వీలుని బట్టి ఏజన్సీలు వీళ్లకు తమ ఇళ్లకు రావడానికి వీలు కల్పిస్తాయి నెల రెండు నెల్ల కోసం.

"ఆ చెప్పులేవో తీసుకొని విశ్వనాథం బాబింటికి ఎల్తనంటివి గద ఆ అయ్యనే అడిగి చూడరాదు" అన్నాడు రాజారాం.

నర్సిగాడి కొడుకు పులాజి ఏమీ మాట్లాడడంలేదు. తమ తండ్రిని ఒప్పించలేకనే మేనబావను తీసుకువచ్చాడు. అన్నీ అతనే మాట్లాడి ఒప్పిస్తాడని.

"విశ్వనాథం బాబుని ఏమని అడుగుతాం. మిత్తి అంటే ఆశ ఉన్నోన్ని, బంగారం అంటే పడిచచ్చెటోన్ని పైస పైస డబుల్ అవుతుందనుకునేవాణ్ణి అడిగితే లాభం"

"ఎవ్వల్లనన్న అడుగు, ఎట్లనన్న జెయ్యి. కాని ఆ పోరనికి పైసల ఇంతజామ్ జెయ్. బంగారమసుంటి చాన్స్ ఇది. పోతే మల్లరాదు. ఒక నాలుగేండ్లుంటడు. నాలుగు రాళ్లు ఎనకేసుకొస్తడు. ఆ అచ్చిన పైసలను మిత్తికి తిప్పుకున్నా మిగిలిన కాలం మారాజు తీర్గ బతకవచ్చు"

"అదిగాదు రాజిగా. ఈడ ఈ పల్లెల బతుకుడు కష్టమే. నేను కాదనను కాని ఏ బస్తీకో పోయి ఇంత దుకాణం పెట్టుకుంటే అందరం ఒకల్ల కండ్లముందు ఒకల్ల ముంటం గదా" అన్నాడు నర్సిగాడు.

"ఇల్లిడిచి పోతున్నపుడు ఇంక దూరమేంది, దగ్గరేంది మామ"

"మరి గిట్ల పోతననుకున్నాడు నిరుడే పోనుండే. ఇప్పుడు ఆడు ఐదేండ్ల అట్ల పోతే గీపోరి గతేంగాను" అంటూ నర్సిగాడు కోడలివైపు సైగ జేసిండు.

కోడలు వెంటనే గడపలోంచి పక్కకు తప్పుకుంది.

"ఆ పోతే రాడా ఏంది నా కొడుకు. ఎంత మంది పెండ్లాలను ఇడిసి పెట్టి పోతలేరు. మల్లా అస్తలేరు. దునియల ఈడే పెండ్లాన్నిడిసి పెట్టి పోతున్నట్టు మాట్లాడతవేంది. ఏదన్న మాట్లాడ్తే సోయి ఉండి మాట్లాడాల. ఇంటి మనిషివి నువ్వే గిట్ల అంటే రేపు పదిమంది పది తీర్ల అంటరు. ఆడ సేతకాక మద్దెలొన్ని అన్నట్టు ఫైసల్ చేసుకోక మధ్యల ఆన్ని తప్పుపడ్తవేంది" అంటూ ఇంత ఎత్తున లేసింది- నర్సిగాడి భార్య.

అంతవరకు ప్రశాంతంగా ఉన్న వాతావరణం ఒక్కసారిగా భీభత్సంగా అశాంతిగా తయారైంది.

"నీ అవ్వ! పోయి పోయి నామీద వడ్తవేందే. ఉన్నమాట అన్న, పోయినోల్లంతా ఐదేంళ్లు కాపురాలు, సంసారాలు చేసి పోయిండ్లు. లేదంటావ్ లగ్గం జేసుకోకుండా పోయిండ్లు. కాని గిట్ల లగ్గం జేసుకొని కొత్త పోరిని ఇంట్ల ఉంచి దేశంకాని దేశం ఏండ్ల తరబడి పోలేదు. ఉన్నదంటే.. నీ అవ్వ అంత ఉలుకేందే నీకు" అంటూ తనూ దబాయించాడు నర్సిగాడు.

నర్సిగాడు కోడలు ఇంట్లోంచి పెరట్లోకి వెళ్లి చూరుకింద కూర్చుని మోకాళ్ల మధ్య తల పెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. ఐదేండ్లు మగన్ని వదిలి ఉండాలంటే ఆమె మనసు ఒప్పుకోవడం లేదు.

నర్సిగాడు ఎలాగైనా డబ్బులు సమకూర్చాలనే ఉద్దేశంతో వీలున్నచోటల్లా అప్పుకు ప్రయత్నించాలనుకున్నాడు.

విశ్వనాథంగారి నౌకర్లకు ఇవ్వాల్సిన చెప్పులు, అరకతాళ్లు తీసుకొని విశ్వనాథం ఇంటికి బయలుదేరాడు నర్సిగాడు. దారిలో పూజారి శ్రీధరాచారి.

"ఏంరా నర్సిగా... నీ కొడుకు దుబాయ్ పోతున్నాడటగా? నిజమేనా ఎప్పుడు పోతున్నాడు. ఎన్నాళ్లుంటాడు- అక్కడ" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

"ఆడు అనుకుంటుండు ఆని దోస్తులు, మేనమామ, తల్లి అంతా సై అంటే సై

అంటున్నారు... కాని నా దగ్గర్నే పైస ల్లేవు. అదే పరేషాన్‌ల తిర్గుతున్న. ఇక్కడ్నే ఉండి నాకు తోడు పనిజేసుకోరా అంటే యినడాయే. నాకేమో రోజురోజుకు చేతగాక పోవట్లే. పని జేసెటోడికి ఎక్క డైతే ఏంది"

"పోతున్నపుడు పోనీయరాదు? పైసల్దే ముంది. నేడు గాకపోతే రేపన్న దొర్కు తాయి. కాని ఇట్లాంటి మోఖా మల్లరాదు. ఈ ఊల్లె ఏమున్నదిరా. నీ పనిజేసుడు. ఆనికి నాదాన్‌గున్నది. అందుకే పోతనం టున్నాడు" అన్నాడు పూజారి.

అంతలోనే మరో ఇద్దరు పెద్ద మను షులు అటుగా వెళ్తు "ఏంది సంగతి" అంటూ పలకరించారు పూజారిని. విషయం వివరించాడు పూజారి.

"పోనియ్యరాదు, ఈ ఊల్లె ఏం మిగి లింది. అంతో యింతో సదువుకున్న పోరలు, షోకులు తెలిసినోల్లు మన మోటు పనులెక్కడ జేస్తారు. ఎంతమంది పోకుడులేదు. పోని" అన్నాడో పెద్దమ నిషి.

కొడుకు దుబాయ్ వెళ్లే విషయంపై నలుగురు నాలుగు రకాల అంటున్నారు నర్సిగాన్ని.

"సదువుకొని లుంగీలు కట్టి, నోట్ల బ్రష్షు పెట్టి, కిర్‌కెట్ యినే యీ మన పోర గాండ్లు మనకెందుకు పనికస్తరు. ఈ ఊరన్న, యీ మన్నన్నా అల్లకు రోత. అల్లు యిక్కెడెందుకుంటారు. ఎట్లన్న జేసి ఆ బస్తీలల్లకే పోతరు. అక్కడ హోటలల్ల చాయ్ కప్పులు కడిగిన మానే, ఆల్లకు సంతోషమే అక్కడ. ఈడ ఉండి అయ్యకు అవ్వకు ఆసరా ఉండి ఉన్నంతలో గటక అంబలి తాగుదామన్న కొడుకు ఒక్కడు లేడు. థూ నీయవ్వ గడ్డు కాలమొచ్చింది" అని ఒకరు.

"మొగపోరగాండ్లకు ఆడపోరగాండ్ల తీరు సింగారాలాయే, షోకులాయే. ఇక్కడ అవ్వి నడవయాయే. పోతనన్నోలని పోనీయ రాదు" అంటూ నిష్టూరంగా మాట్లాడాడు ఒకాయన. అతడి నలుగురు కొడుకులు అతణ్ణి కాదని బస్తీల్లోనే పనిచేసుకు బతు కుతున్నారు.

ఎవరెన్ని చెప్పిన నర్సిగాడి మనసు సమాధానపడటం లేదు. వెళ్లి విశ్వనా థంను కలిసాడు. విషయం వివరించాడు. అంతా విని నిట్టూర్చాడు విశ్వనాథం.

"మారుతున్న కాలంతో వాళ్లు మారుతు న్నారు. మన పిల్లలు బ్రతికే తీరులో మనం బతకలేదు. బహుషా మన పెద్ద వాళ్ల తీరు మనం కూడా బతకలేదేమో. ఎంతో కొంత మార్పు ఉంటది. నర్సిగా! మనిషి మీద రెండు బలాలు పనిచేస్తు న్నాయి. ఒకటి పైబస్తీలు, పట్నాలు, యింకో దేశాలు. రెండోది వాళ్లు పుట్టి పెరి గిన ఊరు. ఈ రెండింట్ల దేని బలం ఎక్కువైతే మనిషి అటుపోతాడు. ఇప్పుడు మన పిల్లలకు ఈ ఊళ్లో ఏమీ కనిపిం చడం లేదు. ఉన్నా అది వాళ్ల కంటికి, మనసుకు ఆనడం లేదు. పోయేవాళ్లను పోనీ. ఎంత చేసినా వాళ్లను ఆపలేంకదా" అన్నాడు విశ్వనాథం.

"ఈ పాడు సదువులే యీ పోరగాం డ్లను యిట్లా జేస్తున్నాయి దొర. ఈడ్ని బడిల ఏయవట్టేగదా. వాడు మొదట బస్తీ లకాలు పెట్టింది. ఆ బస్తీల తళుకు బెళుకు ఈల్లను పట్టేసింది. కట్టుకున్నదాన్ని యిడిసి పెట్టి, ఉంచుకున్నదాని వెంట బోయినట్టు ఈల్లు మనల్ని, మన ఊర్ని యిడిసి తల్లి రొమ్ము గుద్ది పోబట్టిరయ్యా. ఎలాంటి కాలమొచ్చిందయ్యా" అంటూ బాధపడసాగాడు నర్సిగాడు.

కొన్నేళ్ల తర్వాత...

నర్సిగాడి కొడుకు ఇప్పుడు దుబాయ్‌లో ఉన్నాడు.



విశ్వనాథం పిల్లలు అమెరికా- బోస్టన్‌లో ఉన్నారు. అక్కడికెళ్లాక తండ్రికి ఒక ఉత్తరం, కాసెట్ పంపించారు. ఆ కాసెట్‌లో వాళ్లుండే ఇల్లు, వాళ్లు పనిచేసే స్థలాలు, వాళ్ల కిచెన్, బెడ్‌రూం, డ్రాయింగ్ రూం, అన్నీ వివరంగా చిత్రించి పంపారు.

నర్సిగాడి కొడుకు దుబాయ్ నుంచి ఉత్తరం రాయలేక కాసెట్‌లో తమ మాటలు నింపి పంపుతున్నాడు. రెండు మూడు సార్లు అక్కణ్ణించి పంపాడు. కొడుకు మాటలు కాసెట్‌లో విని తల్లి, తండ్రీ మురిసిపోయారు. నర్సిగాడి కోడలు శ్రీదేవి మరీ మురిసిపోయింది. మొగుడు ముందుండి ముచ్చట్లు చెప్తున్నట్లే ఉందని, ఆ కాసెట్‌ని ఎన్నిసార్లు విందో లెక్కలేదు.

జానకికి కొడుకుల పట్ల కోపం ఇంకా పోలేదు. వాళ్లపట్ల ఆమె ఇంకా ముభావంగానే ఉంటుంది. బాగుండదని విశ్వనాథంగారే వాళ్ల ఉత్తరాలకు జవాబులు వ్రాస్తుంటారు.

నర్సిగాడి కోడలు శ్రీదేవి అత్తగారింట్లో ఉంది. అప్పుడప్పుడు వారం-పది రోజులు పుట్టింటికి వెళ్లి వస్తుంది. పుట్టింటికి వెళ్లినప్పుడల్లా అక్కడ ఉండే ఒక కొత్త వ్యక్తితో శ్రీదేవికి పరిచయం ఏర్పడింది. అది పోయినప్పుడల్లా పెరుగుతుంది. ఆ కొత్తగా పరిచయమైన వ్యక్తితో మగడికి దూరంగా ఉన్న శ్రీదేవి మనసు జారుతోంది. కాని కాలు ఇంకా జారలేదు.

శ్రీదేవి మనసు ఊగిసలాటలో ఉంది. మంచి చెడుల తర్కంలో కొట్టుకుంటోంది.

బతుకమ్మ పండక్కు శ్రీదేవి పుట్టింటికి వచ్చింది. పున్నమి వెన్నెల రాత్రి ఊరి పడుచులందరూ అర్ధరాత్రి పన్నెండు కావస్తున్నా ఇంకా హుషారుగా ఆడుతున్నారు, పాడుతున్నారు. బతుకమ్మ చుట్టూ కట్టిన గద్దెలను రంగురంగుల ముగ్గులతో అలంకరించి రకరకాల పూలతో బతుకమ్మలను పేర్చారు. బాయి చుట్టూ చప్పట్లు కొడుతూ లయబద్ధంగా కదులుతూ ఆడుతున్నారు. అందరి కళ్ళు శ్రీదేవి పైనే ఉన్నాయి. వెన్నెల వెలుగులో శ్రీదేవి వెలిగిపోతోంది. అందమైన ఆడది ఎటు కదిలినా అందమే అని శ్రీదేవిని చూస్తే తెలుస్తుంది. ఆడవాళ్ళే కాసేపు కళ్లార్పక చూసే అందంలో ఉంది శ్రీదేవి. పాట ఆట పోటీ పడుతున్నాయి. బాయి చుట్టూ ఆడవాళ్లు తన్మయత్వంతో కదులుతూ అడుగులేస్తున్నారు.

కొంతమంది పక్కనే ప్రత్యేకంగా కట్టిన ఊయల్లో ఊగుతున్నారు. ఆ ఊగే ఊపు, వేగం వారి ఉత్సాహానికి, ఆనందానికి, యవ్వనానికి ప్రతీకగా కనిపిస్తున్నాయి. ఉయ్యాల ఊపు ఎంత ముందుకు వెళ్లాలో అంత ముందుకు, ఎంత వెనక్కు వెళ్లాలో అంత వెనక్కు వెళుతుంది. కింద ఉండి ఊపేవాళ్లు కేరింతలు కొడుతూ ఉయ్యాలను ఊపుతున్నారు. ప్రతి కదలికా వెన్నెల్ని, మబ్బుల్ని కయ్యానికి కాలు దువ్వి కవ్విస్తున్నట్టుగా ఉంది.

కొంతమంది వెన్నెల క్రీనీడలో దాగుడుమూతలాడుతున్నారు. పాటలు పాడుతూ వేగంగా కదలలేని వాళ్లు అంతంత ఎత్తు ఊపితే తట్టుకోలేనివాళ్ళు వయసును మరిచి దాగుడుమూతలాడుతున్నారు.

ఆడి పాడి అలసిపోయిన శ్రీదేవి పాట కాగానే మెల్లగా పక్కకు తప్పుకుంది. ఆడి పాడడంతో శ్రీదేవి ఊపిరి బలంగా, వేగంగా పీలుస్తుంది. "నేను కొన్ని నీళ్లు తాగొస్తా" అంటూ చకచకా ఇంటి వైపు కదిలింది శ్రీదేవి. వెన్నెల్లో అభిసారిక వెళుతున్నట్టుంది. ఇంటి వెనక పెరటి వరండాలో నీళ్లబిందె దగ్గరికి వెళ్లిన శ్రీదేవిని రెండు చేతులు బలంగా పట్టేశాయి. ఉలిక్కిపడి అరవబోయిన శ్రీదేవి నోరు, ఎవరో



పెదవులతో మూసేశారు. అంతా అర్థమైన శ్రీదేవి కళ్లు ఇంతయ్యాయి.

దాహంతో వచ్చిన శ్రీదేవి, ఇంకొకరి దాహం తీర్చి తర్వాత తన దప్పిక తీర్చు కుంది.

★ ★ ★

ఒకరోజు బక్కన్న తీరిగ్గా లేగలు మన్ను తినకుండా వాటి మూతికి కట్టె చిక్కాలను అల్లుతూ కూర్చున్నాడు. భూదేవి తిరగలి పైన గుటక ఇసురుతోంది. పిల్లలు ఇద్దరు గది అద్దెకు తీసుకొని వండుకొని తిని చదువుకుంటున్నారు. ఇప్పుడు ఇంట్లో ఉండేది భూదేవి, బక్కన్నలే. చిక్కాలు కట్టడం అయింది. ఎప్పుడు మన్ను నాకే దూడకు చిక్కం తీసుకుపోయి దాని మూతికి బిగించి కట్టాడు. 'ఇప్పుడు తిను చూస్త మన్ను' అంటూ దాని నడ్డీమీద ఒక్కటేసి, మల్లా ప్రేమగా నిమరసాగాడు. లేగదూడకు లోపల కాళ్ళ సందున రెండు మూడు పిడుదులు కనిపించినాయి. వెంటనే బలంగా పట్టిలాగి మట్టిలో వేసి నలిపేసాడు బక్కన్న.

తిరుగలి లయబద్ధంగా కదులుతుంది. ఆ లయకు అనుగుణంగా భూదేవి ఒక 'ఉడుగు' నందుకుంది. ఆ విసుర్రాతి చప్పుడు, భూదేవి పాట విని పక్కింటి గంగామణి వచ్చి కూర్చొని ఒక చేయి వేసింది. పాటకు పాట కలవడం, చేతికి చేయి వేయడం పల్లెటూరి సాంప్రదాయం. పనికి పాట తోడు, అప్పుడు పనిలో అలుపు, ఆయాసం ఉండక ఉత్సాహంగా ఉంటుంది.

ఇద్దరి చేతులుపడి విసుర్రాయి గిరగిర తిరుగుతుంది. మంచుకొండల్లో మంచు కురిసినట్లు తిరుగలి చట్టూ జొన్న గటక ధారగా పడుతోంది. భూదేవి ఒక చేత్తో తిరుగలి తిప్పుతూ మరో చేత్తో వేగంగా జొన్నలు తిరగలిలో పోస్తుంది. మాట మంతి లేకుండా నిశ్శబ్దంగా పనిచేయటం విసుగును, అలసటను కలిగిస్తుంది. పని చేస్తూ మాటలు పెట్టుకుంటే పనిలోవేగం, నాణ్యత తగ్గుతుంది. ధ్యాస అంతా పని మీదే ఉండి అలుపు, విసుగు రానివ్వనిది పాట ఒక్కటే.

"ఏదన్నా ఒక ఉడుగందుకో వదినా" అంది భూదేవి.

"ఆహా యిదేమిదేమి! వదినె...పరుగెత్తు చున్నాదే సాటిబోటులెల్ల నవ్వుచుండగా" అంటూ పల్లవి అందుకుంది నాగమణి, పల్లవి రెండు సార్లు పాడి చరణం అందు కుంది.

"చీర జారగా- వన్నె మీరగ- సన్ను తాంగి జలకమాడే సరిపొద్దునా" అంటూ చరణం పాడి మళ్లీ పల్లవి అందుకుంది.

భూదేవికి వచ్చిన పాటే కాబట్టి తరు వాత పల్లవి తానే పాడి చివరి చరణం అందుకుని "చిన్నదాననా వదిన యెన్నడె రుగువా అన్న మనసు చిన్నబోయె వన్నె లాడిరో" అంటూ ముగించింది.

ఒకరి తరువాత ఒకరు పాట అందు కుంటూ గటక యిసురుతున్నారు. బక్కన్న తీరిగ్గా కూర్చుని పాటలు వింటు న్నాడు.

అంతలోనే కొత్వాలు నారాయణ వచ్చి పలకరిస్తే కళ్లు తెరిచి చూసాడు.

రెవెన్యూ అధికారులు ఊళ్లోకి వచ్చిన పుడు వాళ్లకు అన్ని ఏర్పాట్లు చూడటానికి, సంవత్సరం పొడుగునా పటేల్ పట్వారీ లకు బంట్రోతుగా, అవసరమైతే పోలీసు లకు ఊరిమీద పనిబడినా, ఎన్నికలపుడు ఎన్నికల నిర్వహణ సిబ్బంది అందరికి 'నీ బాంచెన్ కాల్మొక్తా, జీ హుజుర్, అయ్యా హుకుం' అంటూ చేతులు కట్టుకొని నిల బడే వాడే యీ కొత్వాలు. ప్రభుత్వ రెవె న్యూ యంత్రాంగంలో భద్రత, ఎదుగుబొ దుగులేని చివరిస్థాయి ఉద్యోగి.

రెవిన్యూ నుండి వచ్చిన ఒక కాగితం బక్కన్నకు యియ్యడానికి వచ్చాడు కొత్వాలు నారాయణ. 'ఈ కాయితం నీకి య్యమన్నాడు పటేలా' అంటూ ఒక కాగితం ఇచ్చాడు. కొత్వాలుకు చదువు రాదు కాని వృత్తి నిర్వహణకు ఎందరివో సంతకాలు తీసుకోవాలి కాబట్టి ఎప్పుడూ అతని బనీసు జేబులో ఒక సిరాపెన్ను ఉంటుంది. ఒక కాగితం ఇచ్చి అలాంటిదే ఇంకో కాగితం పైన బక్కన్న వేలిముద్ర వేయించుకున్నాడు.

"ఒక బీడి ఉంటే యిట్ల పడేయండి పటేలా" అంటూ దోసిలి చాచాడు.

తమ కులంవాళ్లను తప్ప మిగితా వాళ్లందరిని 'పటేలా', 'దొర', 'అయ్యా' అంటూ సంబోధించడం ఆ వృత్తిలో పరిపాటి. 'నీ కాల్మొక్తను బాంచెన్' అనడం కూడా సామాన్యం. కొత్వాలు నారాయణ దళితుడు. సమాజ కులవ్యవస్థలో చివరి మెట్టు కింద ఉన్నవాడు. అందుకే అంత అణిగి మణిగి ఉంటాడు. ప్రభుత్వం వీరికి నెలకు ఐదు రూపాయల లెక్కన జీతం ఎప్పుడో ఆరునెల్లకు, సంవత్సరానికి యిస్తుంది. ఆ మాత్రం దానికే ఒకే కుటుంబంలో పోటీలు, దాయాదుల మధ్య పోటీలు. 'కొత్వాలు' ఉద్యోగం అంటే ప్రభుత్వ ఉద్యోగం. అదొక గొప్ప. అందు కని ఒక ఏడు ఒకరు చేస్తే మరో ఏడు యింకో కుటుంబం చేస్తుంది.

బక్కన్న నారాయణ చేతిలో ఒక బీడి వేసాడు. బక్కన్నకు నారాయణ అంటరానివాడు. అందుకే పైనుండి వేసాడు. ఆ ఉన్నంతలోనే బక్కన్నది పైచేయి. నారాయణది కిందిచేయి.

కాగితం అందుకున్న క్షణం నుంచి బక్కన్న మనసులో అలజడి మొదలయ్యింది. ఫారెస్టు వాళ్లు, రెవెన్యూ వాళ్లు మాటలతో చేతులతో పీడించి డబ్బు గుంజడం బక్కన్నకు తెలుసు. అది

## కొత్తగాలి...

**చీకటి వాకిట్లోకి**
**వెలుగుకన్న**
**ఉషోదయ**
**సంబరాలు**

-జి.వి.ఎస్. ప్రియంవద, శ్రీకాకుళం

మామూలే. కాని కొత్తగా గీ కాగితం ఎందో అని ఆలోచనలో పడ్డాడు బక్కన్న. అదే విషయం అడిగాడు నారాయణను.

"నాకు సదువస్తదా ఏంది. అయినా ఆఫీసుల అనుకుంటుంటే యిన్న. నీ భూమి సర్కారోల్లు తీసుకుంటరంట. తీస్కోని మా ఆసుంటోల్లకు మనిషికి ఐదెకరాలు యిస్తరంట. నీతాన తీసుకున్న భూమికి సర్కార్ లెక్కన పైసల్ కట్టిస్తరట. అంత యిన్నమాట నాది. దాంట్ల యింతకన్న ఎక్కువుంటే నాకు తెల్వదు" అంటూ బీడి దమ్ము గుండెనిండా గుంజాడు.

అక్షరం తెలిసిన వాళ్లతో కాగితం చదివించుకున్నాడు బక్కన్న. షెడ్యూల్డ్ కులాల వారికి కుటుంబానికి యింత భూమిని ఉచితంగా యిచ్చే కార్యక్రమంలో ప్రభుత్వం బక్కన్న భూమిని కొనడానికి ఎంచుకొంది. బక్కన్న ఎందులో షెడ్యూల్డ్ కులాల కన్నా ఎక్కువో ఆ తాకీదు పంపినవారికే తెలియాలి. బక్కన్నకున్న భూమి మొత్తం యిరవై ఎకరాలు. అది ఆయనకు ఎక్కువ అని ప్రభుత్వం ఎలా అనుకుందో మరి. మొత్తానికి నీ భూమి షెడ్యూల్డ్ కులాల వారికి కేటాయించే నిమిత్తం కొనదలిచాం. కావున ఫలానా తేదీన దిగువ సంతకం చేసిన అధికారిని ప్రత్యక్షంగా కలువ వలసిందని ఉంది దాంట్లో.



ఆదరాబాదరా బక్కన్న పటేల్ దగ్గరికి పరుగెత్తాడు. అతడు బక్కన్నను పట్వారి దగ్గరికి పంపాడు.

పట్వారి గిర్దావర్ దగ్గరికి ఉరకమన్నాడు.

గిర్దావర్ సంబంధిత గుమస్తా దగ్గరికి పొమ్మన్నాడు. ఆ గుమస్తా "పేష్కార్ సాబ్"ని కలువమన్నాడు.

బక్కన్న పేష్కార్ సాబ్‌ని కలిసాడు.

విషయమంతా విన్న పేష్కార్ సాబ్ ఎందుకన్న మంచిది. ఒకసారి తాసీల్‌దార్‌సాబ్‌ని కలువమన్నాడు. తాసీల్‌దార్ సాబ్ అంతా విని 'నేను చూస్తా, పో' అన్నాడు.

బక్కన్న మల్లాపై నుంచి కింది వరకు అందర్నీ దర్శించుకున్నాడు.

"తాసీల్‌దార్ సాబ్ చూస్తాపో" అన్నాడంటే పని అయ్యే గుంజాయిష్ ఉన్నట్టే కాని, కొంచెం కర్సయితది" అన్నాడు పట్వారి సాబ్.

"ఎంతన్న కానియండ్లి దొర మీ కాల్మొక్త. నా భూమి నాకు దక్కేటట్టు సూడుండ్లి, మీ రుణం ఉంచుకోను" అన్నాడు బక్కన్న కన్నీళ్ల పర్యంతమయి.

"అట్లనే గాని రెండు రోజులు ఆగి మల్లా గనిపియ్యి. ఏదన్న ఇక్‌మత్ చేద్దాం" అన్నాడు పట్వారి.

పట్వారి భరోసాతో కొంత ఊరట కలిగింది బక్కన్నకు. బక్కన్నకు తెలుసు పట్వారి తలుచుకుంటే ఎంతపనైనా అవుతుందని. రెవెన్యూలో భూమి విషయంలో పట్వారీ అంటే పరమాత్మునితో సమానం. తిమ్మిని బమ్మి, బమ్మిని తిమ్మి చేసే మహా మాయగాడు. అలాంటి రికార్డు అతడి వద్ద ఉంటుంది.

బక్కన్న యింటికి వెళ్లి మంచంలో పడుకొని రకరకాలుగా ఆలోచిస్తున్నాడు. పట్వారి పనిచేసి పెడ్తడా, భూమి ఉంటదా, పోతదా, భూమి పోతే అంతా బతుకు డెట్లా? రకరకాల ఆలోచనల మధ్య బక్కన్న నిద్రలోకి జారుకున్నాడు...

అప్పుడే తెలవారుతోంది. అంతలోనే రెవెన్యూ వాళ్ల రెండు జీపులు బక్కన్న యింటిముందు ఆగాయి. "బక్కన్న ఎవరు? తాసీల్‌దార్ సాబ్ అచ్చిండు. రమ్మంటుండు" అంటూ పిలిచాడు బిల్ల బంట్రోతు.

బక్కన్న ఆదరాబాదరా జీబు దిక్కు ఉరికిండు. కాని అప్పటికే తాసీల్‌దార్ జీబు కదిలిపోయింది రెండో జీపులోంచి ఓ వ్యక్తి... "మేము అట్టిపోయి పదిగంటలకు జైనథ్ దగ్గరి డాగ్ బంగ్లా కొస్తం. అక్కడుండు. అప్పుడు మాట్లాడ్తాడంట తాసీల్‌దార్ సాబ్" అంటూ రెండో జీబు బక్కన్న మీద దుమ్ము రేపుకుంటూ వెళ్లిపోయింది.

అప్పటికి వేళ ఏడు కావస్తుంది. పదిగంటల్లోగా డాగ్ బంగ్లాలో ఉండాలి. ఎంతలేదన్న ఆ డాగ్‌బంగ్లా యీ ఊర్నించి ఆరు కోసులన్నా ఉంటుంది. అయ్యార్ బయ్యర్‌గా యింట్లోకురికి, ఎందుకన్నా మంచిదని పాతంచేసి పెట్టుకున్న ఐదువందల రూపాయలు తీసుకొని, భూదేవి 'యింత కూడు తినిపో' అని అంటున్నా వినకుండా పరుగెత్తాడు. ఎంత వేగంగా నడిచిన పది గంటల వరకు చేరుకోవడం కష్టం. పరిగెత్తినట్లు నడవసాగాడు. అయినా లాభం లేదనిపించింది. ఇక పరుగెత్తడం మొదలు పెట్టాడు. ఆగకుండా పరుగెత్తడంతో ఒళ్లంతా చెమటపట్టింది. దమ్మొస్తుంది. ఆయాసంతో బక్కన్న అసపోస్తున్నాడు. అయినా లెక్కచేయకుండా ఒకే తీరుగా పరుగెత్తుతున్నాడు. పరుగెత్తే వేగంతో పాటు బక్కన్న గుండె కూడా వేగంగా కొట్టుకుంటుంది. ఒకటే ఆయాసం, ఎగశ్వాస. ఒళ్లంతా చెమటతో ముద్దయిపోయింది. భూమికోసం పరుగు, భూమి

పోకుండా ఉండడం కోసం, భూమికి బదులు నిలువెత్తు ధనమిచ్చినా అది భూమికి సరిరాదనుకునే మనిషి పరుగు అది. అతను భూమి కోసం ఎంతటి పోరా టాన్నయినా చేయగల, ఎంతటి కష్టా న్నైనా ఓర్చుకోగల మనిషి పరుగు అది. భూమితో పోరి పచ్చదనాన్ని గెల్చుకునే మనిషి పరుగు అది. చివరకు బక్కన్న డాగ్ బంగ్లా చేరుకున్నాడు.

అప్పటికే అక్కడ అందరూ బక్కన్న కోసం ఎదురుచూస్తున్నారు. తాసీల్దారు గారు జీడిపప్పును ఒక్కొక్కటే నోట్లో వేసు కుంటూ మందు కొడుతున్నాడు. మిగతా వాళ్లు వినయంగా, నిలబడేవాళ్లు నిలబడి, కూర్చోగలిగిన వాళ్లు కూర్చొని ఉన్నారు. బక్కన్న కొడుకులు కూడా అక్కడే ఓ పక్కగా నిలబడి పచ్చనోట్లు లెక్క పెట్టుకుం టున్నారు. వాళ్లు ఎప్పుడు ఎలా ఎందుకు వచ్చారో బక్కన్నకు అర్థం కాలేదు. బక్కన్న కొడుకులు భూమి యిచ్చేయడం మాకు సమ్మతమేనని, సంతకం చేశారు. ఇక మిగిలింది బక్కన్న వేలిముద్ర మాత్రమే. బక్కన్న రావడంతోనే ఇద్దరు కొడుకులు చెరోవైపు రెక్కలు విరిచి పట్టు కున్నారు. పట్వారి బక్కన్న కుడిచేయి బొటన వేలును దొరకబుచ్చుకున్నాడు. కొత్వాలు నారాయణ తన కలం సిరాను బక్కన్న వేలికి పులిమాడు. గింజుకుం టున్న బక్కన్నను పటేలు, గిర్దావర్, పేష్కార్ అందరూ కదలకుండా పట్టుకు న్నారు. చూస్తుండానే బక్కన్న సంతకం కాగితంపై పడిపోయింది. అందరూ బక్క న్నను కదలకుండా పట్టుకున్నారు గాని, బక్కన్న నోరు మాత్రం తెరిచే ఉంది. బక్కన్న అరుస్తున్నాడు. "నేను భూమి యియ్య, నేను భూమి యియ్య, భూమి లేకుండా నేను బతుకుడెట్ల. భూమి నాది. నేను భూమి యియ్య" అంటూ గట్టిగా అరుస్తున్నాడు. మంచంలో గుంజుకుంటు న్నాడు. కాళ్లు చేతులు కొట్టుకుంటున్నాడు.

"ఏందయ్యా? ఏమైంది? ఏందయ్యా? ఏమైంది? " అంటూ భూదేవి గట్టిగా కుద పసాగింది. బక్కన్నకు ఒకసారి మెలకువొ చ్చింది. చుట్టూ ఎవరూ లేరు. రాక్షసు ల్లాంటి మనుషులెవరు కనిపించలేదు. భూదేవి ఉంది. ప్రేమగా చేయి పట్టుకొని "ఏమయిందయ్యా అట్లా గుంజుకుంటువి. భూమియ్య, భూమియ్య అని అరవ వడ్తివి. కల గన్నవా ఏంది? " అంటూ ప్రేమగా, అనునయంగా అడిగింది.

"అవునే కలవడింది. భూమి వోయి నట్లు, నేను బిచ్చగాన్ని అయినట్లు కలవ డింది" అంటూ యింకా నమ్మకం కలగక బొటనవేలు చూసుకున్నాడు. సిరా మరక లేదు. శుభ్రంగా ఉంది.

భూదేవి కొంగుతో బక్కన్న ముఖానికి పట్టిన చెమట తుడిచింది. ఇత్తడి చెంబుతో నీళ్లిచ్చింది. నీళ్లు తాగి బక్కన్న కొంచెం తెరిపిన పడ్డాడు. 'కలనేగాని ఎంత ఖతర్నాక కలది' అనుకున్నాడు బక్కన్న




మరునాడు తెల్లవారి బక్కన్న వెళ్లి పట్వారిని కలిసాడు. పట్వారి బక్కన్నను చూడగానే ముఖం యింత చేసుకొని "రా బక్కన్న రా, యిప్పుడే నీ గురించి అను కుంటున్న. నీకు మతలబ్ ఎట్ల పంపుడా అని, గంతట్లకే నువ్వే అస్తివి. నీకు నిండా



నూరేండ్ల ఆయుష్షనుకో" అంటూ ప్రసన్నంగా కనిపించాడు. 'తాను లేసిన ఘడియ మంచిది, లేసి ఎవరి మొహం చూసిండో యియ్యాల. లేకుంటే పట్వారీ సాబ్ యింత యిదిగా మాట్లాడుడేంది' అనుకున్నాడు బక్కన్న.

"చూడు బక్కన్నా.. తాసీల్ దార్ సాబ్ ని, యింకా కింద ఉన్నోల్లని కలిసిన. అంతా కలిసి ఒక మతలబు చెప్పిండ్లు. బక్కన్న భూమి తోటకింద గింత జమాబందీల ఉంటే ఎవల్లూ తీసుకోరట. కాని నీది తోట కాదాయె. మరి జమాబందీల అది కాస్తు చేస్తున్న భూమి అనే రాసి ఉందాయే. ఇగ ఎట్ల జేసుడు- చెప్పు" అంటూ తిరకాసు పెట్టాడు.

"మీలే ఏదన్న ఉపాయం జెప్పాల. పిల్లా జెల్లా ఉన్నోన్ని. సర్కారు భూమి తీసుకుం టదంటే అందరికీ తెలిసిందే. ఎంత పైస అస్తదో, మల్లా మిగిలిందానికి కోర్టు కచే రీలు తిరగాల. నాకు ఆ పైస పట్టది. పాడు వట్టది. నాకు నా భూమే గావాలి. ఆ నా భూమి ఎటు వోవద్దు. అది మా తాతలనాటి భూమి. అన్న సచ్చి వదిన పొంట సగం భూమి పోతే ఎన్ని తిప్పలు పడి మల్లా ఆ భూమిని యింకోల్ల చెర నుంచి తప్పించిన్నో మీకెరకనే గదా. ఎట్లన్న జేసి మీరే ఎదయిన ఉపాయం జెప్పి పుణ్ణెం గట్టుకోండి" అంటూ చేతులెత్తి దండం పెట్టాడు బక్కన్న.

"నిన్ను చూస్తే నాకే దయపుడతాంది. ఎట్ల జేసుడా అని ఒకటే సోచాంచుతున్నా. దాన్ని తోట కింద రాద్దామంటే అది తోట కాదాయే. ఎక్కడ ఒక్క చెట్టు కూడా లేకుండా మొత్తం మైదానం జేస్తివాయే. ఇగ ఎట్ల జేసుడు" అని నిజంగానే ఆలో చించసాగాడు పట్వారి.

"తోటంటే ఏం చెట్లుండాల. ఎంతెత్తు ఉండాల. ఎన్నెండ్లు చెట్లుండాల" అంటూ ఆరాలు తీయసాగాడు బక్కన్న.

"తోటంటే ఏదన్న గావచ్చు మామిడి తోట, నిమ్మతోట, సంత్రా చెట్ల తోట, జామతోట ఏదన్న గాని ఉండాల"

"మీలు ఒప్పుకుంటే నేను నా చేను మొత్తం మామిడి తోట చేస్త, చేనంతా మామిడి చెట్లు నాటుత. మీ పహానీల గట్లనే రాయుండ్లి. గరీబోన్ని బతికి పోత. గింత పనిజేసి పెట్టుండ్లి. నేను ఎవల్ల సొమ్ము అడుగుతలేను. నా సొమ్ము నా తాన ఉండేందుకు మీ చేతనైంది చేయ మంటున్న. యీ గరీబోని కష్టం, సుఖం కొంచం సోంచాయించుండ్లి"

"రెండు రోజుల్ల పెద్దొర ఆర్.డి.వో సాబ్ అస్తుండు. ఆయన ఖుద్ చేను చూస్తడు. నేనే తోట అని రాసినంక ఆడ ఆయనచ్చినపుడు అది కాస్తు భూమి కన్పిస్తే నా తోలు తీస్తరు ఆల్లు"

"మీ మాట పోగొట్ట రెండంటె రెండు రోజుల్ల ఆ భూమిని నేను పెద్ద దొరకు మామిడి తోట చేసి చూపిస్త. నా మాట నమ్ముండ్లి. ఎట్లన్న జేస్త నేను. ముందు మీ పహానీల రాసి ఆల్లకు అది తోట అని జెప్పుండ్లి. రెండ్రోజులయినంక ఖుద్ ఆళ్లను ఎంటవెట్టుకొని రండి. మీలే జూస్త రుగద. బక్కన్న మాట అంటే ఎట్ల నిలవె టుకుంటడో" అంటూ బతిమాలాడు బక్కన్న.

"ఒక్క ఆర్.డి.వో సాబ్ కు తప్ప అంద రికీ ఎరుకున్న మాట. అది కాస్తు భూమి అని. యిప్పుడు యకాయెకి తోట అయి పోతే ఆల్లు నమ్మేతందుకు పిసోల్లెంగారు. అందుకుని సమజాయించవడ్తది. అందుకు జర కర్సయితది మరి. నువ్వు పైసలియ్యా కుండ కూడ నేను పహానీల రాస్త. కాని ఆల్లు అట్ల అనుకోరు. నువ్వు పైసలిస్తే అన్ని నేనే మింగిన అనుకుంటరు. అట్లా అని మనుషుల పెట్టుకున్నా నేను

చేసింది- నువ్వు చేసింది అంతా గంగల పోసినట్టయితది. అందుకని నీ మంచి కోరి చెపుతున్న. ఒక ఐదు నూర్లు యిట్లా పడేయ్. ఎవల్లది ఆల్లకు పడేస్త. నువ్వు అటు తోటపని చూడు" అంటు అసలు సంగతి చెప్పాడు.

పైస లేనిదే ఏ పని కాదని బక్కన్నకు తెలుసు. అందుకనే ఉట్టి చేతులతో రాకుండా సరిగ్గా ఐదు వందలు వెంట తెచ్చాడు. బనీను లోపలి జేబులో భద్రంగా దాచుకున్న డబ్బులు తీసి పట్వారీకి యిచ్చాడు బక్కన్న. పట్వారి డబ్బు లెక్క చూసుకొని "ఇగ నువ్వు పోయి నీ పనిలో ఉండు. రెండు రోజులనయినంక ఆర్.డి.వో. సాబ్ మేమంతా అస్తం. అన్నట్టు గీకాగితం మీద ఒక నిషాని ఎయ్యి. నాది కాస్తు జమీన్ కాదు- తోట అందుకని నా భూమి నాకే ఉంచుండ్లని ఒక దరఖాస్తు నీ పేర్న నేను ఆఫీస్ల యిచ్చుకుంట" అని ఒక తెల్లకాగితంపై బక్కన్న నిషానీ తీసుకున్నాడు.

బక్కన్నకు ఒక ఫికర్ పోయింది. ఇంకొక ఫికర్ పట్టుకుంది. అది చేను నిండా మామిడి చెట్లు నాటాల ఎట్ల అని. అప్పటికి మిరుగు కార్తె మొదలయి వారం రోజులయింది. కాని యింకా వర్షాలు పడ లేదు. భూమి చొక్కంచేసి ఉన్నది. ఇదే తాకీదు మంచి నిలువు పంటలపుడు వస్తే ఏంజేసి ఉందునో అని ఒకటికి పదిసార్లు అనుకున్నాడు బక్కన్న.

బక్కన్న యింటికెల్లి జరిగిన విషయమంతా భార్య భూదేవికి వివరించాడు.

"రొండు దినాల్ల యిరవై ఎకరాల భూమిల మామిడి తోట ఎట్లా చేసి చూపిస్తవ్. నీకేమన్న పిస పట్టిందా ఏమది?" అంది.

భూమి పోకుండ ఏమన్న ఇక్మత్ చెప్పమన్న. ఆ పట్వారి దొర కానూన్ తెలిసినోడు కాబట్టి ఒక ఉపాయం జెప్పిండు.

## బురిడీ

**ఓ** రాత్రి హైవేలో ఎదురెదురుగా వస్తున్న రెండు కార్లు గుద్దుకున్నాయి. ఆ కార్లలో ఓ డాక్టరు, ఓ లాయరు ప్రయాణిస్తున్నారు. డాక్టరు వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఉప్పందించాడు. వారు ఇరవై నిమిషాల్లో వస్తామన్నారు. కిందకు దిగిన ఇద్దరూ తమ తమ కార్లను చూసుకున్నారు. డాక్టరు లాయరుతో స్నేహపూర్వకంగా మాట్లాడుతూ తన కారులోనుంచి బ్రాందీ తీసిచ్చాడు. లాయరు కొంచెం పుచ్చుకుని 'మీరు కూడా తాగండి' అన్నాడు. పోలీసులు వచ్చి రిపోర్ట్ రాసాక తాగుతానని చెప్పాడు డాక్టర్ తెలివిగా.



చేసుకుంటే మన భూమి మనకుంటది, కాదంటే సర్కారోల్లు తీసుకొని ఎవల్లకో యిండ్ల పట్టాల కింద పంచి పెడ్తరు. అచ్చిన పైస ఎన్నాండ్లని ఉంటది. భూమి ఉంటది. భూమి యిలువ తెలిసే యిట్ల మాట్లాడవడ్తివేందే"

"అదిగాదే... మామిడి చెట్లంటే మాటలా... ఒక్కొక్క చెట్టు ఎంత లేదన్నా ఐదు రూపాలుంటది. అసుంటియి ఎన్ని చెట్లయితే మన భూమి నిండుతది. అన్ని చెట్లు ఎట్ల కొంటం. మన దగ్గర అంత పైస ఏది. మన కిస్మత్ ఖరాబుగున్నపుడు ఎన్ని జేస్తే ఏంది. చెట్లకు యిప్పుడు అంతపైస ఏడికెల్లి తెస్తవ్" అంటూ విచారించసాగింది భూదేవి.

"పిసదాన చెట్ల కొరకు రంది జెయ్యకు. చెట్లు మస్తుగ దొర్కుతయి. మల్ల



పుక్యానికే దొర్కుతయి. ముందు ఆ పట్వారి దొర చెప్పినట్లు గుంటలు తియ్యని. ఆనక చెట్లు పెడ్దాం. అంటూ పికాసో, పార తీసుకొని చేలోకి బయలుదే రాడు బక్కన్న.

"నువ్ నడు. నీ యెనకనే నేనస్త యింత సద్ది గట్టుకొని" అంది భూదేవి. మళ్లీ ఏం గుర్తొంచ్చిందో "అవునయ్యా మామిడి చెట్లు పుక్యానికి ఎట్లస్తయో జర కులాసగ జెప్పుగద" అంది అనుమానంగా.

"ఏమున్నదే... మనమేమన్న ఆ పెట్టిన చెట్లను ఆ జన్మం పెంచుతమా ఏంది. నాలుగు దినాలు ఆ పెద్దొర చూసి పోయిండంటే మల్ల మన ఎప్పటి కాస్తు ఎట్లదట్లనే ఉంటది. ఇక చెట్ల సంగతి యినుకో, నిరుడు మనం తిని పారేసిన మామిడి బుర్రలు మన ఊరి పెంటల మీద మస్తుగ మొలిసి యింతెత్తయి ఉన్నయి. ఆటిని అనామతుగ తెచ్చి భూమిల పెట్టుడే ఇక. పెంటలమీది చెట్లు గద ఒక్కొక్క చెట్టు నా నిలివిడేసి ఉన్నాయి. ఇప్పుడు సమజయింద, కులా సగ దెలిసింద చెట్లెట్ల అస్తయో" అంటూ బక్కన్న హుషారుగా చెప్పుకొచ్చాడు.

"గింత తెల్వి నీకెట్లా అచ్చిందయ్యా, ఆ పట్వారే యీ యిక్మత్ చెప్పిండా ఏంది. ఎంతన్న ఐదు నూర్లు లెక్క వెట్టుకుండు గదా" అని నిష్టూరంగా అంది భూదేవి.

"యిండ్ల ఆ పట్వారి ఏం తప్పులేదే భూమి మీది మమకారం ప్రేమ నన్ను యివన్నీ చెయ్యమంటున్నాయి. మొన్న కల పడ్డప్పుడు తెలిసిందే. నాకు భూమంటే ఎంత మమకారమో. అందుకే యీ తిప్పలన్నీ. నేను నడుస్త. నువ్వు జప్పున రా. చెయ్యికి చెయ్యి ఆసరైతే పని జప్పునయితది" అంటూ చేనువైపు దారి తీసాడు బక్కన్న.

బక్కన్న చెట్లకోసం గుంటలు తవ్వుతు న్నాడు. పారతో మట్టితీసి పక్కనేస్తు న్నాడు. ఆగకుండా ఒక్కో గుంట తవ్వు కుంటూ పోతున్నాడు. ఒకటా రెండా పూర్తిగా యిరవై ఎకరాల నేలలో కొన్ని వందల గుంటలు చేయాలి. తినివచ్చింది అరిగిపోయింది. అయినా బక్కన్న అలుపె రగకుండా తవ్వుతున్నాడు. ఒక గుంట తర్వాత యింకో గుంట. నిజంగానే మామిడి చెట్టు పెట్టాలంటే మూడడుగుల లోతు, మూడడుగుల వెడల్పు, మూడడు గుల పొడవులో గుంట తవ్వాలి. కాని బక్కన్న పెట్టె చెట్లకు ఒక అడుగు లోతు, ఒక అడుగు పొడవు, ఒక అడుగు వెడల్పు సరిపోతుంది. చెట్టు- చెట్టుకు నడుమ పది మీటర్ల ఎడం ఉండేట్టు గుంటలు తీస్తు న్నాడు. ఒకవైపు పికాసోతో తవ్వుతూనే ఆలోచిస్తున్నాడు. ఈ సర్కారుకు ఇదేం బుద్ధి. మంచిగా పంటలు పండే భూమిని తీస్కాని ఇండ్లు కట్టుకొమ్మని ఈయడ మేంది. పంటలు పండే భూమిని సర్కా రేంది, భూమిగల ఆసాములేంది, పైసకు అమ్ముకునుడేంది. పంటలు పండే భూమిని ప్లాట్లు చేసి అమ్ముకుంటుండ్లు. పడిత్‌గున్న భూమిల యిల్లు కడ్తేమానే కాని పంటలు పండే భూమిని జబర్దస్తిగ పంటలకు దూరం చేసుడేంది. భూమ్మీద అంతా ఇండ్లే కట్టుకుంటే ఉండనీకి ఇల్లాయే మరి తిననీకి బువ్వెక్కడికెల్లి అస్తది. అని ఎవల్లు సోచాంచరా ఏంది. చెరువు కిందా పొలాలన్నీ బందువెట్టి అండ్లా, ఇండ్లు కట్టవట్టిరి. ఇండ్లు కాదంటే మిషన్లు వెట్టుడు. దేశంల ఏ మిషన్ నడి పినా అది పల్లెలు పండించె పంటతోనే నడవాల గాని పల్లెలన్నీ ఇండ్ల ప్లాట్లయి, మిషన్లు నడిచే కార్ఖానాలైతే మరి పంటలె వడు పండిస్తరు. ఎక్కడ పండిస్తరు అని ఆలోచిస్తూ ఒక్కో గుంటను తవ్వుతు న్నాడు బక్కన్న.

# సర్ప వీరుడు




అమెరికాలోని టెక్సాస్‌లో రాటిల్ స్నేక్స్ చాలా ఎక్కువ. ప్రమాదకరమైన ఈ పాములను ఆగస్టు, సెప్టెంబరులలో ప్రజలు పట్టుకోవడం 1950లో మొదలైంది. కొందరు కౌబాయ్ షోమన్ వీటిని పట్టుకుని తమ ఊరికి తెచ్చి, వీటికోసం ప్రత్యేకంగా నిర్మించిన పుట్టలో ఉంచుతారు. వాటిని చేత్తో పట్టుకునే పోటీని నిర్వహిస్తారు. అతి పొడుగైన, లావైన పాములను, లేదా ఎక్కువ పాములను పట్టుకున్నవారికి బహుమతులుంటాయి. వీళ్లకి స్నేక్ హంటర్స్ అన్న పేరొచ్చింది.

ఈ వాతావరణంలో 1951లో టెక్సాస్‌లోని ఫోర్ట్‌వర్త్‌లో పుట్టిన జాకీ బిబ్బీ ఈ పోటీలో చిన్నప్పటినుంచి ఉత్సాహంగా పాల్గొనసాగాడు. క్రమేపీ ఇతనిలోని ప్రదర్శనాభిలాష ఎంతగా పెరిగిందంటే వాటితో అనూహ్యమైన విన్యాసాలను చేయసాగాడు. పది పాములని 17.11 క్షణాల్లో ఓ సంచిలో నింపిన ఘనతతోపాటు, 109 రాటిల్ స్నేక్స్‌తో నింపిన స్లీపింగ్ బ్యాగ్‌లో పడుకుని, పది రాటిల్ స్నేక్స్ తోకలని నోటితో పట్టుకుని అతను గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లోకి ఎక్కేడు. అనేకసార్లు టీవీ కెమెరాల ముందు ఇతను పాములతో ఒళ్లు గగుర్పొడిచే ప్రదర్శనలు ఇచ్చాడు.

ఇటీవలే టెక్సాస్‌లోని డబ్లిన్‌లో స్వచ్ఛమైన నీళ్లులేని స్నానాల తొట్టిలో 84 రాటిల్ స్నేక్స్ మధ్య 45 నిముషాలు కూర్చుని, తన పాత రికార్డుని తనే బద్దలుకొట్టాడు. అంతకుముందు స్నానాలతొట్టిలో 12 పాముల మధ్య కూర్చొన్నాడు. ఇతని కాళ్ల మధ్య, చేతుల మధ్య పాకిన ఆపాముల్లో ఒక్కటీఇతన్ని కరవలేదు -

"ఆకస్మిక కదలికలు పాములని భయపెడతాయి. మృదువుగా, నెమ్మదిగా కదిలితే అవి భయపడవు. నన్ను ఒక్కటీ కరవకపోవడంలోని రహస్యం ఇదే" అని చెప్పాడు జాకీ.

అతడు ఏ ఒక్క పాముకీ కోరలు తీయలేదు. మామూలు దుస్తుల్లోనే ఎలాంటి రక్షణ లేకుండా బాత్‌టబ్‌లో కూర్చున్నాడు. అనేక టీవీ కార్యక్రమాలు, సినిమాల్లో కూడా చాలా విన్యాసాలు చేశాడు. సెన్స్‌లెస్ ఏక్ట్స్, బర్టన్ బులియన్ షో, యూ ఆస్క్‌డ్ ఫర్ ఇట్, ఆస్టిన్ స్టోరీస్, వాక్ ఆఫ్ టెక్సాస్ రేంజెస్‌లాంటి టీవీ షోల్లో కనబడటమేకాక స్టేజీమీద కూడా రాటిల్ స్నేక్స్‌తో చాలా ప్రదర్శనలు ఇచ్చాడు. యాభై ఏడేళ్ల ఇతనికి మైఖేల్, మాథ్యూ అనే ఇద్దరు కొడుకులు.

రాటిల్ స్నేక్స్‌లో యాభై రకాలున్నాయి. ఈ జాతి పాము తోకకి రేటిల్స్(గిలక్కాయలు) మొలుస్తుంటాయి. దళసరి పొడి చర్మంతో



తయారయ్యే ఈ గిలక్కాయలు తోక కదిల్చినప్పుడు చప్పుడు చేస్తాయి. తాచుపాము బుసతో భయపెట్టినట్లే ఇవి రాటిల్స్‌తో భయపెడతాయి. ఈ పాము కుబుసం విడిచినప్పుడల్లా ఓ గిలక్కాయ మొలుస్తుంటుంది. అది తడిస్తే శబ్దం రాదు. పొడిగా ఉన్నప్పుడే శబ్దం వస్తుంది.

'ది టెక్సాస్ స్నేక్ మేన్' అని పిలిచే జాకీ బిబ్బీని ఎందుకలా ప్రమాదకరమైన విన్యాసాలను పాములతో చేస్తున్నారు అని అడిగితే, అతను చెప్పిన సమాధానమిది- "తరచూ టీవీ తెరమీద కనపడటం నాకు ఇష్టం. న్యూయార్క్‌లో నేను నడిచి వెళ్తుంటే అనేకమంది నన్ను గుర్తుపడతారు. అంతేకానీ వాటివల్ల చావడం నా అభిమతం కాదు."



దూరంగా భూదేవి సద్దిగుల్ల నెత్తిన పెట్టుకొని సొరకాయ బుంగల నీళ్లు పట్టుకొని వస్తూ కనిపించింది బక్కన్నకు. భూదేవి వెంట ఇద్దరు కొడుకులు ఉన్నారు. నేడు శనివారం, ఆదివారం ఉండిపోతారు. పోతూ పోతూ వారం రోజుల గాసం తీసుకొని పోతారు. చదువు సగంలోనే చంకనెక్కింది. బస్తీలోనే ఏదో కాలక్షేపం.

పిల్లలు, భూదేవి రావడంతో బక్కన్న కాసేపు గుంటలు తవ్వేపని ఆపి కూర్చున్నాడు. భూదేవి చేతిలోని బుంగను అందుకొని నీళ్ళు గటగట తాగాడు.

“గిదేం పని వెట్టుకున్నవ్, అవ్వ అంతా జెప్పింది. సర్కార్ భూమి అడిగితే ఇచ్చేయకపోయినవ్. మంది కోరి మా భూమి తీసుకో మా భూమి తీసుకో అని అంటుంటే నువ్వేందే గిట్ల చెయ్యవడ్తివి” అన్నాడు పెద్ద కొడుకు రమేశు.

“భూమి అమ్మేసి, పైసలు మీకిచ్చి మేమిద్దరం ఇంటింటికి చిప్ప పట్టుకొని అడుక్కతినమంటవా? భూమి ఉన్నోనికి పుట్టినవ్. ఉన్న భూమిని యిడిసి పెట్టి ఆ కాని ఊల్లె మందికి గులాంగిరి జేస్తున్నవ్ చాలదా, నీ కష్టమౌతది అయ్య, నువ్వు అట్ల గూసో.. నేను అరకకడ్త. భూమి చేస్త అని ఒక్కనాడన్న అంటివా? సదువుకుంటే యింత తెల్విడికస్తదని నిన్ను తినీ తినక పట్నం పంపితే సదువు యిడిసిపెట్టి -తిరగవడ్తివి. ఇదేనా బిడ్డ అయ్య అవ్వకు ఇత్కారం జూపే పద్ధతి” అన్నాడు బక్కన్న ఒకింత ఆవేశంతో. కొడుకేం మాట్లాడ లేదు.

“ఇగవోని ఆడేదో అనె దానికంతపొడు సదవాల్నా ఏంది. చెయ్యాలని అని కడుపుల ఉండాల. మనం జెప్తై అస్తదా. అచ్చినప్పట్నించి మాలెస గుంటలె తవ్వినవ్. జరసేపు ఇట్ల కూసో, ఇంత బువ్వ తిను, మళ్ల జేస్తువుగాని” అంటూ సద్ది మొగడికిచ్చి తమ పికాస అందుకుంది.

భూదేవి గుంటలు తవ్వుతోంది. కాని కొడుకు రమేశు ‘లే అవ్వ అది యిట్ట యియ్యి నేను తవ్వుత నాలుగు గుంటలు’ అని అనలేదు. మగడి ఒంటి చేతి కష్టం చూడలేక భూదేవి అన్నింటిలో చేయి వేస్తుంది. పనిచేస్తున్నపుడు అది ఆడపనా, మగపనా అని కూడ చూడదు. తాను మగనికి సహాయపడుతున్న అనుకుంటుంది. అంతే. భూదేవి అండ లేకుంటే బక్కన్న ఒక్కడ్తో యిరవై ఎకరాలు ఒంటిగా సాగయ్యేది కాదు. కాసేపటికి బక్కన్న కూడా లేచి గుంటలు తవ్వసాగాడు. కాసేపటికి భూదేవి, బక్కన్న ఇద్దరు అలిసిపోయారు. ఆ చెమటతో శరీరాలకు చల్లగా ఉంది. ఇద్దరు కాసేపు విశ్రాంతి కన్నట్టు కూర్చున్నారు. కొడుకు రమేశు దూరమీద గడ్డిల కూర్చొని యెంట తెచ్చుకున్న సినిమా పత్రికలో బొమ్మలు తిరగేస్తున్నడు.

“నీకు గీ భూమ్మీద గింత కావురం ఎట్లేర్పడిందే. ఎంతమంది కాపోల్లు లేరు, కాని నీ అంత పిస ఎవల్లకుండదు గీ భూమ్మీద” అంది భూదేవి.

“పిసదాన భూమంటే ఏందనుకున్నవ్. ఈ గాలి, నీళ్లు మన సంతం కాదు. ఈ భూమి మన సంతం. ఇంత పెద్ద భూమి మీద ఏది సొంతం అని చెప్పజాలం- ఒక్క భూమి తప్ప. మనిషికున్న పైస ఎల్లకాల ముండది. మనిషి తిని పెంచుకున్న కండ ఎల్లకాలం ఉండది. కట్టుకున్నది- కన్నోల్లూ ఉండరు. మనిషికి ఎంత బుద్ధి గ్యానం ఉన్నా అది కూడా ముసలితనంల మతికి రావు. ఎవలూ దొంగతనం చేయరాంది గీ భూమి ఒక్కటేనే”

“గీ భూమితోనే మనిషి బతుకు. కట్టె తంతుకు బట్ట, తినటందుకు యింత తిండి,

అంతో యింత పైస గీ భూమితోనే రావట్టే. ఈ భూమి తల్లిని మించింది యింకోటేముంటదే" అంటు ఎంతో తాదాత్మ్యంగా చెప్పుకుపోతున్నాడు బక్కన్న. ఆ మట్టిమనిషి మాటలు భూదేవికి అర్ధమవుతున్నాయి కాని దూరంగ కూర్చున్న కొడుకు చెవి సోకడంలేదు. ఆ కొడుకు సినిమా పత్రిక పేజీలు తిరగేస్తు తారల మధ్య విహరిస్తున్నాడు.

"లే మాటల్ల పడ్తే పని అయితదా" అంటూ లేచాడు.

"నేను యింటికి వోతున్న అవ్వ" అని చెప్పి ఇంటికెళ్లిపోయాడు రమేశు.

పొద్దుగుంకేవరకు భూదేవి, బక్కన్న యెంట ఉండి, పొద్దు గుంకినంక "జల్దియింటికిరా చనా నాతిరి చేసుకోకు. పని మీద పడ్తే నీకు నీ సోయే ఉండది. మరి నేనెల్తా" అంటూ ఖాళీ సద్ది గిన్నె బుంగ తీసుకొని పోయింది. బక్కన్న తాగడానికి తోలు తిత్తిల నీళ్లున్నాయి. తోలు తిత్తి బాదలా చెట్టుకు వేలాడగట్టి ఉంది.

ఆకాశంలో అటు సూర్యుడు అస్తమించాడు. ఇటు చంద్రుడు నిండుకుండలా చల్లగా ఉదయించాడు. వెన్నెల రోజులు ఆ రోజు పున్నమి. వాతావరణం చల్లగా ఉంది. బక్కన్న అలుపెరుగని యంత్రం లాగా పనిచేస్తూనే ఉన్నాడు. రేపు తెల్లవారేవరకు గుంతలు తవ్వుడైపోతే ఆనక చెట్టు పెట్టచ్చు అనుకున్నాడు. చేస్తున్న పనిలో లోపం అయితే మొదటికే మోసం వస్తుందని బక్కన్న భయం. తోట తోట తీరంగనే ఉండాల. అయినా ఎంత, రెండు రోజుల రెక్కల కష్టమే కదా" అని యింకా పని చేస్తూనే ఉన్నాడు. మధ్యరాత్రి కావచ్చింది. ఇక తినకపోతే చెయ్యి ఆడదని గ్రహించి యింటి ముఖం పట్టాడు బక్కన్న. ఇంటికెల్లి యింత తిని మల్లా చేనువైపు కదిలాడు. అనుకున్నది రెక్కల కష్టంతో సాధించేదైతే దాన్ని బక్కన్న ఎట్టి పరిస్థితిలో వదిలిపెట్టడు. అది ఎంత కష్టమైనా ఓర్చుకుంటాడు. పట్టుదల అతడి ప్రాణం.

**కొత్తగాలి...**

**తియ్యనైన బొట్టేలేని**
**సంద్రమెంతైతేనేమి**
**నమ్రత కానరాని**
**జ్ఞానమెంత పెరిగితేనేమి**

**-సిరిసిల్లా గఫూర్ శిక్షక్, అర్గొండ**

చంద్రుడు బక్కన్న కన్న వేగంగా పరుగెడుతున్నాడు. బక్కన్న చంద్రుడితో పోటీ పడుతున్నాడు. తెలతెలవారుతుంటే మొత్తం గుంటలు తవ్వడం అయిపోయింది. మధ్యాహ్నానికల్లా బక్కన్న మామిడి మొక్కలను పెంట కుప్పల్లోంచి అనామతుగా పీక్కుంట తెచ్చి నాటసాగాడు. పొద్దు గుంకేవరకు చెట్టు నాటడం అయిపోయింది. నాటిన చెట్లు అక్కడొక్కడి ఇక్కడకటి వాడు పడసాగాయి. 'అయిన కష్టంల యింకొంత' అనుకొని ఎడ్ల బండికి పెద్ద డ్రమ్ము కట్టి వాగు నుండి నీళ్లు తెస్తుంటే భూదేవి పోస్తుంది. గంట సేపట్లో చెట్ల నిగనిగలాడుతూ లేచి నిలబడ్డాయి. ఆ రోజు రాత్రి బక్కన్న జీవితంలో మొదటిసారి నిద్రపోయిన వాడిలా గుర్రు పెట్టి నిద్రపోయాడు.

తెల్లవారి తాసీల్ ఆఫీసు జీబులు బక్కన్న యింటికి ముందొచ్చి ఆగాయి. 'ఆర్.డి.వోసాబు అస్తున్నడు నీవు నీ చేను తాట తయారుగుండు' అని చెప్పారు.

బక్కన్న, భూదేవి తమ చేలో వెళ్లి నిలబడ్డారు. చేను నిండా ఎటు చూసినా నడుంబంటి నిలువెత్తు మామిడి చెట్లే కనిపించసాగాయి.



ఆర్. డి. ఓ. సాబ్, తాసీల్ దారు గారు బక్కన్న చేనును దూరం నుంచే గమనించి వెనక్కి తిరిగి వెళ్లిపోయారు. అందరూ వెళ్లాక పట్వారి బక్కన్న దగ్గరకు వచ్చి "వారీ బక్కన్న రెండు రోజుల్ల కమాల్ జేస్తివిరా. అన్న మాట నిలబెట్టుకున్నవ్ నీ అంత భూమి పిసోన్ని నేను యింతదాంక జూడలే. సల్లంగుండురా" అంటూ వెళ్లిపోయాడు.

బక్కన్న గండం గడిచినందుకు సంతోషంగా పట్వారికి చేతులెత్తి దండం పెట్టాడు.




చలికాలం మంచి జోరు మీదుంది. రాత్రంతా ఒకటే చలి. వర్షం కురిసినట్లు మంచు. చేలలో పురుగులకు పండగలాగే ఉంది. ప్రతి పురుగు పంటతోపాటే ఏపుగా ఎదుగుతోంది.

పత్తి చేన్లు పూతకాతలతో నిండుగా ఉన్నాయి. జొన్న చేలు యింతింత కంకులతో గాలికి ఓలలాడుతున్నాయి. జొన్న చేను, పత్తి చేను చూసుకుంటున్న బక్కన్న మొహంలో ప్రసన్నత, తృప్తి స్పష్టంగా కనిపిస్తుంది. చేన్లో చేసే పని ఏమీ లేదని రెండు రోజులు చుట్టరికాలు చేయ బయలుదేరాడు.

విశ్వనాథం పత్తి పంటను ఎప్పుడో మానేశాడు. పత్తి పండించడం అంటే జూదమాడడమే అని అంటాడు అతడు. ఖరీదయిన విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులకు కలిపి బోలెడు ఖర్చు. పంటంతా వర్షాధారం. నేలలో విత్తు విత్తాక సకాలంలో వర్షం కురవకపోతే మొదటి తూరి పెట్టుబడి గంగపాలే. మళ్లా విత్తనాలు కొనాలి. పెరిగిన చెట్టుకు అడుగడుగునా చిత్రవిచిత్రమైన రోగాలు... వాటికి మళ్లా మందులు చల్లాలి. మందుల ఖరీదు ఒకదిక్కు, మందు చల్లడానికి పల్లెల్లో కూలీలు దొరకని స్థితి యింకో దిక్కు. దొరికినా రోజుకు నలభయి రూపాయలు. వాళ్లు పనికి వచ్చేది పది గంటలకు. మళ్లా మధ్యాహ్నం విశ్రాంతి ఒక గంట సేపు. సాయంకాలం ఐదు గంటలకే పనినుండి దిగుతారు. ఆ పని చేసేవాడికి ఆ పని నేడు అయిపోతే వాడికేం లాభం. పని రేపటికి మిగలాలి. అది ఆ కూలీ మనస్తత్వం. కూలీలను పెట్టి డబ్బులిచ్చినా ఎదగని పని, అందుకని విశ్వనాథం పత్తి లాంటి వాణిజ్య పంటకు దూరంగానే ఉంటున్నాడు. బక్కన్నలాంటి వాళ్లు, స్వంతంగా కష్టం చేసుకునేవాళ్లు యింకా పత్తి పంట మోజులో ఉన్నారు. పత్తిపంట దిగుబడి, ధర రైతును శలభాల్లా ఆకర్షిస్తాయి.

రెండు రోజులని పోయి నాలుగు రోజులు చుట్టాలింట్లో గడిపాడు బక్కన్న. ఉదయమే చేనుకు వెళ్లిన బక్కన్న పత్తి చెట్లను చూసి పరేషాన్ అయ్యాడు. ఒక్కో చెట్టు కింద ఇరవై ముప్పైకాయలు పూత పడివున్నాయి. నడుస్తుంటే గాలికి లేచిన బూడిదలాగా తెల్లదోమలు కదిలిపోతున్నాయి. రెండంటే రెండు రోజుల క్రితం ఎట్లా ఉండే చేను యివాళ ఎలా మారిపోయింది. బక్కన్న కళ్లలో నీళ్లు తిరిగాయి. యిప్పుడేం చేసుడు, కొట్టాల్సిన మందులన్నీ కొడ్తి. మల్ల యిప్పుడేం జెయ్యాల. కనిపిం



చని రోగమేదో పూతను-కాతను రాలగొ డ్తుంది. ఇప్పుడెట్ల అనుకుంటూ కనిపించిన వాళ్లకల్లా తన పరిస్థితి చెప్పుకున్నాడు. ఒకటా రెండా.. వేలకు వేలు అప్పుతెచ్చి పెట్టుబడి పెట్టె. ఇప్పుడు చూస్తే ఐదు పైసలు కూడా వచ్చేట్టు లేవు.

చూస్తుండగానే చెట్లు నిలువునా ఎండి పోతున్నాయి. ఏం రోగమో తెలియదు. నాలుగు రోజుల్లో చేను చేనంతా నిలు వునా ఎండుబారి పోయింది. అట్లా ఎందుకు జరిగిందో అతడికి అర్థం కావడం లేదు.

పసిపిల్లాడిలా తలకొట్టుకుంటూ ఏడుస్తు న్నాడు బక్కన్న. అప్పు ఎలా తీరుతుందనే దిగులు ఒకదిక్కు, వచ్చే ఏడు సేద్యం ఎట్లా చేయడం అనేది మరోదిక్కు. పోయి నేడు పత్తి పంట దిగుబడి, ధర చూసి ఈ యేడు చాలా మట్టుకు పత్తే వేసాడు బక్కన్న. పంటంతా పోవడంతో బక్కన్న పిచ్చివాడిలా అయిపోయాడు. రెండు రోజుల్లో ఏడాది నుంచి జబ్బు పడ్డ మని షిలా అయిపొయ్యాడు.

"నీ అవ్వ ఇప్పుడు తెలిసిందా భూమి చేసుడు, అప్పుడు సర్కార్ అడిగినప్పుడే యిచ్చి ఉంటే నేడీ తిప్పలు తప్పుతుండె గద. ఇమాఖత్ ఎక్కువ. నేనే వ్యవసాయ దారునని, నేను భూమి గలోణ్ణి అని పోకడ మాటలు జెప్తివి. ఏమున్నది యిప్పుడు అప్పు తప్ప" అంటూ తండ్రిని దులిపేసాడు పెద్దకొడుకు రమేశ్.

"ఈయన జేసే యీ ముండమోపి వ్యవ సాయంకు మనం తోడుంటలేమని మల్ల మాటలనుడు. ఎవడు జెయ్యుమన్నడు నిన్ను యీ యవసాయం. రోజులు మనయి కానప్పుడు అమ్ముకొని పైస జేసు కొని బయట పడ్తరు. తెల్విలేని పనులు జేసుడు. మల్ల మీదికెల్లి మమ్మల్ల బదనాం జేసుడు" అంటూ మండిపడ్డాడు చిన్నకొ డుకు అశోక్.

బక్కన్న ఏం జవాబు చెప్పాలో తోచక పిచ్చి చూపులు చూస్తున్నాడు. కాలం కొట్టిన ఒక పంజా దెబ్బకు తనెంత పనికి రానోడైపోయిండు. కొడుకులెంత ఎదిగిపో యిండ్లు అని చూస్తున్నడు.

"ఆయనేమన్న మనం చెడిపోవాల్నని చేసిండ యీ యవసాయం, ఇన్నేండ్లు సంపాదించిందంట్ల ఒక్కనాడన్న మంచి బట్టకట్టలే, మంచి తిండి తినలే. ఎట్లనో కష్టమో నష్టమో ఆ భూమిని సొంతం చేసుకుంటనే ఉంటిమి ఇద్దరం. ఇయ్యాల కాలం కలిసి రాకుంటే కానిపని జేసినట్టు మాట్లాడవత్తిరేందిరా" అంటూ కసిరింది భూదేవి.

"ఇక చేసిన యవసాయం సాలుగాని, బేరం జూసి ఎవల్లకన్న యిచ్చేయుండ్లి. మీరు కాదంటే బేరం మేమే తెస్తం" అంటూ వెళ్లిపోయాడు రమేశు. అతణ్ణి అనుసరించాడు చిన్నోడు అశోక్.

★ ★ ★

విశ్వనాథంగారింట్లో తీరిగ్గా కూర్చొని పేపరు చూస్తున్నారు. కాలం యింత మారినా ఏ రోజు పేపర్ ఆరోజుకు రాదు ఆ ఊరికి. ఒకరోజు ఆలస్యంగా పోస్టు ద్వారా వస్తుంది. ఒకరోజు ఆలస్యమైనా పేపరు చదవందే తోచదు ఆయనకు.

వాకిట్లో జొన్నలు రాసిగా పోసి ఉన్నాయి. జొన్న కోతకు వచ్చిన వాండ్లు 'కైకిలి' తీసుకుపోవడానికి వచ్చారు.

"ఒరే లచ్చన్న వీల్లకు అడ్డతో జొన్నలు కొలిచి పొయ్యరా" అంటూ పనివాళ్ల వివ రాల పుస్తకం అందుకొని ఎవరికెంత యివ్వాలో చూస్తున్నారు.

"మీ మాట కాదంటున్నందుకు మన్నిం చాలయ్యా. మాకు యీ జొన్నలొద్దయ్యా. ఈ యేడు కైకిలి కింద ఎవలూ జొన్నలు కొలిపించుకుంట లేరు. పైసలే తీసుకుంటు

న్నారు" అన్నాడొక కూలికి వచ్చినవాడు.

"ఏమయిందిరా జొన్నలు తినుడు మానేసిండ్లా ఏంది. జొన్నలెందుకు వద్దు. ఏ కోతకు పోతే ఆ పంట, ఏ పంట ఏరతందుకు పోతే ఆ పంట కైలికి కింద తీసుకుంటరు గదా! ఇయ్యాల్ల ఏమయ్యింది" అడిగాడు విశ్వనాథం.

"ఏం లేదు ఈసారి జొన్న పంట తడిసి జొన్నలు నల్ల వడ్డయిగద, అందుకని ఎవలూ జొన్నలు తీసుకుంటలేరు. గటకైన, రొట్టైనా నల్లగ, ఎర్రగ ఎట్లనో ఉంటాది. అందుకని పైసలే యిప్పించుండ్లి" అన్నాడు మరో కూలి.

విశ్వనాథం ఆశ్చర్యపోయాడు. రైతు తాను పండించిన పంటను తానే తినదలచుకోలేదు. రొట్టె, గటక, జొన్న సంకటి యివన్నీ యిప్పుడు మోటయిన తిండ్లు. వరి అన్నమే అందరికి యిష్టం- అదీ డబల్ పాలీషు బియ్యం.

"రోజుకు నలభై రూపాయల కూలిగట్టి యియ్యుండ్లి దొర" అన్నాడొకడు.

"అందరూ ఊల్లె అంతే యిస్తన్నరు" అన్నాడు యింకొకడు.

"అలాగే రేపు వచ్చి తీస్కుపొండి" అన్నాడు విశ్వనాథం.

మనుషుల్లో ఓపికలు కూడా నశించాయి. జొన్నలు పిండిజేసి, రొట్టెలు జేసి, నమిలి తినడం ఎంత శ్రమ. అన్నమైతే అలా అలా మింగేయచ్చు అనేది ఈ కాలం పద్ధతి అనుకున్నాడు విశ్వనాథం.

జానకి భోజనానికి లేవండని పిలవడంతో పేపరు పక్కన పడేసి, యింట్లోకి నడిచాడు విశ్వనాథం.

విశ్వనాథం పళ్లెంలో కొత్త జొన్నలతో చేసిన రొట్టె, వెన్నపూస ఉన్నాయి. రొట్టె కాస్త నలుపు ఎరుపు రంగు కలిసి ఉంది.

"నేడు మంచి రోజని మన కొత్త జొన్నలతో రొట్టె చేసాను" అంది జానకి.

విశ్వనాథం కొత్త జొన్నల రొట్టె అనడంతో మొదటి ముద్దను భక్తిగా కళ్లకద్దుకొని నోట్లో పెట్టుకుంటున్నాడు. అంతలోనే బయట బక్కన్న గొంతు వినిపించింది. నోట్లో ముద్ద పెట్టుకోకుండా అలాగే ఎంగిలి చెయ్యితో బయటకొచ్చి బక్కన్నను పలకరించాడు.

"రా బక్కన్న రా భోజనం టైంకు వచ్చినవ్. ఇలా వచ్చి కూర్చో" అంటూ లోపలికి రమ్మన్నాడు.

"మీరు భోంచెయ్యండయ్యా. నేను కూకుంట, మీరు కానీయండి" అంటూ వేళ కాని వేళ వచ్చినందుకు అతడి గొంతులో బిడియంతో కూడిన సిగ్గు ధ్వనించింది.

"దాందేముంది యిలారా కూర్చో జానకీ బక్కన్నకు కూడా వడ్డించు" అంటూ తను వెళ్లి పల్లెం ముందు కూర్చున్నాడు.

జానకి విస్తట్లో రెండు రొట్టెలు - యింత వెన్నపూస అదరవుకు ఊరగాయ పెట్టింది.

"కానియ్యి బక్కన్న. తీసుకో ముద్ద అంటూ విశ్వనాథం తన చేతిలోని ముద్దను అలాగే పట్టుకొని ఉన్నాడు. బక్కన్నకు అర్థమయ్యింది. అన్నం వేళకు వచ్చిన అతిథికి అన్నం పెట్టాలని, మొదట అతడు ముద్ద నోట్లో పెట్టుకున్నాకే ఇంటి యజమాని భోజనం ప్రారంభించాలని మన సంప్రదాయం. విశ్వనాథం అదే పాటించాడు.

అతిథి మర్యాదలందుకుంటున్న బక్కన్నకు ముద్ద మింగుడు పడడంలేదు. జరుగుతున్న మర్యాదకు, యిస్తున్న గౌరవానికే అతడి కడుపు నిండిపోయింది.

"కొత్త జొన్నల రొట్టె రుచిగా ఉన్నదా" అని జానకి అడుగుతుంటే, బక్కన్న కన్నీళ్లతో బాగుందని అన్నట్టు తల ఊపాడు.

ఇద్దరి భోజనాలయ్యాయి. బక్కన్న విస్తరి తీస్తుంటే జానకి వద్దని వారించి





"భోజనం పెట్టికన్న, ఎంగిలి కంచం తీయ డమే ఎక్కువ పున్నెం. ఉండనీ బక్కన్న మా యింట్ల తిని నీ ఇస్తారి నువ్వు తీసు కుంటే మాకు పున్నెం కన్న పాపమే ఎక్కువ చుట్టుకుంటుంది."

"అట్లా అనకు తల్లి, మీ కాల్ల దగ్గర బతి కెటోల్లం. అయ్యతో సమానంగా కూసో వెట్టి బువ్వ పెడ్తివి. నీ కడుపు సల్లగుండ నువ్ నడిచే దారి, నిలవడ్డ సోటు సల్ల గుండ" అంటూ చేతులు జోడించాడు.

"రా బక్కన్న, ఏంది యిట్లస్తివి? ఏమన్నా పనా" అడిగాడు విశ్వనాథం

"పుట్టెడు దుఃఖంతో అచ్చిన నీకాడికి. యీ యేడు నేను బర్బాద్ అయిపోయిన" అంటూ మొత్తం పత్తి పంట సంగతి చెప్పు కొచ్చాడు బక్కన్న.

"ఉన్న అప్పు జూపి యాల్ల వడ్తే ఆల్లని నామీద ఉసిగొల్పి - ఇటు భూమి అమ్మా లని జూస్తుండ్లు నా కొడుకులు. భూమి లేకుంటే నేను ఎట్ల బతుకుడు దొర, మీరే నాకు ఏదన్న దారి జూపాల" అంటూ విశ్వనాథం కాళ్లపై బడ్డాడు.

'లే బక్కన్న, నీ సంగతి నాకు తెల్వదా? ఎంత యిదయితే తప్ప నువ్వు యింకొల్ల గడప తొక్కవని నాకు తెల్వదా? ఇప్పు డేంది? ఆ బాకీ తీర్చాలి అంతేగదా డబ్బిస్త తీసుకెళ్లు. మల్ల పంట మీద ఆ బాకీ తీర్చు, అట్లనేన" అనగానే, బక్కన్న తన చెవులను తానే నమ్మలేకపోయాడు. కాని బక్కన్న ఎంతటి కష్టపోతో, భూమి మీద ఎంత మమకారం ఉన్నవాడో విశ్వ నాథంకు తెలుసు. అందుకే మనిషికి మనిషి ఆసరా. నిజంగా కష్టమొచ్చినపుడు ఆదుకునే వాడే మనిషి. బక్కన్నను ఆదు కొని విశ్వనాథం 'మనిషి' అనిపించుకు న్నాడు.

"ఆ పోయిన పత్తి పంటను తీసి అక్క డ సూరజ్ ముకీ గింజలు చల్లు నీ పెట్టు బడి కొంతలో కొంతయినా తిరిగి వస్తది" అని సూచించాడు విశ్వనాథం.

"అట్లనే దొర నువ్వు చెప్పినట్లే చేస్త, నీ ఋణం ఉంచుకోను, అట్లనే మీ మేలు నా జన్మల మరువ" అంటూ విశ్వనాథంకు కన్నీళ్లతో దండం పెట్టాడు బక్కన్న.

★ ★ ★

చలికాలం పొద్దు అప్పుడే చీకట్లు ముసు రుకుంటున్నాయి. గడియారంలో యింకా ఏడుగంటలు కాలేదు. అప్పుడే చీకటితో పాటు చలి కూడా చిక్కబడుతోంది. బక్కన్న ఇంటి వాకిట్లో గూటాలకు కట్టేసిన పశువుల ముందు పచ్చగడ్డి మోపులు విప్పి మేత వేస్తున్నాడు. భూదేవి నడివాకిట్లో రోజు వేసే నెగడుకు ప్రయత్నిస్తోంది. ఒక పెద్ద మొద్దులో యింకా నిప్పు మిగిలి వుంది. భూదేవి ఆ మొద్దును మధ్యలో ఉంచి చుట్టూ చిన్నాచితక కట్టెలు పేర్చి మంట చేసింది. అడవికి దగ్గర పల్లెలు. కట్టెల కొరత ఉండదు. చలికాలం రాత్రు లల్లో మంటల నెగళ్లు వేసుకొని చుట్టూ కూర్చుని పొద్దుపోయే వరకు కబుర్లు చెప్పుకోవటం పరిపాటి. శనివారం కావ డంతో బక్కన్న కొడుకులు యింత పొద్దునే పల్లెకొచ్చారు.

ఎర్రటి మంటలు యింతెత్తు లేసి చుట్టూ వాతావరణం వెచ్చగా అవడంతో అంత మట్టుకు యింట్లో చలికి నక్కి నక్కి కూర్చున్న పిల్లలు వచ్చి మంట ముందు కూర్చున్నారు.

బక్కన్న పశువుల గూటాల మధ్యనే అదొకటి యిదొకటి సవరిస్తూ ఉన్నాడు.

పశువుల మధ్య ఏదో సగబెడుతున్న భర్తను చూసి "తింతందుకు రారాదు. యింత పొద్దుకే సలి పెట్టవట్టే.. యాల్ల పొద్దున ఇంత తింటే వెచ్చగా పండచ్చు, నీక్కాడ అన్నం తెద్దునా యిక్కడికి"- అంటూ బక్కన్నను అడిగింది భూదేవి.

మళ్లా వెంటనే "రొట్టె తెద్దునా? గటక తేనా" అంటూ ప్రశ్నించింది.

"ఏదో ఒకటి తేరాదు, ఏదయితేనేంది. ఇది తింట అది తింట అని లేదుగద. రొట్టెనే తే" అన్నాడు.

భూదేవి అతడికి భోజనం వడ్డించుకు రాను లోపలికి వెళ్లింది.

అంతలో వాకిట్లో ఉండే కుక్క ఒకటే మొరగసాగింది.

కాసేపటికి వాకిట్లో ఒక మనిషి కనిపించాడు.

'ఎవరో ఊళ్లో కొత్త మనిషి కావచ్చు. లేకుంటే అట్లా ఎవర్ని చూసి మొరుగయి కుక్కలు' అనుకున్నాడు బక్కన్న. లేస్తున్న నెగడు మంటల్లో కనిపిస్తున్న మనిషి ఆ ఊరికి పూర్తిగా కొత్తవాడిలా అగుపించాడు బక్కన్నకు. కుక్కలు యింకా అరుస్తూనే ఉన్నాయి.

"ఎవలు మీరు? ఏ ఊరు మీది? ఎవలింటికి పోవాల? " అంటూ ఆరా తీశాడు బక్కన్న.

"నమస్కారం నా పేరు రామకృష్ణ. ఈ చుట్టుపక్కల పల్లెల పనిమీద తిరుగుతున్న" అంటూ రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ ముందుకొచ్చాడు ఆ కొత్త వ్యక్తి.

వచ్చిన మనిషిని బక్కన్న పలకరించడంతో కుక్కలు అరవడం మానేసి దూరంగా వెళ్లిపోయాడు.

వచ్చిన వ్యక్తి మొదట నమస్కారం అని సంభాషణ మొదలు పెట్టడంతో బక్కన్న ఒకింత ఆశ్చర్యపోయాడు. వచ్చిన ఆగంతకుని వేషానికి, అతడి భాషకు పొంతన లేకుండా ఉంది.

సన్నగా పొడుగ్గా ఉన్నాడా వ్యక్తి, చామన ఛాయే కాని ఎండ వానా చలిని లెక్కచేయని వాడవటంతో శరీరచ్ఛాయ తగ్గిపోయింది పలుచటి గడ్డం, భుజాలపైకి జారుతున్న జులపాలు, నుదిటి పై నుండి

# కొత్తగాలి... 

**పెళ్లికి ముందు**
**అంతా సాఫ్ట్‌వేర్**
**అయ్యాకే హార్డ్‌వేర్**
**రెండు హార్ట్‌లు వేర్వేర్**

–పెరుగు రామకృష్ణ, నెల్లూరు

తలకు కట్టిన తెల్లటి బట్టకట్టు. ఒక ముతక పంచెను అడ్డపంచగా చీల మండలపై కని కట్టి, ఒంటిపై ఒక పంచెను భుజాల చుట్టూ కప్పుకున్నాడు. శరీరంపై బనియను గాని, చొక్కా గాని ఏమీ లేవు.

అన్నింటికి మించి కాళ్లకు చెప్పుల్లేవు.

భుజానికి ఒక సంచి మాత్రం కిందికి వేలాడుతూ కనిపిస్తుంది.

బక్కన్న వచ్చిన ఆగంతకుణ్ణి చూసి, ఎవరో సాధువో, సంతో అనుకున్నాడు. కానీ మళ్లీ సాధువులైతే కాషాయం ఉంటుంది. ఈ రోజుల్లో సాధువులు కూడా యింత సామాన్యంగా సంస్కారంగా ఉండరు అనుకున్నాడు.

"మీరు సాధువులా? సంతులా? ఎవరు మీరు? అట్లా వచ్చిన వాళ్లంతా మా ఊళ్లె సవారి బంగ్లల రాత్రికి ఠికాన యేస్తరు. గిట్లపోతే అటుదిక్కుంటది" అని చెప్పాడు బక్కయ్య.

"నేను కొంచెంసేపు మీ మంట దగ్గర కూర్చోవచ్చా? " అని అడిగాడు మర్యాదగా వచ్చిన వ్యక్తి.

"అయ్యో అదేం భాగ్యం రండ్లి. ఇట్లా కూసుండుండ్లి" అని మళ్లీ,

"ఏ దేశం మీది, ఇటు దిక్కు ఎట్లా రాకడయ్యే" అడిగాడు బక్కన్న.

"నా పేరు రామకృష్ణ, ఈ దేశమే నాది ఒక పనిమీద పల్లెలన్ని తిరుగుతున్న"





## వినికిడి సమస్య

**వెం**కట్రావు తన భార్యకు ఇంతకు మునుపులా సరిగ్గా వినిపించడం లేదేమోనని అన్పించి డాక్టర్ మిత్రుడ్ని సలహా అడిగాడు. అతని సలహామేరకు ఒకరోజున భార్య వంటగదిలో ఉన్నప్పుడు 15 అడుగుల దూరంలో నిలబడి 'ఏమిటోయ్ ఈ రోజు ఏం కూర చేస్తున్నావ్?' అన్నాడు. ఆమె మాట్లాడలేదు. తర్వాత 10 అడుగుల దూరంలో నిలబడి అదే ప్రశ్నవేశాడు. అప్పటికీ లాభం లేకపోయింది. ఐదు అడుగుల దూరంలో నిలబడి మరోసారి అడిగాడు. మళ్లీ జవాబు రాకపోయేసరికి ఆమె వెనుక నిలబడి ప్రశ్నించాడు.

'అడిగిందే అడిగి ఎందుకండీ విసిగిస్తారు. కోడిమాంసం వండుతున్నానని ఇప్పటికే మూడు సార్లు చెప్పాను..' అందామె.



"మా పల్లెతో మీకేం పని వడే?" అడిగాడు బక్కన్న

"నేను పాతకాలం పంటల విత్తనాలను సేకరిస్తున్నా, మీ దగ్గర అలాంటి విత్తనాలు ఏమయినా ఉంటే ఒక పిడికెడు విత్తనాలు, లేకుంటే ఎన్ని ఉంటే అన్ని నాకు యివ్వండి. పాతకాలం విత్తనాలను జమచేయడమే ఒక పనిగా పెట్టుకొని యిట్లా పల్లె పల్లెకు తిరుగుతున్నా" అన్నాడు రామకృష్ణ.

అది విని బక్కన్న ఈయన పద్ధతేందో కొత్తగానే ఉంది. మనిషి చూస్తే పడుసోడు. ఇరవై ఐదు ఏండ్లను మించి ఉండయి. పడుసు పోరగాండ్లకుండాల్సిన షోకు, ఠీకు లేక మనిషి పెద్ద మనిషి తీరు కనిపిస్తుండు. ఈ వయసుల ఎవరైనా ఉద్యోగం, పెండ్లాంపిల్లలు అని సంసారంల పడి కొట్టుకుపోతరు. ఈయనేంది- పాత కాలం ఇత్తులు జమజేసుడే పని పెట్టుకున్నాడు అని మనసుల అనుకొని-

"ఈ ఇత్తులు జమజేసే సంగతేందో మాకు సమజ్ ల పడ్తలేదు. జర కులాసగ జెప్పు" అన్నాడు బక్కయ్య.

ఇంతలో భూదేవి బక్కయ్యకు పల్లెంలో భోజనం తెచ్చి, ఆగంతకుణ్ణి చూసి, ఒక అడుగు వెనక్కేసి, అట్లనే ఆగిపోయింది.

"మీరేమిటోల్లు, మా తిండి మీకు నడుస్తదా"? అని అడిగాడు బక్కన్న

పిల్లలు చలికాగుతూ, మధ్యలో కట్టెలు మంటలోకి ఎగదోస్తూ వచ్చిన మనిషిని తదేకంగా గమనిస్తూ అందరూ మాట్లాడింది వింటున్నారు.

"దేశ సంచారిని, అందరి తిండి నాకు నడుస్తది" అని జవాబు చెప్పాడు.

"అయినా మేం బీదోల్లం, పల్లెటూరోల్లం, మా పప్పు, గటక, రొట్టె మీకు పడది" అని రామకృష్ణతో అని, "భూదేయీ ఒక పిడికెడన్ని బియ్యం పెట్టు ఈ సార్ కోసం" అన్నాడు బక్కన్న.

"అయ్యో వద్దన్న, నేను అన్నీ తింట, గటక యిష్టం కొద్ది తింట, నా కోసం ఏమీ చెయ్యొద్దను" అని మళ్లీ "నేను చుట్టాన్ని, కాను. మీకు నమస్కారం చేస్త, నా కోసం ప్రత్యేకంగా చేస్తే నేను తినలేను" అన్నాడు రామకృష్ణ లేచి నిలబడి.

"నువ్వు తింటానన్నా, పెద్దోల్లు పనిబడి వచ్చిండ్లు మా ఇంటికి, రొట్టె గటక పెట్టటానికి మాకు మనసొప్పదయ్యా, నువ్వు ముందు కూసో రొట్టెనే తిందువుగాని" అంది భూదేవి.

రామకృష్ణ కూర్చుంటూ "మీ అందరి పేర్లు చెప్పనే లేదు" అని అందరి పరిచయాన్ని కోరాడు.

బక్కన్న భార్యను పిల్లల్ని పరిచయం చేసాడు.

ఇంతలో ఇద్దరికీ పళ్లాల్లో భోజనాలు

తెచ్చింది భూదేవి.

"మీ తిండి వేళకు వచ్చి, మిమ్మల్ని అవస్థ పెట్టినట్టయింది" అన్నాడు రామ కృష్ణ మొహమాటంగా నొచ్చుకుంటూ.

"మాకున్నదే నీకు పెడ్తిమి. యిండ్ల కష్ట మేమున్నది. మీ లాంటి మా రాజులు మా యింట్ల అడుగు పెట్టుడే గొప్ప. ఇట్లచ్చి చేతులు కాళ్లు కడుక్కోండి" అంటూ చెంబులో నీళ్లందించాడు బక్కన్న.

ఈ లోగా ఒక నులక మంచం తెచ్చి మంట దాపున వేసింది భూదేవి.

"గింత సబ్బు పట్కరా" అంటూ కేకే శాడు బక్కన్న.

"నాకు సబ్బేం వద్దన్న, ఇట్లనే కడు క్కుంట" అని రామకృష్ణ తడిచేత్తో కొద్దిగా మట్టిని చేతిలోకి తీసుకొని రెండు చేతులు రుద్ది శుభ్రంగా కడుక్కున్నాడు.

కాసేపట్లో రామకృష్ణ వాళ్లలో కలిసిపో యాడు. కులాసాగ మాట్లాడుకుంటూ భోంచేసారు బక్కన్న, రామకృష్ణ.

పిల్లల పేర్లు ఒకసారి చెబితే మరిచిపో తారు ఎవరైనా, కాని రామకృష్ణ ఎవరి పేరుతో వాళ్లను పిలుస్తూ, వాళ్లపని గురించి, చదువుల గురించి, యింకా అనేక విషయాలు వాళ్లను అడిగి తెలుసుకొని వాళ్లను సంభాషణలోకి దించి ఎంతో పరి చయం ఉన్నవాడిలా మసలుతున్నాడు.

బక్కన్న యింటిముందు నుంచి వెళు తున్న వారికి యింటికి ఎవరో చుట్టం వచ్చిండ్లు అనే సంగతి కాసేపట్లో చుట్టుప క్కల వాళ్లందరికి తెలిసిపోయింది.

బక్కన్న ఇంటి పక్కనే ఉండే ఇస్తారి, రాములు, రాజయ్య, గురువులు ఒక్కొక్కరే వచ్చి నెగడు దగ్గరికి చేరారు.

వచ్చిన వాళ్లందరిని రామకృష్ణకు పరిచయం చేయసాగాడు బక్కన్న.

"ఆ ఇత్తనాల సంగతి నేను కులాసాగ జెప్పమంటే నువ్ చెప్పనేలేదు సార్" అన్నాడు బక్కన్న.

'కులాసాగా' అంటే వివరంగా చెప్పమం టున్నాడని అర్థమయింది రామకృష్ణకు.

"నేను చేస్తున్న పని మీ అందరికీ నచ్చ కపోవచ్చు. నేనొక పిచ్చివాడిగా మీకు కని పించవచ్చు గాని, ఒక విషయం నా కర్త మైంది. అదే చేస్తున్నా, నా జీవిత లక్ష్యం అదే. నా లక్ష్య సాధనకోసం నేనెవర్ని యిబ్బందిగాని కష్టంగాని పెట్టను. నాకు తెలిసిన పద్ధతిలో నేను పనిచేసుకుపో తున్నా. ఈ నా పనితో ఎవర్నికైనా లాభ ముందా లేదా అనేది నేను ఖచ్చితంగా చెప్పలేను. ఈ భూమ్మీద ప్రకృతిపరంగా ఒక అనర్థం జరుగుతున్నది. దాన్ని నేను ఆపలేను. కాని నాకు చేతనయినంతలో కొంత కాపాడాలని నా ఆకాంక్ష. అందుకే యీ యాచన, బిక్షాటన" అన్నాడు రామ కృష్ణ.

"ఇత్తనాలు నశించిపోవుడేంది. అన్ని ఇత్తనాలు ఉన్నాయిగద" అన్నాడు దేవన్న.

"పదేండ్ల కింద యిటు దిక్కు ఎటుప డితే అటు కనిపించిన చిన్న పత్తి, పెద్ద పత్తి, వరలక్ష్మి పత్తి గింజలు నేడు ఉన్నాయా? సహజంగా మన పెంట ఎరు వుతో, ఎలాంటి రసాయనిక ఎరువులు, మందులు లేకుండా పండే పంటలు నేడు లేకుండా పోతున్నాయి. నేడు అన్ని సంకర జాతి విత్తనాలే. సంకర జాతివి ఏవైనా సరే అవి కృత్రిమ ఎరువులు, మందులు, ప్రత్యేక వాతావరణంలో తప్ప అవి పండవు. అదీ కొన్నాళ్లే మళ్లీ వాటిలో మార్పులు తెస్తే తప్ప కొత్తరకంగా విత్తనం తయారుచేస్తే తప్ప అవి పండవు. అలా తయారుచేసిన పంటల వలన మని షికి, ప్రకృతికి లాభంకన్నా నష్టమే ఎక్కువ. కాని అది వెంటనే కనిపించదు".

"అన్నా! మీ చిన్నపుడు జొన్నలో ఎన్ని రకాలుండేవి? గుర్తుతెచ్చుకో, అవి నేడు



ఉన్నాయా? " అని అడిగాడు రామకృష్ణ.

వింటున్నవాళ్ళు సందిగ్ధంలో పడ్డారు. ఆలోచనలో పడ్డారు.

"నిజమే! మా చిన్నప్పుడు ఎన్నో రకాల జొన్నలుండేవి, తెల్లజొన్నలు, పచ్చ జొన్నలు, వామ జొన్నలు, పేలాల జొన్నలు అంతెందుకు, వరి పంటలో ఎన్ని పేర్లుండేవో అన్ని రకాల జొన్నలుండేవి. పంట అంతా ఒకటే కాని రంగులో, వాసనలో, రుచిలో కొంత ఫరక్ ఉండేది. అవి ఏవీ నేడు లేవు. ఎటు పోయినయో నేను ఎంతో ఇష్టంతో దాచిపెట్టి ఉంచిన కాబట్టి, ఒక్క పేలాల జొన్నలు మిగిలినయి" అన్నాడు దేవన్న

"ఒక్క జొన్నలే కాదు, అన్ని రకాల పంటల పాత విత్తనాలు పోతున్నాయి. వాటి స్థానంలో కొత్తవి, హైబ్రిడ్ రకాలు వస్తున్నాయి. నాకు మీ దగ్గర యింట్లో ఈ మూలకో సాలకో పడి వుండి, మీరు మరిచిపోయిన, మీకు అవసరం లేని ఆ విత్తనాలు నాకు దయతో దానం చెయ్యండి. నేను వాటిని కాపాడుతా" అన్నాడు రామకృష్ణ.

"ఆ విత్తనాలు ఎన్నాళ్లని ఉంచుతవ్? అట్ల ఎన్నాళ్లని ఉంటయి అవి ఖరాబు కాకుండా" అడిగాడు బక్కన్న.

"మంచి విత్తనాలను ఉంచగలిగినన్నాళ్లు ఉంచుతమ్. వీలయినంత మటుకు వాటిని నాటి కొత్త విత్తనాలు రూపొందించి వాటిని భద్రపరుస్తాం".

"ఇంతజేసి ఏం లాభం? " అడిగాడు గురువులు.

"ఈ సంకరజాతి విత్తనాలు వద్దని మీరనుకున్న నాడు, రైతు మార్కెట్‌లో విత్తనాలు కొని నాటుకోవడంలో లాభం లేదు. మన విత్తనాలే మంచియని గుర్తించి కావాలనుకున్నపుడు మీ విత్తనాలు మీకు మళ్లీ దొరుకుతాయి"

"మీకేం లాభంసార్, యిదంత చెయ్యతందుకు? " అడిగాడు ఇస్తారి.

"రాబోయే కాలంలో యీ విత్తనాల అవసరం భావించి నేను యీ పని చేస్తున్నా అంతే, ఇదే లాభం నాకు. రేపు యీ దేశంలో ఉండే అన్ని రకాల విత్తనాలపై ఇతరులు ప్రపంచ పేటెంట్ హక్కులు పొందితే మనది అని చెప్పుకోవడానికి ఒక విత్తు ఉండదు"

"ఈ విత్తనాలను మల్లా ఎక్కడ పండిస్తరు మీరు? " అడిగాడు రామకృష్ణ

"విత్తనాలు పండించడానికి భూమి కావాల. నా వద్ద భూమి లేదు. నా మిత్రుడికి వ్యవసాయం ఉంది. అతడు అవసరాన్ని బట్టి యేటా కొన్ని రకాల విత్తనాలు వేసి కొత్త విత్తనాలను జాగ్రత్త చేస్తాడు. అతడికి కూడా లాభం ముచ్చటలేదు. మేం పెద్ద ఎత్తున పండించం, విత్తనం కోసం వీత్తనం అంతే.

మహనీయుల ఆలోచనలో దార్శనికత ఉంటుంది. మనిషి వేషమే కాదు ఆలోచనలు కొత్తవే.

దాన్ని గుర్తించే మనసు, చూడగలిగిన నేత్రం ఉండాలి, చూడలేని వాళ్లకు ప్రతి దార్శనికుడు ఒక పిచ్చివాడిగానే కనిపిస్తాడు.

ఈ సభ్య సమాజంలో రామకృష్ణలాంటి వాళ్లు కొంచం అసహజంగానే కనిపిస్తారు. వాళ్లు ఏ కోటికో ఒక్కరుంటారు కాబట్టి సమాజ శ్రేయస్సు, మానవ కళ్యాణం వారి జీవిత లక్ష్యం. శాబ్దిక సిద్ధాంతాల కన్నా ఆచరణకే వీరు ప్రాముఖ్యతను యిస్తారు. కాబట్టి వీరు నిష్కామ కర్మయోగులు అనుకున్నాడు బక్కన్న.

చాలాసేపు వారి సంభాషణ రకరకాల పంటలపై, విత్తనాలపై, పండించే విధానంపై కొనసాగింది. చూస్తుండగానే చల్లటి మంచు కురవడంతో చలి కూడా ఎక్కువ



యింది. వచ్చిన వాళ్లు లేచి "వస్తాం సార్, మల్ల పొద్దుగాల్లకలుస్తం, ఎల్లొస్తం" అంటూ సెలవు తీసుకొని ఎవరిళ్లకు వాళ్లు బయలుదేరారు.

"నువ్ కూడా పడుకో సార్, దినమంత ఎక్కడెక్కడ తిరిగినవో ఏమో' ' అంటూ బక్కన్న కూడా లేచి, "రండి సార్ లోపల పడుకోండ్లి, ఈ మంచం లోపల ఏస్త" అనడంతో రామకృష్ణ లేచి లోపలికి నడిచాడు.

రామకృష్ణ ఉదయమే లేచి కాలకృత్యాలు తీర్చుకుని, వాళ్లు పెట్టిన చద్దన్నం తిని బయలుదేరడానికి సిద్ధమయ్యాడు.



"అమ్మా భూదేవి వెళ్లొస్తానమ్మా - మల్లా యిటు దిక్కు వచ్చినపుడు కలుస్త. నా దగ్గర కొన్ని విత్తనాలున్నాయి. నేను మీ ఇంట్లో నాటి పోత. అవి పెరుగు తయ్. పూస్తయ్, కాస్తయి. వాటిని వాడు కోండి. ఈ భూదేవి ఒక ఇత్తు పెట్టి ఇన్ని నీళ్లుపోస్తే, మీ కడుపుకు పట్టినన్ని కాపులు కాస్తది. ఇదిగో మీరు స్నానాలు చేసే పెరట్లో ఈ బచ్చలి ఇత్తు, మీరు కాళ్లు కడుకునే గోలెం దగ్గర ఇదిగో ఒక పొప్పడి ఇత్తు, ఇదిగో మీ దడి పొంటి కాకర, నేల చిక్కుళ్లు పెట్టు" అంటూ నాలుగిత్తులు భూదేవి చేతిలో వేసాడు.

అలాగే ఒక్కొక్కరి ఇంట్లో తన జోలె లోంచి దేశవాళి గింజలను తానే తగిన స్థలంలో నాటుతూ కొన్ని రకాల విత్తనాలు చేతిలో వేస్తూ కదిలిపోతున్నాడు రామ కృష్ణ.

అలా ఒక్కో ఇల్లు దాటుకుంటూ వెళు తుంటే విశ్వనాథంగారి ఇల్లు వచ్చింది.

విశ్వనాథంగారు రామకృష్ణను సాద రంగా ఆహ్వానించారు.

విశ్వనాథం తన పరిచయం చెప్పుకు న్నాడు.

రామకృష్ణ తన పరిచయం చెప్పుకొ చ్చాడు. "నా పేరు రామకృష్ణ, ఐ.ఐ.టి. పూర్తయింది. గతంలో మీ జిల్లా కలెక్టర్‌గా చేసిన రామకృష్ణ కూడా ఐ.ఐ.టి. చేసే ఐ.ఎ.ఎస్. చేసాడు. మేం క్లాస్‌మేట్స్. చాలామంది నా మిత్రులు విదేశాల్లోనూ యీ దేశంలోనూ పెద్ద పెద్ద హోదాల్లో ఉన్నారు. కాని నాకే ఎందుకో ఏదీ నచ్చక ప్రజల మధ్య ఉండి నా మనసుకు, ప్రజ లకు ఉపయోగపడేది ఏమైనా చేయాలని యిలా బయలుదేరాను" అన్నాడు.

విశ్వనాథంగారు కాసేపు ఏమీ మాట్లాడ లేకపోయారు.

రామకృష్ణ తమ పిల్లల ఈడు వాడే కాని ఇతడికి- వాళ్లకి ఎంత తేడా? ఎంతో ఉన్న తమైన చదువులు చదివి, అన్నింటిని తృణ ప్రాయంగా తృణీకరించి ప్రజలకోసం ఏదో చేయాలనే తపనతో యిలా పల్లెలు పట్టు కొని తిరగడం అతణ్ని ముగ్ధుణ్ణి చేసింది. వెంటనే లోపలికి వెళ్లి భార్యకు టూకీగా అతడి పరిచయం చెప్పి వెంట బెట్టుకొని వచ్చాడు.

రావడంతోనే రామకృష్ణను చూసి జానకి ఒక్క క్షణం చలించిపోయింది. రెండు చేతులెత్తి నమస్కరించింది.

"మీరు పెద్దవారు అలా నమస్కరిం చొద్దు" అంటూ రామకృష్ణ జానకి పాదా లను స్పృశించాడు.

"మీరు మహనీయులు" అంది జానకి.

"చాలా పెద్ద మాట. ఆశయం, సంకల్ప బలం, మీలాంటి మాతృమూర్తుల చేయూత ఉంటే ప్రతి మనిషి మహనీ యుడే" అడిగాడు విశ్వనాథం.

"రామకృష్ణగారు అసలు మీ ఆశయం ఏమిటి" అడిగాడు విశ్వనాథం.

"ప్రపంచీకరణ పేరుతో నేడు ఈ దేశం లోని పల్లెలు పూర్తిగా డొల్లలయిపోతు న్నాయి. ఇక్కడ విత్తే విత్తు మనది కాదు. ఎరువు మనది కాదు. పురుగుల మందు మనది కాదు. అన్నీ పరాయి వాళ్లయి. పరాయి పాలనలో మనం మనదైన జీవనం గడిపాం. నేడు స్వదేశీ పరిపాల నలో అన్నీ విదేశీయం. ఇక్కడున్న గాలి, నీరు, భూమి మనది. మిగతావి అన్నీ పరాయివి. నగరాల గురించి నేను ఆలో చించడంలేదు. కాని యీ పల్లెలు యీ మనుషులు, వారి జీవన విధానం, వారి ఆర్థిక వ్యవస్థ దీని పైననే దృష్టి. ఆధునిక విజ్ఞానాన్ని పల్లెల ఉన్నతికి, సంక్షేమానికి, పల్లెల ఉనికి కాపాడటానికే వినియోగించా లని నాప్రయత్నం" అంటూ రామకృష్ణ సెలవు తీసుకున్నాడు.

# కొత్త సంస్కృతి



**సౌత్** అమెరికాలోని స్పానిష్ భాష మాట్లాడే వెనిజులా దేశంలో 1970లలో ఆయిల్ నిక్షేపాలు లభించి, అతి త్వరలోనే అది ధనిక దేశంగా మారింది. ఒపెక్ దేశాలలో అదొకటి. అకస్మాత్తుగా ధనం పెరగడంతో అక్కడి ప్రజలు విలాస వస్తువులని కొనడం అధికమైంది. వారికి దగ్గరగా ఉన్న అమెరికాలోని ఫ్లోరిడా రాష్ట్రానికి షాపింగ్‌కి వస్తుంటారు. త్వరలోనే షాప్ యజమానులు వెనిజులా దేశం నుంచి వచ్చిన వారిని తేలికగా గ్రహించసాగారు. ఎందుకంటే వారు ఏ వస్తువునైనా రెండు కొంటారు. దాంతో వారికి 'గివ్ మి టూస్' అనే నిక్‌నేమ్ వచ్చింది.

వెనిజులా ఆదాయం పెరగగానే అక్కడి స్త్రీలు అందానికి ప్రాధాన్యం ఇవ్వసాగారు. ప్రపంచ అందాల సుందరుల పోటీల్లో తరచూ వెనిజులా యువతులు గెలుస్తుంటారు. అక్కడి యువతులు సహజంగా అందగత్తెలు. ఖరీదైన అలంకరణ సామగ్రి వారి అందాన్ని ఇనుమడింపజేస్తుంది.



ఇంధన ధనంతో ఐశ్వర్యవంతులైన వెనిజులా తల్లిదండ్రులు తమ కూతురి పదిహేనవ పుట్టినరోజుకి కొత్తగా వక్షోజాలని పెద్దవి చేసే ఆపరేషన్ ఖర్చులని బహుమతిగా ఇస్తున్నారు. ఆ దేశంలో దీనికి సంబంధించిన ప్లాస్టిక్ సర్జరీ ఆపరేషన్స్ గురించి విరివిగా అన్ని మీడియాల్లో ప్రకటనలు వస్తుంటాయి. అక్కడి బేంకులు కూడా ఈ ఆపరేషన్లకోసం అప్పు మంజూరు చేస్తాయి. సగటున ఈ ఆపరేషన్‌లో ఎనెస్తీషియాకు 800 డాలర్లు, హాస్పిటల్ ఫీజ్, మందులకు 2500 డాలర్లు, ఆపరేషన్ చేసే డాక్టర్ ఫీజు 7000 డాలర్లు అవుతుంది. చాలామంది స్త్రీలు తమకి ఆ ఆపరేషన్ అయిన సంగతి లిఫ్ట్‌లలో, రెస్టారెంట్స్‌లో బహిరంగంగా, గర్వంగా చెప్పుకోవడం కూడా అక్కడ మామూలే. ఆ ఆపరేషన్ చేయించుకోనివారికి వివాహంకావడం కూడా ఇప్పుడక్కడ కష్టంగా మారుతోంది.

అయితే దీన్ని వ్యతిరేకించేవారూ లేకపోలేదు. 1999లోనే వెనిజులా దేశాధినేత అయిన హ్యూగో చావెజ్ ఈ కొత్త సంస్కృతిని తీవ్రంగా గర్హించాడు. ప్రతి ఆదివారం ఆయన టీవీలో ఇచ్చే వీక్లి షోలో ఓ ఆదివారం దాదాపు 8 గంటలపాటు ఈ పద్ధతిని తీవ్రంగా ఖండించాడు.

ఎక్కువమంది అమెరికాకి వచ్చి ఆ ఆపరేషన్ చేయించుకుంటున్నారు. ఫ్లోరిడా, కాలిఫోర్నియా రాష్ట్రాలని ఇందుకు వారు ఎక్కువగా ఎన్నుకుంటున్నారు.



ఏసంగి ఎండలు మండిపోతున్నాయి.

బక్కన్న పెరట్లో ఎండిపోయిన చిక్కుడు తీగల పందిరి కింద నులకమంచం వేసుకొని పరిపరివిధాల ఆలోచిస్తున్నాడు. పెళ్లయిన కొత్తలో అప్పుడెప్పుడో రెక్కలు ముక్కలు చేసుకొని, నోరు కట్టుకొని పదెకరాలను ఇరవై చేసాడు. ఇలాగే జీవితంలో అన్నీ పెంపవుతాయి అనుకున్నాడు. కష్టం చేసే చేతులు నాలుగు. తినే నోళ్లు రెండింటికి నాలుగైనయి. ఇద్దరే ఉన్నప్పుడు నోరు కట్టుకున్నారు. సలిదో, పులిసిందో తిని కాలం గడిపి భూమిని రెట్టింపు చేసిండు. ఇప్పుడు అంతకన్నా ఎక్కువ కష్టపడుతున్నడు కాని మిగిలింది ఏమీ లేదు. పైగా ఏటా అప్పే మిగులుతోంది. ఇరవై ఎకరాల ఆసామి అన్న పేరేగాని బతుకు బిచ్చగాని కన్న అన్యాయంగా ఉన్నది అనుకున్నాడు.

బక్కన్న అటునుండి ఇటు తిరిగి పట్నం బంతిపూలను చూస్తూ ఆలోచిస్తున్నాడు.

ఉన్న చేనును ఎవర్నికైనా బటాయికిస్తే కౌలుకింద ఏటా ఇంత సొమ్ము కళ్ల జూడొచ్చు. కాపుదనం పుట్టుక పుట్టి ఎవడికో బటాయికిచ్చుడేంది? అయినా ఇప్పుడు ఇక్కడ కౌలుకు చేసేటోల్లెవరున్నారని, పనోళ్లు దొరగక ఎవరి పరేషాన్‌ల ఆల్లున్నారు. అసుంటపుడు నా చేన్నెవరు బటాయికి చేస్తరు. చేను బటాయికిచ్చి నేను, భూదేవి ఏం జేసుడు? పని లేకుంటే తిన్నదెట్ల అరుగుతది.

'పోనీ భూమిని అమ్మేస్తే.. ఆలోచన వచ్చిన వెంటనే బక్కన్న గుండెను ఎవరో తొక్కినట్లు ఉలిక్కిపడ్డాడు. ఛీ... ఛీ... నీ అవ్వ నేడేమయింది. గిసుంటి భయాలొస్తున్నాయి నాకు. రోజుకు ఒకసారైన తన పట్టా భూమిలో నాలుగడుగులైనా నడిచి ఆ గాలి పీల్చుకుంటేగాని తన ప్రాణం నిల్వదు. తను తల్లి మొఖం జూడలే. ఈ భూమి ముఖమే తెలుసు. ఈ భూమి మీదనే ఆడిండు, పాడిండు, పాకిండు. పొత్తిళ్లలో ఉన్నప్పుడు తల్లి బట్టలు ఖరాబు చేసినట్లు ఈ భూమిని ఖరాబు జేసిండు. కాని భూదేవి తల్లి ఈ బిడ్డను ఎన్నడూ ఏవగించుకోలేదు. అసుంటి ఈ తల్లి భూదేవిని ఇంకొకరికి అమ్మడం కంటే ప్రాణాలు తీసుకోవడం మేలు. ఈ యేడు పత్తి పంట నిలువునా ఎండిపోయింది. అంగట్ల ధర కూడా అంతంతనే ఉండే. ఈ ఏడు మస్తు మందికి పంట అనుకున్నట్లు రాలేదు. అందుకని ఈ యేడు పత్తి పండించేటోల్లు శానామంది తగ్గిపోతరు. నన్నే చూడరాదు. ఈసారి పత్తి పంట ఎయ్యకుంట ఉంటే ఎట్లుంటది. అనే ఆలోచన చేయవడ్తి. అందరూ అట్లనే జేస్తరు. ఇసుంటపుడే కాలం ఎడ్డమంటే తెడ్డమని పంట ఎయ్యని యేడు పంట మస్తు పండుతది. ధర కూడా జబర్దస్తుగా ఉంటది. పండించినోని దరిద్రం దూరమవుతది. మస్తు సార్లు ఇట్లనే జరుగుతున్నది. కాలం కరుణించినపుడు రైతు నిరాశపడి వెనుకడుగు వేస్తడు. తను ఈసారి మల్లా ముందడుగే వేస్తడు.' అని అనుకుంటుంటే భూదేవి పలకరించింది. "ఏంది అప్పట్నుంచి ఏం సోంచ్ జేస్తున్నావ్. ఒక్కడే ఈడ మంచం మేసుకొని పన్నవ్. ఎండ జూడు ఎట్ల పడ్తున్నది"

"ఇది ఏసంగి గద. ఏదన్న ఇప్పుడే సోంచ్ జెయ్యాల. ఈ యేడు చేన్ల పంట ఏసుడు, ఎంత ఏసుడు అని విచారం జేస్తున్న"

"ఇచారం చేసేదేముంది? యేటా ఏసినట్లు ఏద్దాం. సగం పత్తి, సగంల ఇంత జొన్న, కంది, పెసర, నువ్వులు, పెడ్దాం" అంది భూదేవి.

"అదెపుడు జేస్తున్నదే. ఈసారి మొత్తం పత్తే పెడ్దాం. ఈ దెబ్బతోని మన దరిద్రం దూరంగావాలె. నాలుగు పైసలొస్తే అన్నీ కొనుక్కోవచ్చు. ఏమంటావ్? " అన్నాడు బక్కన్న.

"వద్దయ్య ఒక్కపంట ఏస్తే అది పండకుంటే ఎటూ కాకుండా పోతం"

"అది కాదే... ఈసారి కిస్మత్ మంచి గుంటుందని నాకెందుకో అనిపిస్తుంది. ఈ ఒక్కసారి జూద్దాం. నువ్వు ఊ అంటే ఆ దేవుడు నన్ను చల్లగ జూసినట్లే. చెప్పు భూదేవి ఏమంటావ్ నువ్వు..."

"నీ మాటనే కాని ఇరవై ఎకరాల పత్తి పంట పండితే మనంత కిస్మత్‌దారు లేడు" అంది భూదేవి కాని పండకుంటే మనంత బికారి లేడు అనలె, కాని మనసులో అనుకుంది.

ఇద్దరూ ఇలా మాట్లాడుకుంటుంటే మాటల మధ్యలో కొడుకు అశోక్ వచ్చి ఏదో చెప్పాలని తటపటాయిస్తున్నాడని బక్కన్న, భూదేవిలు గ్రహించారు. చెట్టంత ఎదిగి చేతికి రావలసిన కొడుక్కు సర్కార్ బడిల వచ్చిన సదువు అంతంత మాత్రమే. సదువొచ్చా అంటే రాదు. రాదా అంటే వచ్చు. అట్లా ఉంది పరిస్థితి. పదవతరగతి రెండుసార్లు తప్పి ఏదో గట్టెక్కిచ్చాడు. ఇంటర్‌లో అన్ని సబ్జెక్టులు పాయే. అది అట్లానే ఉంది. చదివిన సదువుకు వచ్చే ఉద్యోగం లేదు. ఈ ఊళ్లె చేయడానికి పనేం కనిపించక, ఏంచేయాలో దిక్కుతోచక ఏదో నిర్ణయానికి వచ్చినోడిలా

**కొత్తగాలి...**

**మేఘాలు**
**నీళ్లోసుకున్నాయి**
**చెట్లూచేమల**
**ఆనందపు చిందులు**

-కోపూరి పుష్పాదేవి, విజయవాడ

కన్నోల్లకు ఏదో చెప్పాలని సంకోచిస్తున్నట్లు బక్కన్నకు, భూదేవికి అర్థమైంది.

"ఏంది బిడ్డా ఏదో సోంచ్‌ల వడ్డావ్. ఈ యేడు మీ అయ్య ఇరవై ఎకరాల పత్తె పెడ్తడట. అంతా హైబ్రీడ్ పత్తే. ఒంటి చేత్తోనే ఎంత కైకిల్లు వెట్టుకున్నా చేసుడు మా ఇద్దరి తరం గాదు. నువ్వు తమ్ముడు తలా ఒక చెయ్యేసి ఆసరా ఇస్తే నాలుగు రాళ్లు కళ్ల జూస్తం" అంది భూదేవి.

"అవ్ బిడ్డా... మీ అవ్వ జెప్పింది సమజయిందా? ఈ ఊళ్లె పనికి మనిషి దొర్కుడే గగనమయ్యింది. దొరికినా మనిషికి యాభై రూపాయిలియ్యాల. మీరిద్దరూ నాకు తోడుంటే దినాం నూరు సంపాదించినట్టే. ఏమంటవ్ బిడ్డా" అన్నాడు బక్కన్న.

"ఇంటి మనిషి జేసినట్టు కైకిలి మనిషి జెస్తడా ఏంది? ఇంత పొద్దెక్కినంక అస్తడు. పొద్దుండగానే పనిలకెల్లి దిగుతడు. మనకు కడుపు నొచ్చినట్లు ఆల్లకు నొస్తదా ఏంది"

అశోక్ మౌనంగా నేల చూపులు చూస్తున్నాడు. అవుననలె, కాదనలె. భూదేవి, బక్కన్న ప్రణాళికలో పనిలో తనకు ప్రమేయం లేనట్టే ఉన్నడు.

"ఏందిరా అవుననవ్ కాదనవ్. నీ కడుపుల ఏం ఇచారం ఉన్నదో చెప్పు మరి. తిరిగినన్ని దినాలు తిని తిరిగితిరి.



ఇప్పుడు చెయ్యెత్తు ఎదిగిండ్లు అన్నదమ్ము లిద్దరూ. అయ్యకు ఆసరైతే, నాలుగు రాళ్లు కండ్ల జూస్తే అచ్చేటకి మీ ఇద్దరికి లగ్గం జేస్తాం అనకుంటున్నమ్" అంది భూదేవి.

"మీ కాళ్లమీద నిలబడి నాలుగు రాళ్లు సంపాదిస్తే ఎవల్లన్న కండ్లకద్దుకొని పిల్లని స్తరు. నీ ఈడుల మీ అయ్య ఒక్కడు వండుకొని తిని పదెకరాల భూమి పోతం జేసిండు. ఇద్దరన్నదమ్ములు పోతం జేసిన భూమిని కాపాడుకోమంటున్నమ్. మీ బాపుకింత ఆసరా కమ్మంటున్నా" అంది మల్లా భూదేవి.

"ఏంది బిడ్డా మేం ఇన్ని మాట్లాడినా నువ్వు ఒక్కమాట చెప్పవ్" అంటూ కొడుకును దగ్గరికి తీసుకున్నడు బక్కన్న.

కొడుకుని కంటికి దగ్గరగా, చేత్తో పట్టుకొని చూస్తే అర్థమయింది.. కొడుకు ఎంత దృఢంగా ఎంతగా ఎదిగాడో, గడ్డాలు మీసాలు వచ్చి తనంతగా ఎదిగినట్టనిపించింది. మనసులో ఏముందో చెప్పమని స్పర్శతో చేయి దండ పట్టుకొని అనునయించాడు బక్కన్న. ముట్టుకుంటే తెలిసింది కొడుకుది దొడ్డు బొక్క అని అర్థమయ్యింది. కాని మనసులో ఏముందో అదే తెలవడం లేదు.

"చేను పని చేసుడు నాతో కాదే. అవ్వను నిన్ను చూస్తున్నగదా. ఆ ఎండా వానా, చలిలో ఆ చేన్ల పని చేసుడు నాతోని కాదు. నేను అదిలాబాద్‌ల ఏమన్న పనిజేస్త" అంటూ మనసులోని అసలు సంగతిని మెల్లగా చెప్పాడు.

బక్కన్న, భూదేవి ఏమీ మాట్లాడలేదు.

చెట్టంత ఎదిగిన కొడుకు చేతికొస్తడనుకుంటే ఉన్న ఊరిని, కన్నోళ్లని, అన్నం పెట్టే భూమిని కాదని ఎక్కడో పొట్ట చేత పట్టుకొని ఎవడికో ఊడిగం చేస్తానంటే ఏం చెప్పాలో అర్థం కాలేదు బక్కన్నకు.

"ఆ బస్తీల నువ్వు ఏం చేస్తావ్? ఎంత సంపాదిస్తవ్? ఏమున్నదక్కడ. ఆకలయితే అన్నం పెట్టే మనిషుంటదా అక్కడ. రోగమొస్తే అడిగే దిక్కుంటదా. ఇంతజేసి ఏం సంపాదిస్తవ్, ఏం మిగులిస్తవ్" అంది భూదేవి.

"ఇక్కడ ఇంతజేసి ఇన్నేళ్లల్ల అయ్య ఏం సంపాదించిండు? ఏం మిగిల్చిండు?" అన్నాడు అశోక్ మెల్లగా. నాలుగు చెర్నాకోలల్తో ఒకసారే కొట్టినట్టు ఉలిక్కిపడ్డాడు బక్కన్న.

అశోక్ అన్నమాటకు విలవిల్లాడిపోతున్నాడు. కన్నకొడుకు ఏం సంపాదించిండు, ఏం మిగిల్చిండు అంటే... సమాధానం కోసం తడుముకుంటున్నాడు. అంతా శూన్యం. కొడుకు కొట్టిన దెబ్బనుండి బక్కన్న కన్నా ముందు భూదేవి కోలుకుంది.

"మీ అయ్య ఏం సంపాదించిండా విను... అయ్యా అవ్వా లేనోడు, తిని తినక ఈ భూమిని నిలుపుకున్నడు. మీరు కళ్లు తెరవకముందే పదెకరాలను ఇరవై జేసిండు. అప్పుడు కాలం అసుంటిది. కాలం మారింది. ఉన్నది నిలుపుకునుడే గగనమయింది మాకు. ఉన్న భూమితోనే మేం బతికినం, మిమ్మల్ని బతికించినం. ఇప్పుడు భూమున్నది, మేమున్నం మీరున్నరు. ఇదంతా సంపాదించి మిగుల్చుకున్నది కాదా" అంది భూదేవి.

"నేను మిద్దెలు మేడలు కట్టలే, తాగి తందానాలాడలే. యాడాదికి నా పేర్న రూపాయి కర్సుండది. నాకున్నంతలో మిమ్మల్ని గుండెల మీద పెంచిన, అర చేతుల్లో నడిపించిన. నాతోని అయిన కాడికి చేసిన. ఎన్నడు నాకోసం తీర్లైన బట్ట కట్టలే. మనసైంది తినలె, కాని ఏం మిగల్లలేదు. నేనేం చేయను... ఆరుగాలాలు కుక్కతీరు, ఎద్దల్లే పని చేస్తున్నా కాని నా కిస్మతే మంచిగలేదు" తనలో తనే

గొణుక్కున్నట్టు అన్నాడు బక్కన్న.

"బాపు నువ్వు మాకేం చేయ్యలే అని నేననను. నువ్వు ఇంత రెక్కలు ముక్కలు చేసుకున్నా మనకేం మిగులుతలేదని అంటున్నా. ఇసుంటి యవసాయం ఇద్దరు చేసిన, నలుగురు చేసిన ఒక్కటే అని నామాట" అన్నాడు అశోక్.

"సరే బిడ్డ నేను, మీ అవ్వ ఎలాగోలా కష్టపడతం. నువ్వు నీకిష్టమైనట్టు బతుకు. విశ్వనాథంబాబు ఎన్నడో అన్నడు, మా అయ్య బతికినట్టు నేను బతక. నేను బతికిన బతుకు నా పిల్లలు బతకరు. ఆల్ల పిల్లలు ఆల్ల తీరు బతకరని. ఆయాల్లకు ఆ మాట నాకు భోదపడలే. అది పెద్ద లోకుల సంగతనుకున్న. కాని యియ్యాల్ల మన బతుకులు, అందరి బతుకులు అర్థమైంది" అన్నాడు బక్కన్న.

అశోక్, రమేష్ అదిలాబాద్‌లో ఏదో ఒక ఉద్యోగంలో కుదరాలని నిశ్చయమైపోయింది. అందుకు పెద్దల అడ్డంకూ తొలగిపోయింది.

★ ★ ★

రోజువారి కార్యక్రమంగా తీరిగ్గా పేపర్ చదువుకొంటున్న విశ్వనాథంగారు 'దండాలయ్య' అనే పలకరింపుతో పేపర్ తప్పించి ఎవరా అని చూస్తే ఎదురుగా నర్సిగాడు కనిపించాడు.

"ఏం నర్సిగా మస్తురోజులకు కనిపిస్తివి. ఏం సంగతి? ఎట్లా ఉన్నడు నీ కొడుకు? దుబాయ్‌కెల్లి పైసలవి బాగానే పంపిస్తున్నడా" అంటూ యధాలాపంగా పలకరించాడు విశ్వనాథం.

"అ బాగానే ఉన్నడయ్యా- ఇంతట్లనే దుబాయ్‌కెల్లి అచ్చిండు. ఆడచ్చి నాలుగు దినాలవుతోంది దొర. అప్పట్నుండే ఫజీత్ సురయింది" అంటూ చెప్పాల్సిన అసలు విషయానికి నాందీ ప్రస్తావనగా కొడుకు గురించి టూకీగా చెప్పాడు నర్సిగాడు.

"దుబాయ్‌కెల్లి నీకొడుకచ్చిండా. నాకు

## నేనే చేశాను

ఓ పిచ్చాసుపత్రిలో ఓ రోగి మరో రోగి నీళ్లలో పడి మునిగిపోతుంటే ప్రాణాలకు తెగించి కాపాడాడు. కాపాడిన వ్యక్తిని ప్రశంసిస్తున్నాడు ఆస్పత్రి డైరెక్టర్.

'రావ్ మీరు గొప్ప సాహసంతో తోటి వ్యక్తిని కాపాడారు. కానీ అతను దురదృష్టవశాత్తూ ఉరేసుకున్నాడు. ఏదేమైనా మీరు పూర్తిగా కోలుకున్నట్లే. మిమ్మల్ని డిశ్చార్జి చేయాలనుకుంటున్నాం.'

వెంటనే రావ్, 'నిజానికి అతను ఉరేసుకోలేదు. నీళ్లలో తడిశాడని నేనే చెట్టుకు వేలాడేశా' అన్నాడు అమాయకంగా.



తెల్వదు అదృష్టవంతుడివి. పెట్టి పుట్టాల" అంటూ ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు విశ్వనాథం. తన కొడుకులు మళ్లీ వచ్చే ఆశ లేదనే ధ్వని ఉంది ఆ నిట్టూర్పులో.

విశ్వనాథంగారి దీర్ఘమైన నిట్టూర్పు అనేకమైన భాష్యాలు చెప్తుంది. బ్రతుకు దెరువు వేటలో విశ్వనాథం ఇద్దరి కొడుకులు దేశం వదిలిపోయారు. కాని వాళ్లు మళ్లా వచ్చే ఆలోచనలో ఉన్నట్టు లేదు. అక్కడే స్థిరపడదలుచుకున్నారు. ఆ దిశలో ప్రయత్నించి ఈ మధ్యనే గ్రీన్‌కార్డు కూడా సంపాదించుకున్నారు. అంటే వారు ఇక ఈ దేశం రానవసరంలేదు. బ్రతికినన్నాళ్లు ఆ దేశంలోనే ఉండొచ్చు. ఆ దేశం వీళ్లని తమ పౌరులుగా గుర్తించి గ్రీన్‌కార్డు ఇచ్చింది. ఎప్పటికైనా ఈ దేశం తిరిగి వస్తారనే విశ్వనాథం- జానకీల ఒకే ఒక



ఆశ వాళ్లకు గ్రీన్‌కార్డు దొరికిందనే మాటతో- పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది. అలాంటి విశ్వనాథంగారికి నర్సిగాడి కొడుకు దుబాయినుంచి తిరిగి వచ్చాడంటే నర్సిగాడు గొప్ప అదృష్టవంతుడిగాను, నర్సిగాడి కొడుకు పూలాజీ నిజమైన కొడుకుగాను కనిపించారు.

విశ్వనాథం- మనసులోని సంఘర్షణ నర్సిగాడికి తెలియదు. అందుకని "ఏం అదృష్టమయ్యా, వాడిప్పుడు రాకున్న మంచిగుండేది. పోయినోడు పోయిండు. అక్కణ్ణే ఉంటే అందరికి సుకం గుండే" అని తనలో తనే గొణుక్కున్నట్లు అన్నా విశ్వనాథంకు స్పష్టంగానే వినిపించింది.

విశ్వనాథం కొడుకులు పరాయి దేశంలో స్థిరపడి ఇక రారు అనుకొని బాధపడుతుంటే, వచ్చిన కొడుకుని చూసి నర్సిగాడు బాధపడుతున్నాడు. ఒక పని ఒకరిలో బాధని కలిగిస్తే, అదే పని ఇంకొకరిలో సంతోషాన్ని కలిగిస్తుంది. ఇదే లోకం తీరు అనుకున్నాడు విశ్వనాథం.

"కన్నకొడుకు పరాయి దేశంకెల్లి వస్తే సంతోషపడేది పోయి అట్టా అంటవేందిరా" అంటూ నర్సిగాన్ని సున్నితంగా మందలించాడు విశ్వనాథం.

విశ్వనాథం నర్సిగాడు ఏం చెప్తాడోనని ఎదురు చూస్తున్నాడు.

"అప్పుడు మూడేండ్ల కింద మావోడు ఇట్ల లగ్గం కాంగనే అట్ల ఆ పొల్లనీడ ఉంచి ఆడటు దుబాయ్‌కి పోయే. ఆడేమో- దుబాయ్‌ల. ఈ పొల్ల కొన్నొద్దులు అత్తగారింట్ల, కొన్నొద్దులు తల్లిగారింట్ల ఉండవట్టే. అట్లనే నడవట్టె. నడంగ, నడంగ అది దాని తల్లిగారూల్ల ఒకనికి అలవాటుపడె. ఉప్పుకారం తిన్న పానం అలవాటు పడ్డ పానమాయే. కట్టడి తప్పె, కాలుజారె. అందరూ చూసి చూడనట్టుండ్రి. నాకైతే ఏం తెల్వదు. ఇప్పుడిప్పుడే ఒక్కొక్కటి తెలుస్తున్నయి. ఆ నోటా ఈ నోటా ఆడు అక్కడున్నన్నినెల్లూ మస్తు పైసలు పంపవట్టె. రూపాయి వస్తే మూడు పావలాలు దాని దగ్గర ఉండే.

మేం కూడా ఏం అనలే. దాని మొగుడు దాని పైస అనే అనుకున్నం. ఇప్పుడీడొచ్చే ఈంతోని అది సంసారం చెయ్యదట. ఆ అలవాటు పడ్డోడితోనే ఉంటదట. మా వోణ్ణి పార్ఖత్ ఇయ్యమంటది అది. అట్లనే ఇస్త అంటడు మావోడు. కాని ముందుగల్ల ఇన్నొద్దులు నేను పంపిన పైస పైస నాకు అప్పగియ్యి. అప్పుడే నినిడిసి పెడ్త అంటడు నా కొడుకు"

"లగ్గం జేసుకొని ఏలుకోను ఇగరం లేక, వద్దన్నా ఇనక నన్నిడిసి దుబాయ్ పోతివి. పైసలు పంపితే ఎవరికోసం పంపినవ్. పంపిన పైసలు నా పొట్ట బట్టకు అయినయి. ఇప్పుడియ్యమంటే ఎక్కడికెల్లి ఇచ్చేది. పైసలెనక ఉరికే మొగుడొద్దు నాకు. నాతోని సంసారం జేసే మొగోడు గావాలంటంది అది"

విశ్వనాథంగారు ఆసక్తిగా వింటున్నారు. మళ్లీ నర్సిగాడు చెప్పడం మొదలు పెట్టాడు.

"ఇద్దరు ఒకర్నొకరు దెప్పుకొనిరి. ఇద్దరికి ఆల్లొక మాట, ఈల్లొక మాట చెప్పిరి. తెగే దాక గుంజిరి. ఇప్పుడిగ తెగదెంపులయినట్టే. ఇక ఇచ్చుకం పుచ్చుకం దగ్గర రాజీ కుదుర్తలేదు. ఆ పొల్ల- మీ కిచ్చేదేం లేదు. మొగడయినందుకు ఎంతో గొంత నా పేర్న పంపిండు. తిన్నా, తాగినా అక్కడిక్కడికి చెల్లు అంటది అది" అన్నాడు నర్సిగాడు.

"దానికి మనసు లేనప్పుడు పోనీరాదు. అది మంచిది కాదని చెప్తనే ఉంటివి. పార్ఖత్ చేసుకుంటే పాయేగదా" అన్నాడు విశ్వనాథం.



"పార్థత్ కాకుడు ఖాయమే దొర కాని అది ఏమీ ఇయ్యనంటది. ఈ మూడేండ్లు అది మస్తుగనే మూట గట్టింది. అది ఇక్క

## కొత్తగాలి...

**ఆలోచన కన్నా...**
**ఆచరణ మిన్న!**
**మందుపేరు వినగానే**
**రోగం తీరుట సున్నా!!**

*-తరిగొప్పుల విఎల్లెన్ మూర్తి,*
*హైదరాబాద్*

డున్నా తల్లిగారింట్ల ఉన్నా కమ్మగ పూటకో తీరు తినే. తీరైన బట్ట కట్టే. అది తిన్నా తాగినా, కట్టిన మనింటి పిల్లనే, కోడలేగదా అని ఆగవడ్తిమి. అదేమో ఇయ్యాల్ల మింగి మీసాలు దిద్దినట్టు- మావోడ్ని ఇడిసి ముల్లె కట్టుకొనిపోవట్టే. ఒక యాభైవేల సామాన్లే ఉంటయి దొర దానితాన. రంగుల టి.వి. ఉండే. వి.సి.ఆర్. ఉండే. కూలర్ ఉండే. సూట్‌కేస్‌ల నిండా తీరైన బట్టలుండే. అంతెందుకు దొర ఒక లక్ష రూపాయిల బంగారం దాని తానే ఉండే. అదేది ఇయ్యనంటది. మల్ల ఈన్ని ఇడిసి పెడ్తనంటది. ఈడు నా కొడుకు, ఇట్లచ్చి అట్ల మల్లా దుబాయ్ పోతానంటే ఇది ఈ మాట అనకపోను. కాని ఈడు ఇగ మల్ల బోను. ఇక్కణ్ణే ఏదన్న దుకాణం పెట్టుకుం టనంటడు. అంటే ఈడు ఇన్నొద్దులు బంగారు గుడ్లు పెట్టు బాతు. ఇప్పుడు ఎందుకు పనికి రానోడు. అందుకే అది ఉన్నంత దొబ్బి, ఈణ్ణి ఇడ్సి పెడ్తనంటాది. ఇది న్యాయమా దొర నువ్వే చెప్పు"

విశ్వనాథంగారు ఆలోచనలో పడ్డారు.

"మన కండ్ల ముందు పుట్టిన పొల్ల గాండ్లు గిట్లా తెలివి మీరవట్టిరి గదా. పానం ఉండవట్టక నీతోని చెప్పుకుందా మని ఇట్ల వచ్చిన దొర" అన్నాడు నర్సి గాడు.

మనసులో ఉన్నదంతా చెప్పుకున్నట్టు లేదు. అందుకని మళ్లీ అందుకున్నాడు. "నా కొడుకు ఆ దేశంగాని దేశంల తిని- తినక- దినాం రాత్రి రెక్కల కష్టంతో పంపిన పైసలవి. నాలుగేండ్లు కష్టపడితే ఓ పదేండ్లు మారాజులాగా బతకవచ్చని దేశంకాని దేశం పాయే. పడరాని పాట్లు పడి పైసలు పంపె. పంపిన పైసలు మా దగ్గర ఉంటేంది, దాని దగ్గర ఉంటే ఏంది. అది పరాయి పిల్లయినా మన పిల్ల అను కుంటిమి. కాని అదిట్ల మమ్మల్ని నట్టేట ముంచుతదని కలలో కూడా అనుకోలే. అందుకే అంటరు. పైసా పైసా ఏం జేస్తి వంటే... పానం లాంటోల్లని పగజేస్త... అన్నదట. అన్నట్లే అయింది" అంటూ తల పట్టుకొని కూర్చున్నాడు నర్సిగాడు.

విషయమంతా వివరంగా అర్థమ య్యింది విశ్వనాథంకు.

"ఇప్పుడేం జెస్తమంటవు" అని అడిగాడు విశ్వనాథం.

"ఏంలేదు దొర, గిట్ల అన్యాలమై పోతి మని నీతోని చెప్పుకొస్తి. ఈ యాల్ల మావోడి ఇడుపు కాగితం పంచాయితీ ఉన్నది. దయగల మారాజులు- నలుగురు పంచులు మాకు న్యాయం జరిగేటట్టు మాకు న్యాయం జెప్పాల. మీకు చెప్పటం తటోన్ని గాను. చెప్పిందంతా నా మన సుల బాధ మీకు చెప్పాలనే. న్యాయం జెప్పే మారాజులకు అన్ని సంగతులు కులాసగ తెలిస్తేనే న్యాయం ఎటుదిక్కున్న దని తెలుస్తది. అందుకే యిదంతా చెప్పు కొస్తి దొర" అన్నాడు నర్సిగాడు.

జనం ఈ మధ్య కులపంచాయతీలు కా దని, స్టేషన్ల చుట్టూ, కోర్టు కచేరీలు తిర గడం నేర్చుకున్నారు.

కుల పంచాయతీలు కులంల తెగపోతే ఊరి పంచాయతీలో పెట్టి న్యాయం కోరడం రివాజు. నర్సిగాడు కోడలి గడుసు తనం లౌక్యంతో కులపంచాయతీ ఊరి పంచాయతీగా మారింది.




తిని మూతి తుడుచుకుంటున్న బక్కన్నతో "నర్సిగాడు కొడుకు పంచాయతీ ఎటు తెగక ఊల్లె పంచాయితీ పెట్టిండు. అందర్ని రమ్మని యింటింటికి చెప్పిపోయిండు. జర అటుదిక్కు ఒకపారి పోయి కనిపించిరా. మల్ల రాకుంటే- ఇంటికచ్చి పిల్సినా రాకపోయే అని అంటరు" అంది భూదేవి.

"ఎక్కడి పనులక్కడ పడి నా బతుకే పంచాయతీ తీరున్నది. ఇంకా నేను పెద్ద మొగోని తీరు పంచాయతీల వోయి కుసోన్న" అన్నాడు బక్కన్న ఎటకారంగా.

"పనులెప్పుడూ ఉండేయే, ఊరిమీదున్నం మనిషికి మనిషికి తోడు. ఊరి మీదున్న నర్సిగాడి కులపోల్లందరూ ఈ ఊల్ల పనిలేదని కొందరు, ఉన్న పని చేసుడు పసందులేదని కొందరు ఏదైతేనేం అందరూ ఎదలాపురంలా వోయి ఉండవట్టిరి. నర్సిగాని ఇల్లు- యింకా రెండు మూడిండ్లు తప్ప ఆ కులపోల యిండ్లే కరువాయే. అందుకే అందర్ని పేరు పేరున అడిగి, ఇల్లిల్లూ తిరిగి అచ్చిన కష్టంకు న్యాయం జెప్పమని మరీమరీ యింటికచ్చి చెప్పిపోయిండు. పోకుంటే మర్యాదగుండది. మనకు మనం మాట ఆసరా ఉంటేనే మంచిది. కాదని కోర్టు కచేరీలు మనతో నవుతయా. ఎల్లిరా పనెప్పుడు ఉండేదే" అంటూ మొగడికి ఇగరం జెప్పింది భూదేవి.

"అవ్‌గని నువ్వనేదాక నాకు తట్టలేదు. నర్సిగాడి కులపోల్లు మన ఊల్లె లేనట్టే అయింది. అందరూ ఎదలాపురంల కూలి పని చేసుకుంటున్నరు. పునాదులు తవ్వుడు, పిల్లర్లు తవ్వుడు, స్లాబ్‌లకు ఛత్‌లు వోసుడు అన్ని యిసుంటి పనులే అనుకో, అక్కడవోయి మోటు కష్టం జేసి మంచిగనే బ్రతుకుతున్నరు" అన్నాడు.

"అవే పనులు కావు, యింకా బందియాఫిసుల పనులన్నీ ఈల్లె జెస్తరటగదా, మొరీలు దీసుడు, సడకులు ఊడ్సుడు, పెంటకుప్పలు ట్రాక్టర్లకు ఎత్తుడు, సాప్ సఫాయి పనులన్నీ ఈల్లకే యిస్తదట సర్కారు. ఆ పనులు జెస్కుంట ఎదులాపురంల మంచిగానే బతుకుతున్నారట ఆల్లు" అంది భూదేవి.

"ఎవల్ల ఏం పని జేస్తున్నది తెలుస్త లేదు. ఆ మధ్య ఎదులాపురంల మన గాండ్ల మల్లయ్య మనవడు రిక్షాతొక్కుకుంట కనిపించే. చూస్తేనే ఎట్లనో అనిపించింది" అన్నాడు బక్కన్న.

"ఏం జేస్తాం మనమంతా తయారుగ నూనెలు కొనవడ్తిమి. ఆల్ల గానుగలు మూలవడె. బ్రతికినన్ని రోజులు మల్లయ్య ఎట్లనో గానుగ, మొద్దుని- నమ్ముకొని బ్రతికె. పని నడవనపుడు రిక్షా తొక్కవడ్తది- యింకెదన్నా చెయ్యవడ్తది. పొట్టతిప్పలకు ఏ పనైతే ఏంది" అంది భూదేవి.

"ఎవలి కిస్మత్ వాల్లది- అచ్చేటికి మనమేం జేసి బ్రతుకుతామో మనకు తెల్లవది. నేనట్ల అడ్ల శ్యాంరావు దాతిల కెల్లస్త. అట్లనే కమ్మరి సుదర్శన్ కొలిమికి పోయి అస్త" అంటూ ఇన్ని పిడకలు, బొగ్గులు మూట గట్టుకొని యింట్లోంచి బయలుదేరాడు బక్కన్న- నాగలిని సరిచేయించి, కర్రుని సానబెట్టించుకోడానికని.

వడ్రంగం చేసే శ్యాంరావు వడ్లదాతి



శుభ్రంగా ఉంది. ఎప్పుడు నలుగురు మనుషులతో, పిచ్చపాటి మాటలతో దాతి నిండా యిల్ల పొల్లంగా పడి ఉన్న చెక్క పే ళ్లతో కళగా ఉండే అతడి వాకిలి శుభ్రంగా ఉంది. పనిముట్లు చూరులో చెక్కి ఉన్నాయి.

ఈమధ్య బక్కన్న లాంటి రైతులు ఎప్పుడు వచ్చినా వడ్ల దాతి ఒకవైపు వెల వెలబోయి, తను ఉండాల్సిన తీరులో కాకుండా శుభ్రంగా ఉంటుంది.

ఊళ్లో ఎవరికి ఎక్కడ కాలక్షేపం కాక పోయినా వాళ్లు వడ్ల దాతికో, కమ్మరి కొలిమి దగ్గరికో వెళ్లేవారు. అలాంటిది ఈ మధ్య వడ్ల దాతిలో వడ్ల శ్యాంరావుకు పనే ఉండటం లేదు. ఉన్న అరకొర పనిని చెయ్యటానికి అతడు పెద్దగా యిష్టపడటం లేదు. ఊపిరి సలపనంత పని ఉన్నపుడు ఎంతో తృప్తిగా ఉండేది. ఊరి జనం అంతా తన వాకిట్లో కొలువుదీరి, కబుర్లు చెప్పుకుంటూ- 'ముందు నా పని చెయ్యి అంటే నా పని చేసిపెట్టు' అని అంటుంటే తనెంత పనివాడో, తనెంత అవసరమయి నోడో అనిపించి ఎంతో తృప్తిగా ఉండేది. ఎంత పని చేసినా అలసట ఉండేది కాదు. అలాంటిది యిపుడు- ఎప్పుడో ఒక సారి వచ్చే ఈ అరకొర పని చేయాలనే అనిపించటంలేదు అతడికి.

"శ్యామన్న- ఓ శ్యామన్నా" అంటూ పిలి చాడు బక్కన్న.

"ఊల్లె పంచాయతీ ఉన్నదట గదా అట్ల పోయిండు" అంటూ ఓ ముసలిగొంతు సమాధానం రావడంతో అటునుంచి కమ్మరి కొలిమివైపు కదిలాడు.

కమ్మరి కొలిమి పల్లెలో ఎందుకైనా మంచిదని ఊరి చివర్లో, వీలయితే ఊరికి దగ్గరగా పారే ఏరు ఉన్నచోటనో ఉంటుంది కీడెంచి మేలెంచమని. అన్నీ పూరిళ్లు. కమ్మరి కొలిమంటేనే నిప్పు. నిప్పుతో చెలగాటం ఎందుకని కమ్మరి కొలిమి ఊరి చివరి నీటి సరిహద్దున ఉంటుంది.

కమ్మరి కొలిమిలో ఎవరూ లేరు. కొలిమి బూడిదలో ఒక ఊర కుక్క పడు కొని ఉంది. అలికిడికి ఆ కుక్క ఒక్కసారి మగతగా కళ్లు తెరిచి చూసి, వచ్చింది కొలిమి యజమాని కాదని గ్రహించిందేమో మళ్లా అలాగే పడుకుంది.

వచ్చిన పని ఒక్కటీ కాలేదన్న ఒకింత విసుగుతో బక్కన్న వెంట తెచ్చిన బొగ్గు లను అక్కడే ఒక మూలన పోసి తువ్వాలు దులుపుకొని భుజంపైన వేసు కొని పంచాయితీ వైపు కదిలాడు.

ఊరి చింతలతోపు దగ్గర కొత్తగా కట్టి వదిలేసిన ఆంజనేయస్వామి గుడి దగ్గర పంచాయతీకి అప్పటికే చాలామంది గుమిగూడి ఉన్నారు. పంచాయతీ యింకా మొదలు కాలేదు. ఊరి పెద్దలు యింకా రాలేదు. పంచాయతీ ఎవరిదో వాళ్లు అందరూ వచ్చినట్లు లేరు.

అందరూ ఒకచోట కలిసారు. కాబట్టి గలగలా మాట్లాడుకుంటున్నారు. కొందరు పంచాయతీ విషయమై ఆరాలు తీసి మాట్లాడుకుంటున్నారు. కొంతమంది తమ కష్టం సుఖం ఒకరితో ఒకరు చెప్పుకుంటు న్నారు.

బక్కన్న కళ్లు వడ్ల శ్యామన్న కొరకు, కమ్మరి కిష్టన్న కొరకు ఆతురతగా వెదుకు తున్నాయి.

"ఏం బక్కన్న పటేలా ఏందో బైరి బైరి చూపులు చూడవడ్తివి" అన్నారు ఎవరో.

"ఆ ఏంలేదు, పనివడి అట్ల శ్యామన్న యింటికెళ్లింటిని. అతన్తోని పనేమో సక్త గున్నది. శ్యామన్న ఈ మధ్య బాడిషె పట్టుడే లేదాయే. ఇక శ్యామన్న యిట్లుంటే, కమ్మరోల్ల కిష్టన్న దగ్గరికెల్తె కొలిమిల కుక్క పండున్నది" అంటూ చెప్పుకొచ్చాడు

బక్కన్న.

"మన పనోల్ల సంగతంతా గిట్లనే ఉన్నది. పంటల పనుల తీరు మారిపో యింది. ఎటునుంచి ఎటువోయి పనోల్లకు పనులే లేకుంటాపోయే" అంటూ మారు తున్న కాలం- మారుతున్న పనివైనం చెప్పుకొచ్చాడు ఒకాయన.

"ఈ ఊల్లె ఎవల్ల పనులు సరిగున్న యని, ఎవలకు చేతినిండ పనున్నదని, గాండ్ల మల్లయ్య కుటుంబం ఎప్పుడో దేశాలు వట్టి వోయిరి. శాలోల్ల మగ్గాలు మూలవెట్టి- మిల్లు బట్టలు చంకనేసుకొని అంగడ్లు చేయవట్టిరి. కుమ్మరోల్లనైతే ఎవలూ దేకకుంటయిరి" అంటూ కులవృత్తుల మార్పిడి గురించి చెప్పుకొచ్చాడు దేవయ్య.

"జమాన మారిపోయింది. ముందు కుమ్మరోడి కుండ లేకుంటే ఏపని అయ్యేది కాదు. లగ్గంల కూరాడుకుండ, ఐరేణి కుండలు గరిగెబుడ్డీ లేకుంటే లగ్గమయ్యేది కాదు. మనిషి చావులో, పెళ్లిలో కుమ్మరి వాడు ముందుండెటోడు. అసుంటి కుమ్మ రోల్లు నేడు మన ఊల్లె శాస్త్రంకు ఒక్కడు కూడ లేదు" అన్నాడు బక్కన్న.

"చేస్తందుకు పనిలేక, ఉన్న పనికి విలువ లేక కుమ్మరోల్లు పట్నం దిక్కుపో యిరి. అక్కడ ఏ కూలీ నాలో చేసుకొని బతుకవట్టిరి" అన్నారొకరు.

"ఊరి మీద ఎవరు ఎటూ పోయినా చాకలి, మంగలిల పని మాత్రం అట్లనే ఉన్నది. యింకా చెప్పాలంటే పని పెరిగిం ది అల్లకు. ఏమంటవ్ లింగన్న, నిజమా అబద్ధమా" అంటూ చాకలి లింగన్నను అడిగాడు దేవయ్య.

"పనైతే పెరిగింది. ముందు ఉతుకుడే ఉండే. యిప్పుడు ఏసుంటోడికి యిస్త్రీ బట్టలు గావాల. యిస్త్రీ జేసుడు పెరిగింది" అని ఒప్పుకున్నాడు లింగన్న.

"నువ్వేమంటవే ఎంకన్న కాక గడ్డాలు, కటింగులు ఎప్పుడు నీ చేతినిండ పనే. మా అసుంటోల్ల యింటికచ్చి గడ్డం తీయ ఎంకన్న మామకు తీరికనే ఉండదు, అవునా" అంటూ దెప్పి పొడిచారొకరు.

"సత్యమే, ముందు ఏదో గుండు గొడ్తే అయిపోయేది. ఇప్పుడట్ల కాదు. ఎన్నో తీరుల బాల్ కత్తిరించుడు. నాకయితే ఏం తెల్వదు. అన్నింటికి అవ్ అంట, చేసేది చేస్త. పసందయితే మల్ల అస్తడు, లేకుంటే లేదు. పని మాత్రం పెరిగింది. ముందు మనిషి ఎప్పుడో వారం పది రోజులకు గడ్డం తీసుకుంటుండే. యిప్పుడట్ల గాదు అంగడికి పోవాలన్నా గడ్డం, పట్నం పోవా లన్న గడ్డం, చుట్టాలింటికి పోవాలన్న గడ్డం తీయాల్సిందే. దాంతోని మా పని కొంచం పెరిగిందనే చెప్పాల" అన్నాడు ఎంకన్న.

## పిల్లవాడి కోరిక

పళ్లసందుల్లో ఫిల్లింగ్‌కోసం తనదగ్గరకు వచ్చిన ఓ బాలుడ్ని డెంటిస్టు ఇలా అడిగాడు, 'నీ పళ్ల సందుల్ని దేనితో నింపమంటావ్?'

దానికా కుర్రాడు తడుముకోకుండా, 'చాక్లెట్‌తో' అన్నాడు.



## కొత్తగాలి...

**వానకు రాలిన పువ్వులు**
**వరండా అంతా పరుచుకున్నాయి**
**విచ్చుకున్న ఆశలు**
**చిరునవ్వులు చిందించాయి**

—జెయమ్, రాయగడ

"ఏదైతే ఏంది? మనిషికి పని ఉండాల. పని లేకుంటేనే ఫజీత్. పని లేనపుడే మనిషి ఊరిడిసి పెడ్తడు. కాదంటే మరీ ఆశపోతైతే ఈ దేశమే యిడ్సి పెడ్తడు. మనిషి ఏం జేసినా పొట్టకోసం- కాదంటే పైస కోసం. ఇగో యిపుడీ ఫజీత్, పరే షాన్ పంచాయతీ అసుంటిదే. ఆ నర్సి గాడి కొడుకు ఈ మంగలి ఎంకన్న తీరు, చాకలి లింగన్న తీరు పని ఉంటే వాడు దేశాలు పట్టి ఎందుకు పోను. ఇప్పుడు పంచాయతీ ఎందుకుండు" అంటూ ప్రస్తుత పంచాయతీకి పనికి ముడివేసి చెప్పాడు దేవయ్య.

పంచాయతీ ఎంతకు మొదలు కాదు.

పంచాయతీల కచ్చి నేను మాట్లాడ అంటది నర్సిగాడి కోడలు. "పెద్దలోకులు, ఊరోళ్లు అందరూ వచ్చిండ్రు. ఊరిమీద పంచాయతీ అని చెప్పి పిలిస్తిమి రా బిడ్డ. నీ కష్టసుఖం నువ్వు చెప్పుకో. మా కష్టం మేం చెప్పుకుంటాం. వాల్లు ఏం న్యాయం చెప్తే అది ఇనుకుందాం" అని నర్సిగాడు ఎంత బతిమిలాడినా నర్సిగాడి కోడలు శ్రీదేవి రానంటే రానంటది.

కులం పంచాయతి కన్న ఊరి మీద పంచాయతీ అయితే నలుగురు తెలిసినోళ్లు న్యాయం చేస్తరంటే అదీ వీలుకాలేదు నర్సి గాడికి.

అందరూ ఏకగ్రీవంగా శ్రీదేవిదే తప్పని చెప్పి ఎవరి దారిన వారు వెళ్లిపోయారు. నర్సిగాడికి కొంతలో కొంత ఊరట కలి గింది. కాని ముల్లె చేతపట్టుకున్న కోడలిని ఎలా ఒప్పించి ముల్లె రాబట్టాలనే ఆలోచ నతో ఇంటి దిక్కు ముఖం పట్టాడు.

★ ★ ★

మరో సంవత్సరం గడిచిపోయింది. ఆ ఊరు వలస విధానంలో దినదినాభివృద్ధి పొందుతోంది. ఊరు పూర్వంలా లేదు. వరుసగా కొన్నేళ్ళబట్టి ఉన్నట్టు కూడా లేదు. ఈ యేడు ఉన్నట్టు నిరుడులేదు, నిరుడు ఉన్నట్లు ఆ ముందుటేడు లేదు.

పూర్వం ఎవరి పని వాళ్ళకు ఉండేది. ఎవరిపని వాళ్ళు బాధ్యతగా చేసే వాళ్ళు. సంతోషంగా జీవించేవాళ్ళు.

ఆ రోజుల్లో....

కొంత దొరల దౌర్జన్యం ఉండేది.

కొంత శ్రమ దోపిడి ఉండేది.

కొన్నాళ్ళపాటు పరాయి పాలనలో ఉన్నామన్న భావన అరికాలిలో ముల్లులా బాధించేది.

ఇవి తప్పితే అనాటి మనిషికి సుఖముం డేది. శాంతి ఉండేది. అన్నింటికి మించి తృప్తి అనేది ఉండేది. ఆ జీవితంలో పరు గులు లేవు. ఉరుకులు లేవు. అంతస్తుకు మించిన ఆశలు, కోరికలు ఉండేవి కావు.

దినమంతా ఉన్న వృత్తిని సంతోషంగా, యిష్టంగా, వృత్తినే దైవంగా భావించి కష్ట పడి చేసేవాడు. ఉన్నంతలో యింత తిని, హాయిగా కంటినిండా నిదుర పోయేవాడు.

ఆనాటి మనిషి శారీరకంగా, మానసి కంగా ఎంతో ఆరోగ్యాన్ని కలిగి ఉండే వాడు. ఆనాటి పరిస్థితులు, కాలం అలాం టివి మరి.

ఇప్పుడు కాలం మారింది.

ఇప్పుడా ఊళ్లో పంతులు రాని బడి ఉంది.

పని చెయ్యని (మార్) ఫోనుంది.

ట్రాన్స్‌ఫార్మర్ కాలిపోయిన కరెంటు పో

ల్లున్నాయి.

ఎప్పుడంటే అప్పుడు బస్తీకి వెళ్లటానికి కంకర రోడ్లున్నాయి.

అడపా-దడపా వచ్చే ఆర్నెల్లు నడిచే బస్సులున్నాయి.

ఎప్పుడూ బిచ్చగాళ్ళకు, గాడిదలకు విడిదినిచ్చే కమ్యూనిటీ హాలుంది.

వీధికి నాలుగు పార్టీలున్నాయి.

ఇంటికో ఏంటిన్నా ఉంది. వీధికో డిష్ ఉంది.

పశువు చస్తే తీసేవాడు లేక కావలసినంత దుర్గంధముంది.

ఎర్రజెండాలతో చేతబడి చేయబడిన బంజరయిన భూములున్నాయి.

ఫ్యాక్టరీల కోసం, ఫ్లాట్‌ల కోసం కంచె వేసి వదిలేసిన భూములున్నాయి.

ఆ చిన్న ఊళ్లో వేళకాని వేళ పాలు దొరకవు. మజ్జిగ దొరకదు కాని 'మందు' దొరుకుతుంది.

ఇంటికో క్రికెట్ బ్యాట్ ఉంది-బాలుంది.

ప్రతి కుర్రాడి కళ్ళలో, జేబుల్లో 'సచిన్' బొమ్ముంది.

అలాంటి ఊళ్లో బక్కన్న లాంటి పేద రైతులు యింకా మొండిగా బ్రతుకీడుస్తున్నారు. విశ్వనాథంలాంటి వాళ్ళు పల్లెల మీద మమకారం చావక ఆశతో ఎవరికోసమో, దేనికోసమో ఎదురు చూస్తున్నారు.

విశ్వనాథం పిల్లలు అమెరికాలోనే ఉన్నారు. వాళ్లకు ఇప్పట్లో యిటు వచ్చే ఆలోచన ఉన్నట్లు లేదు.

నర్సిగాడి కొడుకు పూలాజీ దుబాయ్ లోనే ఉన్నాడు. నర్సిగాడు కోడలు శ్రీదేవి అత్తింటిని వదిలి పుట్టింట్లో ఉంటుంది.

బక్కన్న కొడుకులు బక్కన్న అనంతరం ఏ ఫ్యాక్టరీకో, ఇళ్ళస్థలాలకో భూమి అమ్మాలని రోజుకో రకం కల కంటున్నారు.

బస్తీలో కాపురాలు పెట్టి చిన్న ఉద్యోగాలు చేస్తున్న వాళ్లు ఖర్చుకు తట్టుకోలేక పిల్లలు చదువుకు రాగానే కుటుంబాన్ని తిరిగి పల్లెకు తరలిస్తున్నారు. ఉన్న ఊళ్లో యింటికి దగ్గర సర్కారుబడిలో చదువుకుంటారని తల్లి దండ్రులకు చెపుతున్నారు.

వారానికొకసారి వచ్చి వారం రోజుల 'కుతి' తీర్చుకొని పోతున్నారు.

పల్లెలోంచి పోయిన వాళ్లు కిరాణ దుకాణాల్లో, బట్టల కొట్లో, స్టేషనరీ దుకాణాల్లో, వెల్డింగ్ కార్ఖానాల్లో, మందుల షాపులు, డాక్టర్ల క్లినిక్‌లలో, హోటళ్లలో... యిలా రకరకాల వృత్తుల్లో బ్రతుకుతున్నారు.

అడుగుతీసి అడుగు వేస్తే డబ్బు ఖర్చయ్యే లోకం అది. పైసా ఉంటే కొండ మీది కోతినైనా కిందకు దించి ఆడించవచ్చని చెప్పే పట్నం అది. పైస లేకుండ నిజంగానే కష్టాల్లో ఉండి సహాయం అడిగితే కొత్త రకంగా అడుక్కునే వాడనే లోకం అది. అన్నీ తెలిసి ఉండి యువతరం దీపంపై పడే శలభాల్లా నగరం మోజులో పడిపోతోంది.

ఆ రోజు విజయదశమి.

దసరా పండగ. ఎక్కడెక్కడో దూర ప్రాంతాల్లో ఎక్కడో ఉద్యోగం చేసుకునే వాళ్లు సహితం ఆ ఒక్కరోజు కోసం తమ తమ ఊళ్ళకు రావడం, ఊళ్ళలో మిగిలి ఉన్న సంస్కృతికి నిదర్శనం.

ఉదయం నుంచి సాయంత్రం వరకు ఉల్లాసంగా గడిపి పిండి వంటలతో కమ్మగా తిని త్రేన్చి కొత్త బట్టలు వేసుకొని పాలపిట్ట చూడ్డానికి గుంపులు గుంపులుగా వెళుతున్నారు అందరు.

ఎవరికి చూసినా కొత్త బట్టలే. ప్రతి ఒకరి మోహంలో సంతోషం, ఉల్లాసం.

పాలపిట్టను చూసారు. ఇక తరువాతి కార్యక్రమం జమ్మిచెట్టుకు పూజచేసి జమ్మి ఆకును, రైతు ముఖ్యంగా పండించే జొన్న ఆకును బంగారంగా భావించి యింటికి తెచ్చుకొని పెద్దలకు, మిత్రులకు, పిన్నలకు

యిచ్చి ఒకరికొకరు శుభాకాంక్షలు చెప్పుకుంటారు. అది నాటి నుంచి నడుస్తున్న ఆచారం. ఆ ప్రాంతంలో జమ్మిచెట్లు లేవు. ఇక ఉండేదంత జొన్న. అంతేకాని యీ ఏడు ఎక్కడా మచ్చుకు మందులోకి కూడా జొన్న ఆకు కనిపించలేదు. వాళ్లకి 'పాలపిట్ట' వేటలో అందరూ ఒక దారిలోనే వెళ్లడం ఆచారం. ఆ వెళ్లిన దారిలో ఎన్నో చేన్లు బీడువడి ఉన్నాయి. కొన్ని చేన్లు పత్తి పంటలతో ఉన్నాయి. ఎక్కడ ఒక జొన్న కర్ర లేదు.

"ఓర్నీ ఈయేడు బంగారం లేనట్లే. ఏం పెట్టి దండం పెట్టుడిగ" అంటూ ఒకర్నొకరు తర్కించుకుంటున్నారు.

"కొత్త బట్ట లేకున్నా దసరా అవుతది. కమ్మగ, తియ్యగ తినకున్నా దసరా అవుతది కాని గీ బంగారం లేకుంటే దసరా ఎట్లయితది"

"అరె మనమే అందరం వరిబువ్వకు మరిగి జొన్నలిడిసి పెడ్తిమి. పైసలకు మరిగి పత్తి యెంట పడ్తిమి. ఇంక ఆ 'బంగారం' ఎవలు పండిస్తరు" అన్నాడొక యువకుడు బాధగా.

"మన పల్లెల్నే ఒక జొన్న కర్ర దొరకకుంటే మనకే సిగ్గుచేటు" అన్నాడొక చదువుకున్నవాడు.

"ఈ మాత్రం దానికే మనం ఉరికి ఉరికి యీ పల్లెకస్తిమా" అన్నాడింకొకడు. దానికి ఎవరు బాధ్యులో గుర్తించనివాడు.

అందరూ నీరసంగా ఊరివైపు తిరుగు ముఖం పట్టారు. అంతలో ఎవరో చెప్పారు విశ్వనాథం చేలో జొన్నపంట మస్తుగుందని. అందరూ చలో అంటే ఛలో అనుకుంటూ విశ్వనాథం చేను వైపు పరుగెత్తారు.

విశ్వనాథం అందరూ చీకటివేళ చేను దిక్కు రావటానికి ఆయాస పడ్తారని ముందే ఆకు కోయించి గుడిదగ్గర పెట్టి ఒక మనిషిని పురమాయించాడు, వచ్చిన ప్రతి ఒకరికి యింత యియ్యమని.

జొన్న ఆకు బంగారంతో మళ్లీ దసరా ఊపందుకుంది. పగవాడిక్కూడా అన్నీ మరిచి బంగారం యిచ్చి చిరునవ్వుతో కౌగలించుకునే పండుగ దసరా. ఒకరింటికి ఒకరు వెళ్లి పలకరించుకుంటున్నారు. పెద్దల కాళ్లకు దండం పెడుతున్నారు. ఊరంతా సందడిగా ఉంది. ప్రతి యిల్లు అన్ని వయసుల వాళ్లతో కళకళలాడుతోంది. నిన్నటివరకు ముసలివాళ్లు పిల్లలు తప్ప యింకొకరు లేని ఊరు నేడు పడుచువాళ్లతో రెపరెపలాడుతుంది. పలకరింతలు, నవ్వులు, తుళ్లింతలతో ఊరంతా కోలాహలంగా ఉంది.

విశ్వనాథం గారిల్లు పెళ్లి వారింటిలా సందడిగా ఉంది. ఊళ్లో వాళ్లందరూ విశ్వనాథం గారికి బంగారం పెట్టి శుభాకాంక్షలు తెలిపి పోటానికి వచ్చారు.

జానకి వచ్చిన వాళ్లను సాదరంగా ఆహ్వానిస్తోంది. అందరూ కింద పరిచిన పెద్ద కార్పెట్ పై కూర్చుంటున్నారు. విశ్వనాథంగారు కూడ కిందనే కూర్చున్నారు. ఒక్కొక్కరే వచ్చి జానకికి, విశ్వనాథంకు బంగారం పెట్టి కొంతమంది కాళ్లకు దండం పెడుతున్నారు. అలా చేసిన వారిని వద్దని వారిస్తున్నాడు విశ్వనాథం.

తనకు బంగారం పెట్టినవాళ్లకు తిరిగి తాను తన బంగారం యిచ్చి నమస్కరిస్తున్నాడు విశ్వనాథం. పెద్దా చిన్నా తేడా లేదు అతడి దగ్గర. ఎక్కువ తక్కువ తేడాల్లేవు. బక్కన్న, భూదేవిలు వచ్చి విశ్వనాథంకు దండం పెట్టారు.

వచ్చిన ఆడవాళ్ళందరికీ గిన్నెలో అమర్చిన స్వీట్ అందిస్తోంది జానకి. కొందరు మొహమాటానికి పోయి వద్దంటే "పండగపూట యింటికొచ్చి, నోరు తీపి చెయ్యకుండా పోతారా" అంటూ ప్రతి ఒకరికి







తీపి అందిస్తోంది స్వయంగా.

విశ్వనాథం వచ్చిన వాళ్ళ చేతికి సెంటు రాసి వక్క తినే వాళ్లకు వక్క, బీడి తాగే వాళ్లకు బీడి, సిగరెట్ తాగే వాళ్లకు సిగరెట్ తీసుకొండని అంటున్నాడు. కాని ఎవరూ ఏమీ తీసుకోవడం లేదు. విశ్వనాథం అందర్ని కూర్చోమన్నాడు.

"నేడు మీరంతా యిలా మా యింటికి రావడం ఎంతో ఆనందంగా ఉంది. కాని నేడు కనిపించిన మీరు చాలామంది మల్లా వచ్చే ఏడాది దసరా వరకు కనిపించరు అంటే నాకు బాధగా ఉంది. ఈ ఊరు మీది. ఈ పల్లె మీది. ఇక్కడి భూమి మీది. ఇక్కడ నీ తండ్రి అనే కాండం ఉంది. నీ తల్లి వేరు యిక్కడే ఉంది. కాని మీరంతా ఎక్కడెక్కడో పోతున్నారు. నా కొడుకులు నా దగ్గర లేరు కాని నేను యిక్కడే ఉంటాను. నా మూలాలు, వేళ్లు యీ భూమిలో ఉన్నాయి.

కాలం మారింది. మనకు ఎన్నో సౌకర్యాలున్నాయి. వాటితో మనం మన పల్లెల్ని బాగు చేసుకుందాం. మీరంతా రండి యిక్కడికి. మీరొకచోట, మీ భార్య పిల్లలొకచోట. ఇది కాదు మన సంస్కృతి. మీలో ప్రతి మనిషికి భూమి ఉంది. కాని దానిపట్ల ప్రేమ లేదు. మమకారం లేదు.

మనం యీ పల్లెల్లో ఉంటూ ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయం చేద్దాం. ఈ మార్కెట్‌ను మన కాళ్లకాడికి రప్పించుకుందాం. పత్తిలాంటి 'గులామ్ గిరి' పంటలొద్దు. మనం బస్తీకి గంటలో వెళ్ళొచ్చే దూరంలో ఉన్నాం. మనం కూరగాయలు పండిద్దాం. కేవలం ఒకటో రెండో రకాల పంట మాత్రం వేద్దాం. మన పంట దిగుబడితో యీ మార్కెట్‌నే మనం శాసించవచ్చు.

బస్తీలకు ఊడిగం వద్దు. నేడు పల్లెల్లో దొరకని వినోదం అక్కడేమీ లేదు. మనకు టీవీలున్నాయి. వి.సి.ఆర్.లున్నాయి. డిష్ లున్నాయి. దాంతో మనం యిక్కడే కావలసిన వినోదాన్ని పొందవచ్చు.

కులవృత్తులు పోతే పోనీయండి. చేసుకుంటాననే వాళ్లను మనం ప్రోత్సహిద్దాం. కులవృత్తులను ప్రోత్సహించి మన గ్రామాన్ని మనం స్వయం పోషకం చేసుకుందాం.

ఆధునిక పనిముట్లు వచ్చాయి. ఒకటి రెండు పంటలను ఎంచుకొని కో ఆపరేటివ్ పద్ధతిలో పండిద్దాం.

మారుతున్న కాలంతో మనం మారి అభివృద్ధిని సాధించాలి. కాని సమస్యల నుంచి పారిపోవడం పద్ధతి కాదు.

మనం సంఘటితం అయితే మనం పండించే పంటలకు మనమే ఫ్యాక్టరీలు పెట్టుకోవచ్చు. వస్తువులను మార్కెట్ చేయవచ్చు.

మన పత్తి పంటతో నడిచే కాటన్ మార్కెట్, జిన్నింగ్ ప్రెస్సింగ్, ఆయిల్ సీడ్ ఫ్యాక్టరీలు, నూలు మిల్లులు, బట్టల మిల్లులు మనం కాదంటే ఎలా నడుస్తాయో చూద్దాం.

కన్నతల్లి, జన్మభూమి ప్రేమలో ఎన్నడు లోటుండదు. లోపముండదు. మీరు అందరూ ఈ విజయదశమి రోజున నేను చెప్పిన దాని గురించి ఆలోచించండి. నేడు పడ్డ ఆలోచనా బీజాలు రేపటికి కొంతయినా మొలకెత్తుతాయని ఆశ పడుతున్నా. రేపు మనం మళ్లీ కలుసుకుందాం" అంటూ తన సుదీర్ఘ ఉపన్యాసాన్ని ముగించాడు విశ్వనాథం.

అందరి మెదళ్లలో ఆలోచనా బీజాలు పడ్డాయి. అందరిలో ఏదో ఎన్నడూ తెలియని కదలిక మొదలయింది. నేడు కదులుతున్న ఈ ఆలోచన బీజం రేపటి వెలుతురు కోసం ఎదురు చూస్తుంది.

బక్కన్న పొరుగూరు పాలివాళ్ల చావుకు

పోయి రెండు రోజులు ఉండిపోయాడు, అతడి మనసంతా పంట మీదనే ఉంది. ఇలా రెండేసి రోజులు చేనును చూడ కుండా అతడెప్పుడు ఉండలేదు. చేన్ల పంట ఉన్నపుడు ఎటుపోయినా చేను చూసుకొని పోయి, మళ్లా యింకోనాడు చేను చూసుకునే యింటికి వచ్చే అలవాటు బక్కన్నది. అతడి నడకలో బిడ్డను చూడడం కోసం తల్లి పడే ఆరాటం ఉంది. రెండు రోజులకే ఎన్నో రోజులుగా చేనును చూడకుండా ఉన్నట్టుగా ఉంది. రైతులు భూమికి ఉన్న బంధం అది.

చేనులో కాలు పెట్టడంతో ఆనందమ యింది బక్కన్నకు. కానీ పత్తి పంట ఎందుకో వడలిపోయినట్టనిపించింది. ఒక్కో చెట్టు పూర్తిగా వడలిపోయి, ఆకులు డీలా పడిపోయి, కిందికి వాలిపోయి కని పించాయి.

బక్కన్న ఏమయి ఉంటుందని పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు. ఏమయింది? తన పత్తి చేనుకేమయింది? ఏం తక్కు వైంది తన చేనుకు? ఇట్లా నిలువుగా వడ లిపోయింది. చేనంతా కలియ తిరిగాడు బక్కన్న. చెట్లు చాలా మట్టుకు వడలి వాలిపోయి కనిపించాయి.

ఎండకు వాడచ్చునుకున్నాడు. ఈ మాత్రం పొద్దటి ఎండకు యింత వడలి పోతే యింక సాయంత్రం ఎండకు ఏం కావాలి? ఎండకు తట్టుకోలేక యిట్లా అయ్యాయా లేక రోగమా... ఇదేం రోగం? ఇన్ని ఎరువులు, యిన్ని మందులు కొట్టినంక మళ్లా ఏం రోగ మొచ్చే? ఇంత మంచిగ చెట్టు ఎదిగి, పూత కాత ముందర యిదేం రోగం.

ఏమయినా పురుగుగాని ఉందేమో అని చెట్టును వేయి కళ్లతో పరీక్ష చేసి చూశాడు.

ఎక్కడా ఏం పురుగులేదు. కాండాన్నంత పరీక్షించి చూసాడు. ఎక్కడన్న కాండం

## కొత్తగాలి...

చిగురు వేస్తోంది
చిన్న ఆశ
నూరేళ్ల బతుకును
సాగించే శ్వాస

-డా॥ అయాచితం నటేశ్వరం శర్మ,
కామారెడ్డి

తొలిచే పురుగు కాండంలో ఉన్నదేమోనని. ఎక్కడా ఏమీలేదు.

బాగా వడలిపోయిన ఒక చెట్టును పీకి వేళ్లలో ఏమన్న వేరుపురుగు ఉందా అని చూసాడు. అక్కడ ఏమీ లేదు. బక్క న్నకేం అర్థం కాలేదు.

తిండి తిప్పలు మానేసి సాయంకాలం వరకు అలాగే చెట్ల మధ్య తిరుగుతూ గంట గంటకు చెట్లలో ఏమన్న మార్పు వస్తుందా అని చూస్తూ ఉన్నాడు. పొద్దు అడ్డం పడింది. ఎండ తగ్గింది. అయినా చెట్లలో ఎలాంటి మార్పులేదు. చీకటిపడే వరకు ఉండి అన్యమనస్కంగా యింటికొ చ్చాడు బక్కన్న.

పళ్లెం ముందు కూర్చున్నా, ఆకలవు తున్నా అన్నం సహించలేదు బక్కన్నకు.

ఒకటా రెండా తన తాహతుకు మించి లక్ష రూపాయలకు పైగా యిప్పటికి పెట్టు బడి పెట్టాడు. ఇప్పుడు యీ చెట్లన్నీ నిలు వుగా ఎండిపోతే తను ఏంకాను?

పడుకున్నా నిదుర రావడంలేదు బక్క న్నకు. ఏం జరిగింది ఎవరికీ చెప్పలేదు. తనలో తానే మదనపడుతున్నాడు. అర్ధరా త్రయ్యింది. వాతావరణం చల్లగయింది. కొద్దిగా చలిగా కూడా ఉంది. బక్కన్న మెల్లగా లేచి రాములు ఇంటికి వెళ్లి తలుపు తట్టి రాముల్ని లేపాడు. విషయం చెప్పాడు. అక్కణ్ణించి రాములుని తోడు



తీసుకొని గురువులు యింటికి వెళ్లాడు. అతణ్ణి కూడా లేపి విషయం చెప్పి బావు రుమన్నాడు బక్కన్న.

"ఇదేంది బక్కన్న... ఊకో ఎంతో ధైర్య స్తుడి వనుకుంటే గిదేంది ఇప్పుడేం జేద్దాం అంటవ్"

"నా పత్తి చేను ఎండకు వశపడక అట్ల యాల్లడపడ్డదేమో అని అనుమానం. ఇప్పుడు యింత సలి వెడుతున్నది. మంచు కూడా పడుతున్నది. ఏమనుకోక పోతే యిప్పుడెల్లి సూద్దాం. చేను ఎట్టు న్నదో ఒక్కణ్ణి పిసోనితీరు పొయ్యే ధైర్యం కాక యిట్లచ్చిన"

"ఎంత మాట బక్కన్న పా సుద్దాం. నువ్వన్న మాట కూడా నిజమే, సుద్దాం. యిప్పుడు చెట్టు నిగనిగలాడుకుంటలేసి నిలవడితే అది నీల్లు లేక వచ్చిన రోగమ నుకోవచ్చు. రేపు బండ్లు కట్టుకొని నీళ్లు పోద్దాం. నువ్వేం ఫికరు పెట్టుకోకు. నడు సూద్దాం" అంటూ గురువులు, రాములు రెండు పెద్ద టార్చిలైట్లు తీసుకొని బక్కన్న చేనువైపు నడిచారు.

చేను చేనంతా కలియతిరిగారు.

చేనంతా వడలిపోయి ఉంది. పగలు ఎట్లా ఉన్నాయో అట్లే ఉన్నాయి చెట్లు.

"పగలు నువ్వు జూసినప్పుడు ఇట్లనే ఉండేనా? ఆకులు యాల్లాడపడి ఉండేనా, మంచిగ జూడు"

బక్కన్నకు మాటలు రావడం లేదు. బక్కన్నకు గుండె గొంతుకలోకి వచ్చినట్ల వుతుంది.

అంత చలిలో కూడా బక్కన్నకు చల్లటి చమటలు పోశాయి. అయిపోయింది. తను నాశనం అయిపోయాడు. చేతికొచ్చిన పంట నిలువునా పూత కాతతో ఎండిపో తోంది. అతడి మెదడంతా శూన్యమైంది. గొంతు మూగబోతోంది. కన్ను చూపును కోల్పోయింది. అతడికి తన జ్ఞానాన్ని కోల్పోతున్నట్టనిపించింది.

అతడి పరిస్థితి చూసి గురువులు, రాములు బెంబేలెత్తి పోయారు.

"బక్కన్న ధైర్యం గుండాల. కష్టాలు మనకు రాకుంటే చెట్ల కస్తయా, కష్టమచ్చి నపుడే గట్టిగ నిలబడాల. నీళ్ల తడిలేక యిట్లయినయంటే రేపు బండ్లు కట్టుకొని చెట్టు చెట్టుకు నీళ్లు పోద్దాం"

"ఇది నాకు తడిలేని మాట అనిపిస్త లేదు. గురువులు మామ, చుట్టుపక్క చేన్లల్ల పంట మంచిగున్నది. బక్కన్న ఒక్కడిదే యిట్ల వాలు జూడవట్టే. నాకైతే ఏం సమజ్ ల పడ్తలేదు" అన్నాడు రాములు మళ్లీ ఒకసారి చెట్లను పరీక్షించి చూస్తూ.

"నా కిస్మతే ఖరాబ్ గున్నది. అందుకే రోగం నా చేనుకే వచ్చింది" అన్నాడు బక్కన్న రుద్ధ కంఠంతో.

"అట్ల మనసు కొంచం జేసుకోకు. ఎందుకన్న మంచిది రేపు ఒకసారి ఆదిలా బాదుకు పోయి నాలుగు చెట్లను ఎంట కొండబోయి జూపిస్తే ఏమన్న మందు జెప్తరు. అట్లేమన్న మందు జెప్తే మందు కొనుక్కొని జప్పనరా- నువ్. నువ్వు అచ్చింది మొదలు మనోలందరం చేన్ల దిగుదాం. ఏం జెయ్యమంటే అది జేద్దాం. నోటికచ్చిన బుక్క జారిపోవట్టే. అయినా చూస్తూ ఉంటమా ఏంది. అందరం కలిసి ఏదో ఒకటి చెయ్యాల" అన్నాడు గురు వులు.

"గురువులు మామ జెప్పింది చెయ్యి. ఒక నాలుగు చెట్లు పీక్కొని ఆదిలాబాదుల తెలిసినోళ్లకు జూపియ్యి. ఏదో ఒకటి చెప్పకపోరు. మేమంత ఉన్నం గద నీ యెనక. నువ్ రేపు పొద్దున పోయిరా" అన్నాడు రాములు.

నాలుగు పత్తి చెట్లు పీకి పట్టుకొని యింటికి దారి పట్టారు. దారిలో బక్క

న్నకు ధైర్యం చెబుతూనే ఉన్నారు వాళ్ళు.

ఇలాగే ఏదో ఉపద్రవం వచ్చి ఢీలా పడ్డ వాళ్లు మళ్లీ ఏదో చేసి ఒడ్డున పడి బాగు పడ్డ వాళ్ల ఉదంతాలు తమకు తెలిసినవి బక్కన్నకు చెప్పి అతడ్ని యింటి దగ్గర వదిలిపెట్టి తమ ఇళ్లకు బయలుదేరారు గురువులు, రాములు.

బక్కన్నకు ఆ రాత్రి నిదుర పట్టలేదు. పట్టినా అన్నీ పీడకలలు పడి ఉలిక్కిపడి లేస్తున్నాడు.

ఎట్లాగో తెల్లవారింది. బక్కన్న పీకిన పత్తి చెట్లను పట్టుకొని ఆదిలాబాదుకు బయలుదేరాడు.

ముందు కమీషన్ ఏజెంట్ ఇంటికి వెళ్లాడు.

అతడు రాజయ్యను అగ్రికల్చర్ ఆఫీసుకు పొమ్మన్నాడు.

బక్కన్న అగ్రికల్చర్ ఆఫీస్‌కు వెళ్లాడు. అక్కడ వాళ్లు పత్తి చెట్లను చూసి అన్ని వివరాలడిగి "ఇది ఎండురోగం పురుగు, మనకు కనిపించదు. ఈ రోగాన్ని 'విల్ట్' అంటరు. ఒక మందు నీళ్లను చెట్టు మొదట్లో పొయ్యాలి" అంటూ బక్కన్న పేరు, ఊరు, సర్వేనంబర్ వివరాలు అడిగి చెట్టుకు పోయాల్సిన ఒక పొడరు పేరు రాసి యిచ్చారు.

ఈ మందు నీటి ద్రావణాన్ని పత్తి చెట్టు కాండాల దగ్గర చెట్టు వేళ్ళు తడిసేలా పోయమన్నారు.

రోగం ఉన్నా లేకున్నా అన్నింటికి పొయ్యాల. రోగం లేని వాటికి కూడ యిప్పుడు వచ్చే అవకాశం ఉంది కాబట్టి అన్నింటికి పోయడం మంచిది.

బక్కన్న అగ్రికల్చర్ ఆఫీసర్ రాసిచ్చిన మందు చీటి పట్టుకొని మార్కెట్‌కు వచ్చాడు. బక్కన్నకు కావలసిన మందు పెద్ద మొత్తంలో ఏ షాపులో లేదు. మందుచీటి పట్టుకొని పిచ్చివాడిలా అన్ని షాపులు తిరిగాడు. ఎక్కడా మందు దొరకలేదు. చేతిలో ఉన్న డబ్బులు పెద్ద మొత్తంలో రాసిచ్చిన మందు కొనటానికి సరిపోవు. మళ్లీ కమీషన్ ఏజెంట్ దగ్గరికి పోయి దబ్బులడిగాడు బక్కన్న.

"ఇప్పటికే లక్షకు పైగా పెట్టుబడి పెడ్తిని బక్కన్న. ఏదో పంట బాగున్నదని మా మనిషి చూసి చెప్తే అంత బాకీ పెట్టిన పంట మీద తీరుస్తవని. మల్లా యింకా బాకీ అంటే యిప్పుడు కష్టం. అదీ నీకు నగద్ గావాల అంటున్నవ్ కష్టమే యిప్పుడు యిచ్చుడు" అన్నాడు సేఠ్.

"అట్లా అనకు సేఠ్.. లక్షకు పైగా పైసనే పెట్టిన. నాభూమి, మా రెక్కల కష్టం అంతా యిప్పుడు నువ్వుకాదంటే అంతా పోతది. చెట్లు నిలువునా ఎండిపోతాయి. నాకొక్క పత్తి బొండ ఎల్లది. ఒక్క రూపాయి కూడా రాదు" అని మళ్లీ, "నువ్వే దయజూడాల" అన్నాడు బక్కన్న.

సేఠ్ బక్కన్న చేను వివరాలు, ఎవరి దగ్గరికి వెళ్లింది అన్నీ అడిగి తెలుసుకున్నాడు. బక్కన్నకు మందు రాసిచ్చిన వివరాలు తెలుసుకున్నాడు. తర్వాత "నువ్ ఒక రెండుగంటలాగిరా" అని చెప్పాడు.

ప్రస్తుతం బజరంగ్ సేఠ్ కోటీశ్వరుడు. పత్తి సీజన్‌లో ఒక్కోరోజు అరవై డెబ్బయి లక్షల పత్తి ఖరీదు చేస్తాడాయన. ఒకప్పుడు కేవలం కమీషన్ ఏజెంట్. తర్వాత తనే ఖరీదు చేయడం మొదలు పెట్టాడు.

## కొత్తగాలి...

ఎపుడో వచ్చే స్వర్గం
ఎవడిక్కావాలి!
దాన్ని మించిన బాల్యం
మళ్లీ కావాలి!

—పి.వి. రమణకుమార్, చిలకలూరిపేట

**కొత్తగాలి...**

**విరగబూసింది**
**వెన్నెలేనా**
**నా చెలి**
**నవ్వుకూడా**

—బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

ప్రస్తుతం రెండు జిన్నింగ్ ఫ్యాక్టరీలు తనే నడుపుతున్నాడు.

పత్తి కొనడం, అమ్మడం అతడి వ్యాపారం.

పత్తిని బేళ్లు చేసి బొంబాయి, కలకత్తా, కోయంబత్తూరుకు అమ్ముతాడు.

పత్తి నుండి వచ్చిన విత్తనాలతో నూనె తీసే కర్మాగారం ఉంది అతడికి.

రిఫైన్డ్ కాటన్‌సీడ్ ఆయిల్ కర్మాగారం ఉందతనికి.

కోయంబత్తూర్, బొంబాయిల్లో బట్టల మిల్లుల్లో వాటాలున్నాయి.

నేడు అతడి టర్నోవర్ కొన్ని కోట్లు. అతడి నౌకర్లు విమానాల్లో తిరిగి వ్యాపార వ్యవహారాలు చూసుకుంటారు.

అంతా చేసి అతడు ఆధారపడింది పత్తి పంటపైన, దాని అనుబంధ ఉత్పత్తుల కొనుగోలు అమ్మకాలపైనే. అతడు వ్యాపారంలో దిగింది మొదలు ఎన్నడూ వ్యాపారంలో నష్టం రాలేదు.

నష్టం వచ్చే పరిస్థితిలో ఏ కారణంగా నష్టం వచ్చినా అగ్ని ప్రమాదమని చూపి బీమా సంస్థల నుండి ముక్కుపిండి మరీ డబ్బులు వసూలు చేస్తాడాయన.

ఈ దేశంలో ఒక వ్యాపారి నష్టపోతే ప్రభుత్వం బీమా రూపంలో నష్టపరిహారం యిస్తుంది.

అదే ఒక రైతు గురించి ఆలోచించే నాథుడే లేడు.

కోట్లున్న వాడికి వేలల్లో, లక్షల్లో నష్టం వచ్చినా ఈ ప్రభుత్వం స్పందిస్తుంది.

అదే ఒక పేద రైతు తన జీవితాన్నే పణంగా పెట్టి వ్యవసాయం చేసి నష్టపోతే చూస్తూ ఉంటుంది.

అతడి శ్రమతో అతడి భూమిలో పండిన పంటలో కొన్నవాళ్లు కోట్లు గడిస్తున్నారు.

అమ్ముకున్న రైతు రోజు రోజుకు అధోగతి పాలవుతున్నాడు.

పత్తి పండించి లక్షలు కోట్లు గడించిన రైతు ఒక్కరు లేరు యీ భారతావనిలో. కాని పత్తితో వ్యాపారాలు చేసి లక్షలు కోట్లు గడించిన వారే అందరు.

తాను ఎవరికోసం శ్రమపడుతున్నాడో తెలియని అమాయకుడతడు. వ్యాపారంలో ఆరితేరిన సేఠ్ బుర్ర బక్కన్న విషయంలో కూడా చురుగ్గానే పనిచేసింది. బక్కన్న పంటకు వచ్చిన తెగులు గురించి అగ్రికల్చర్ ఆఫీసుకు ఫోన్ చేసి అతడికి మందు రాసిచ్చిన వ్యక్తితో ఫోన్‌లో మాట్లాడాడు.

"నమస్తే సేఠ్‌జీ"

నమస్తే సాబ్, బక్కన్న అని ఒక రైతు తన చేన్ల పత్తి చెట్లు ఎండిపోతున్నాయి అని మందులు కొట్టతందుకని పైసలు గావాలనిఅంటుండు. ఇస్తే లాభమా, లేక మొత్తం మునుగుతడా, అని తెలుసుకుందామని"

"అది విల్ట్ రోగం పైకి ఏమీ కనిపించదు. కాని చెట్టు నిలువునా ఎండిపోతుంది. దానికి ఒకే ఒక మందు ఉంది. అది ఆయనకు రాసిచ్చాను. అది వాడాలి రోగం ఎక్కువ తీవ్రంగా లేకుంటే మొత్తం పంట చేతికొస్తుంది. లేదా బాగా సివియర్‌గా ఉంటే పంట ఎంత చేతికొచ్చేది చెప్పలేం. బాగా రోగమొచ్చిన చెట్టు ఒక్కసారిగా నిలువునా ఎండిపోతుంది. అలాంటప్పుడు మొత్తం చెట్లు ఎండిపోతే మొత్తం

పంట పోయినట్లే."

"మంచిది ఉంటాను సార్, థాంక్యూ" అంటూ ఫోన్ కట్టేసి,

"అరే బనారసీ! ఆ బక్కన్న అడిగిన పైసలు అతడికియ్యి కాని వానితో ఒక బాండ్ పేపర్‌మీద వాడి పొలం రాయిం చుకొని దాన్ని మార్టిగేజ్ చేయించు. ఇప్ప టికే లక్ష ఇస్తిమి. మల్లా పైసలంటుండు. ఆ చేను పండుతదో, ఎండుతదో ఎవల్లకు ఎరక. అందుకని కాగితం రాయించుకొని పైసలియ్యి" అని చెప్పాడు.




ఆలోచిస్తూ కాలినడకన పల్లె పల్లె తిరు గుతున్న రామకృష్ణకు ప్రతి పల్లె కొన్ని వందల దయనీయమైన కన్నీటి కథలకు నిలయమై కనిపించసాగింది. అక్షరంతో పరిచయం లేని, అజ్ఞానం అమాయక త్వంతో ఎటూ చూసినా ప్రతి ఒకరు రైతు లను దగా చేసేవాళ్లే. ఆదుకునే వాడే లేడు. ప్రతి ఒకరూ రైతును దోచుకునే వారే.

యాభై సంవత్సరాలుగా భారతావనిలో రైతు సంక్షేమానికి ప్రభుత్వం చేసిందేమీ లేదు. ఏదైనా చేసినట్టు కనిపించినా అది వాళ్ల ఓట్లు దండుకోడానికి, పదవులు నిలు పుకోవడానికి లేదా తమ జేబులు నింపుకో వడానికి తప్ప రైతు సంక్షేమానికి మాత్రం కాదు.

కాలినడకన నడుస్తున్న రామకృష్ణకు కని పిస్తున్నవన్నీ కూడా పత్తి చేలే. ఎక్కడో అరకొర వేరే పంటలు పండిస్తున్నారు. ఇంతగా పత్తి పండించే రైతుల గురించి, పాలించేవారు ఎన్ని సౌకర్యాలు కల్పిం చాలి. పత్తి పంట మీద ఎంత అవగాహన కలిగించాలి. అదేమీ లేదు. చదువురాని రైతు అజ్ఞానం, అమాయకత్వంతో అధిక దిగుబడి వస్తుందనే ఒక ఎండమావి వెంట పరుగెడుతున్నాడు.

'మహికో- మోన్‌సాంటో'లు సరఫరా చేసిన విత్తనాలు బోల్‌గార్డ్ పత్తి చేలు బోల్‌వార్మ్ పురుగు రాకముందే ఇతర తెల్ల, నల్ల, పచ్చ పురుగుల బారిన పడ డంతో రైతులు బోల్‌వార్మ్ గురించి ఆలో చించాల్సిన అవసరమే రాలేదు. ఏ పురుగు రాదని నిశ్చింతగా ఉన్న రైతులకు మొండి చెట్లే మిగిలాయి. పత్తి వేసుకున్న రైతుకు పనే లేకుండా పోయింది. గత యేడాది పత్తి పంట దిగుబడులు, ధరలు ఎంతో తక్కువైనా కూడా ఎంతో కొంత దిగు బడి సాధించిన రైతులు కూడా యీ యేడు యింకా దిగుబడి తగ్గి పూర్తిగా దిక్కుతోచని స్థితిలో ఏం చేయాలో అర్థం కాని పరిస్థితిలో ఉన్నారు.

కల్తీ విత్తనాలతో, సరిగా క్రాస్‌కాని విత్త నాలతో కేవలం పూత మాత్రమే వచ్చి కాయకు నోచుకోని చెట్లతో నిండిన చేలను చూసి రామకృష్ణ హృదయం ద్రవించిపో యింది. పత్తి పంటలో శాస్త్రీయమైన అవ గాహన ఉన్న రైతు అలాంటి చెట్టును ప్రారంభదశలోనే గ్రహించగలడు. కాని అలాంటి అవగాహన కలిగించే ప్రయత్నం ఎవరూ చేయరు. కాపురాని చెట్టుకు ఎరు వులేసి, మందులు కొట్టి, కాపు కోసం ఎదు రుచూసే రైతులెందరో.

నడుస్తున్న రామకృష్ణ తన చేతి సంచి లోంచి చిన్న డైరీ తీసి చూసుకున్నాడు.

# వారికి వారే గొప్ప

మెకానిక్ రాజు డాక్టర్‌గారి మెర్సిడెస్ కారును రిపేర్ చేసిన తర్వాత చేతుల్ని గుడ్డలకు తుడుచుకుంటూ 'డాక్టర్‌గారూ! నేనూ డాక్టర్నే. ఇంజిన్ విప్పి మీలాగే లోపలి వాల్వులను బయటికి తీశాను. సరిచేశాను. కొత్తవి వేశాను. కారును దౌడుతీయిస్తున్నాను. మీకంటే దేంట్లో తక్కువ?' అన్నాడు ఒకింత గర్వంగా.

'ఈ రిపేరులన్నీ ఇంజన్‌ను ఆపిన తర్వాత కాకుండా అది నడుస్తున్నప్పుడు చేయగలగాలి మరి? అలా చేస్తావా?' అన్నాడు డాక్టర్



ఊరి పేరు చూడ్డంతో వెంటనే ఆ ఊరి వ్యక్తులు, వాళ్ల ఆప్యాయత వాళ్లిచ్చిన విత్తనాలు అన్నీ గుర్తొచ్చాయి.

బక్కన్న, భూదేవి, అశోక్, రమేష్, జానకి, విశ్వనాథం, దేవన్న, అందరూ కళ్ల ముందు కదిలారు. బక్కన్న ఎంతో పదిలంగా దాచి ఉంచి యిచ్చిన పిల్లిపెసర గింజలు, మిటుకుళ్ల గింజలు, నేలచిక్కుడు గింజలు, వామ జొన్నలు, పిసుకుళ్ల జొన్నలు, పేలాల జొన్నలు, బుడిమె గింజలు అన్నీ గుర్తొచ్చాయి.

"నీకెందుకు బిడ్డా అక్కడెక్కడ్నో దేశం కాని దేశంలో మల్లా పంట యేసి పండిచ్చే కష్టం. యిగో కొన్ని గింజలు గొంచపో. కొన్ని నేను నీకోసం చేన్ల ఏసి, కొత్త పంటలో మల్లా పాతం చేసి ఉంచుత. మల్లా నువ్వెపుడన్న యిటునుంచి పోయినపుడు రా. అప్పుడు అన్నీ కొత్త యిత్తులే యిస్తా" అన్న భూదేవి మాటలు నిన్న... మొన్న విన్నట్టు మళ్లీ చెవిలో వినిపించసాగాయి.

దారిగుండా నడుస్తున్న రామకృష్ణకు దూరంగా ఒక చేను చేనంతా తగలబడిపోతున్నట్లు... ఎర్రటి జ్వాలలు భూమికి రెండు నిలువుల ఎత్తున ఆకాశంలో ఎగిరి పడుతుంటే... మంటల కావలివైపున ఉన్న చేలు గాలిలో ఎండమావిల కదిలిపోతుంటే... చూస్తున్న రామకృష్ణకు ఏమీ అర్థం కాలేదు.

ఏదో పత్తి చేను తగలబడిపోతున్నది. అన్ని చేలు పచ్చగా ఉంటే ఈ చేను ఎలా తగలబడిందో, పచ్చటి చేను ఎలా అంటుకుందో రామకృష్ణకు అర్థం కాలేదు.

నిలువునా ఎండిన పత్తి చేను దట్టంగా మనిషి నడవ వీలులేనంత దట్టంగా ఆరడుగులపైన ఎదిగిన పత్తి చేను భగభగ మండుతూ అగ్నికి ఆహుతవుతున్నది.

చూస్తుండగానే మంటలకు గాలి తోడయి మంటలు ఇంతెత్తున గాలివాటంకు లేస్తూ చిటపటమంటూ ఒక చేను కాలి బూడిదవుతున్నది. అది బక్కన్న పత్తి చేను.

అక్కడి మనుషులు అడవి కాలుతుంటే చూసిండ్లు, చెట్లు కూలుతుంటే చూసిండ్లు.

ఇండ్లు, పందిళ్లు, కొట్టాలు కాలుతుంటే చూసిండ్లు.

కాని ఒక పంటపొలం కాలుతుంటే చూడ్డం ఇదే మొదలు.

ఎలా జరిగింది. ఎవరు కాల్చారు. ఎవరు నిప్పంటించారు. అనేదే అందరి ప్రశ్న.

కాలి బూడిదవుతున్న చేనుకు ఆ దరిన నిశ్చింతగా కూర్చున్న బక్కన్న కనిపించడంతో అందరూ అటుదిక్కు కదిలారు. బక్కన్న పక్కన నిప్పంటించి పక్కన పడే

సిన అగ్గిపెట్టె ఉంది. ఆ పక్కనే పట్నం నుంచి చేను తాకట్టు పెట్టి మరీ కొనుక్కొచ్చిన బైటాక్స్, బ్లూకాపర్ మందు ప్యాకెట్ల మూటా ఉంది.

బక్కన్న కళ్ల ముందు లక్ష రూపాయిల పెట్టుబడి పంట కాలి బూడిదయింది.

అయినా బక్కన్నలో ఇంత చలనం కూడా లేదు. నిర్వికారంగా ఉన్నాడు, నిర్వేదంగా ఉన్నాడు.

"బక్కన్నా... బక్కన్నా..." అంటూ అందరూ పలకరించారు. కాని బక్కన్నలో ఉలుకుపలుకు లేదు. అతడి చూపుల్లో నిశ్చలత లేదు. ఏదో పోగొట్టుకున్న భావం లేదు.

బక్కన్న కళ్లకింద ఆరిపోయిన కన్నీటి చారలున్నాయి.

ఇప్పుడు ఆ కళ్లలో తడి లేశమాత్రం కూడా లేదు.

అక్కడకొచ్చినవాళ్లందరికి పరిస్థితి అర్థమయింది.

రామకృష్ణ బక్కన్నను అక్కున చేర్చుకుని "బక్కన్న బక్కన్నా" అంటూ అనునయంగా పలకరించాడు. కాని బక్కన్న అతడి పిలుపునకు స్పందించలేదు.

"ఇది పత్తి పంటలో వచ్చే అరుదైన తెగులు, ఎండుతెగులు. దీన్ని మొదట్లోనే గుర్తించగలిగితే ఇదిగో ఈ మందులతో ఈ చేను ఇలా ఎండకపోవును. కాని ఆలస్యమయింది. అందుకే ఇలా నిలువునా ఎండిపోయింది" అని ఒకరు.

"ఒకటా రెండా ఇరవై ఎకరాల పంట" అని ఒకరు.

"ఆరుగాలాలు కష్టం... లక్షరూపాయిల పైన పెట్టుబడి" అని ఇంకొకరు.

"కన్న బిడ్డలాంటి చేను.... ఎంత కఠినమైతే ఇంత పని చేసిందు బక్కన్న"

"పాపిష్టి పంట, ఇంకా ఎంతమంది ఉసురు బోసుకుంటుందో. ఇంకా ఎంత మంది పాణాల మీదికి తెస్తదో-" అన్నీ వింటున్నాడు రామకృష్ణ.

ఒకాయన "నడుండ్లి అంతా కాలి బూడిదయ్యే. ఇంకా ఏం మిగిలింది. నడుండ్లి ఊళ్లేకు" అంటూ రామకృష్ణను గమనించి అతడి వేషం వెంటనే గుర్తించిన ఒకాయన "నువ్వా స్వామి, ఎప్పుడస్తివి? ఆ పూట నీవు చెప్పిన మాట మా ఎవల్ల చెవికి సోకకపోయే. వద్దన్నా వినక పైసలకు ఆశపడి ఈ పత్తి బొండల వెంట ఉరుకవడ్తిమి. చూసినవు గదా. మా బతుకులెట్లా చేన్లల్ల పంటల నడుమనే కాలి బూడిదవుతున్నాయో"

బక్కన్నను నడిపించుకుంటూ వెంటబెట్టుకొని అందరూ ఊర్లోకి వస్తున్నారు. అప్పటికే భూదేవి, శోకాలు పెడుతూ ఎదురొచ్చింది.

బక్కన్న తన ఇంటి వాళ్ల రోదనను కూడా అతీతుడై చూస్తుండిపోయాడు. అతడిలో ఇంత కదలిక లేదు, వాళ్ల కన్నీళ్ల పట్ల.

అంతలోనే ఎవరో అననే అన్నారు. "బక్కన్నకు పిచ్చిలేసినట్టుంది" అని-

"బక్కన్న మన ఖయాల్ల లేడు. ఉంటే గట్ల ఉండడు" అన్నారొకరు.

"ఆ పంటమీద మన్నువడ, అది నా మొగున్ని నాకు కాకుండా చేసింది. కాలి, బూడిదయి కూడా నా మొగున్ని దయ్యం తీరు పట్టింది" అంటూ భూదేవి కన్నీరు మున్నీరుగా విలపిస్తూ, పత్తి పంటను శపించింది.

"బాపు బాపు మాట్లాడు బాపు. మా దిక్కు సూడు" అంటూ రోదించసాగించసాగారు అశోక్, రమేష్‌లు.

"పంట పోతే పోనియ్యవయ్యా. నీవు మా దిక్కు సూడు. అటు బిడ్డలను సూడు, అళ్లెట్ల ఏడుస్తుండ్రో సూడు, బిడ్డల కంట్లె ఒక్క కన్నీటి సుక్కకే తల్లడిల్లి పోయేటో



డివి ఆల్లు జూడు ఎట్లా ఏడుస్తున్నరు బాపు బాపు అని" అంటూ భూదేవి లాల నగా బక్కన్న గదవ పట్టి ప్రేమగా అడిగింది.

అయినా బక్కన్నలో కదలికలేదు.

బక్కన్న ఆఖరుసారిగా చూసింది ఎండి మోడైన తన పత్తి చేనును.

బక్కన్న ఆఖరుసారిగా ఆలోచించింది తనను మోసంచేసిన పత్తి చెట్లను చూసి.

బక్కన్న ఆఖరుసారిగా చేసిన పని అగ్గిపుల్ల గీచి పత్తి చేనును అంటించడమే.

బక్కన్నకు తర్వాత అంతా నిశ్శబ్దం, శూన్యం, అచేతనం. కన్నబిడ్డను భూస్థాపితం చేసొచ్చిన, ఒక తండ్రిని చూస్తున్నారు.

అందరూ బక్కన్నను చూసి తలొకతీరు ఆలోచిస్తూ... మాట్లాడుకుంటుంటే... అంతలో పరుగు పరుగున గురువులు పరిగెత్తుకొచ్చి "అందరూ రండ్లి మీసాల దేవన్న ఉరి పెట్టుకుంటుండు" అని ఒక్కమాట చెప్పి మళ్లీ వచ్చిన దారినే ఉరుకులాంటి నడకతో దేవన్న ఇంటి వైపు కదిలాడు.

అందరూ దేవన్న ఇంటివైపు పరుగెత్తారు.

దేవన్న ఇంటిముందు జనం గుమిగూడి ఉన్నారు.

తలుపు కన్నంలోంచి అటుకెక్కి ఉరితాడు బిగించుకుంటున్న దేవన్న స్పష్టంగా కనిపిస్తున్నాడు.

బయటనుండి ఎవరెంత అరిచినా దేవన్న పట్టించుకోవడం లేదు.

దేవన్న ముసలి తల్లి, భార్యా, పిల్లలు పిచ్చి వాళ్లలాగా తలుపు తీయమని అరుస్తున్నారు. దేవన్న అవేవీ వినిపించుకోవడంలేదు. కప్పు పై భాగాన ఉరితాడు బిగించడంలో మెడకు ఉరివేసుకోవడంలో నిమగ్నమై ఉన్నాడు. చచ్చేముందు తన కిష్టమైన తెల్ల కల్లు కడుపునిండా తాగాడేమో అతడి చూపులు, చేతులు చేసే పనికి సహకరించక తడబడుతున్నాయి. ఎవరో బలవంతంగా మృత్యుకుహరంలోకి నెడుతుంటే ఇక పోక తప్పదనే పరిస్థితిలో పోవాలనుకున్న జీవన మాధుర్యం, మోహం, బంధాలు అతడ్ని వెనక్కు లాగుతున్నాయి. హృదయం మోహపాశంతో తల్లడిల్లుతోంది. కళ్లు వర్షిస్తున్నాయి. కారుణ్యంతో చేతులు తడబడుతున్నాయి. కళ్లు మసకబారుతున్నాయి. కన్నీటి తెరలలో అయినా పోవాలి తప్పదు.

ఎల్లకాలం ఓటమి తప్ప విజయంలేని, అధోగతి తప్ప ప్రగతిలేని ఈ బతుకులు వ్యర్థం. అందుకే పోవాలి... పోవాలి... పోవాలి....

అందరూ చూస్తూ, తలుపులు బాదడం తప్ప ఏమీ చేయలేకపోతున్నారు. ఒక మనిషి దృఢ సంకల్పంతో, కొంత తాగిన మైకంలో చేతులు కాళ్లు మెదడు సహకరించక ఉరి వేసుకోవడంలో ఆలస్యమవుతుందే తప్ప ఉరితాడు బిగుసుకోవడంలో ఆలస్యం ఉండదని అందరూ గ్రహిస్తున్నారు. ఒక నిండు ప్రాణం ఇక కొద్ది క్షణాల్లో అనంత వాయువుల్లో కలిసిపోబోతుందని తెలిసినా, ఏమి చేయాలో తోచని స్థితి అది. అందరిలో ఆదుర్దా తప్ప ఆలోచన లేదు.

తలుపు కన్నంలోంచి చూసిన రామకృష్ణకు దేవన్నను బతికించడానికి యింకా కొన్ని సెకన్లే ఉన్నాయని గ్రహించాడు. వెంటనే పై కప్పు ఎక్కి ఇద్దరు మనుషుల సహాయంతో సరిగ్గా దేవన్న ఉన్న దూలం దగ్గర కూన పెంకులు తీసి, రాక్షస బలంతో వాసాలను పీకి దేవన్న ఉరితాడు బిగించుకొని దూకక ముందే ఇంట్లోకి దుంకారు.

ఒక ప్రాణం నిలబడింది. కాని దేవన్న

"నేను బతికి ఏం చెయ్యాను" అని పసిపిల్ల వాడిలా రోదిస్తున్నాడు. కొందరు దేవన్నను ఊరడిస్తున్నారు. కొందరు మెట్ట వేదాంతం చెపుతున్నారు.

కొందరు ఏమీ మాట్లాడ్డం లేదు. నిశ్చేష్టులై చూస్తున్నారు. తమ తోటి వాడు జీవితంలో విసిగి, వ్యవసాయంతో విసిగి చావడానికి సిద్ధమయ్యాడు.

ఇంకొక తోడివాడు కంటికి రెప్పలా పెంచుకున్న పంట పొలాన్ని తన చేతుల్తోనే నిప్పంటించాడు. మనిషిలో ఎంత విధ్వంసం జరిగితే మనిషి ఇలా ప్రవర్తిస్తాడు.

మనిషి ఎంత బలంగా ఓటమిని అంగీకరించి జీవితాన్ని వదిలి మృత్యువును కౌగలించుకుంటాడు.

అక్కడున్న చాలామంది పరిస్థితి దేవన్న, బక్కన్నకన్న ఏ మాత్రం మెరుగ్గా లేదు. అందుకే వాళ్లు అక్కడ బక్కన్నను కాని ఇక్కడ దేవన్నను కాని తప్పు పట్టడం లేదు.

నేడు కాకపోతే రేపన్నా తాము తమ చేలను తగల బెట్టాల్సిందే...

...నేడు కాకపోతే రేపన్నా తాము తమ ప్రాణాలను యీ పంటలకు బలి యివ్వాల్సిందే. అందుకే వాళ్లు అంతగా అంతర్ముఖులై తమ తోటివారి చర్యలకు అందరిలా భావ ప్రకటన చేయలేకపోతున్నారు.

"అన్నలారా కొన్ని రోజుల క్రితం యిదే ఊళ్లో పీర్లచావిడి దగ్గర మీకు యీ వినాశకారి వాణిజ్య పంటలతో ఏమి జరుగుతుందో, మీరెలా మోసపోతున్నారో చెప్పాను. కాని మీరెవరూ నా మాట పట్టించుకోలేదు. చూడండి యీ దేవన్నను. అక్కడ బక్కన్నను చూడండి, వీళ్లను చూసి మీలో మీరు ఒకసారి మీ మనసులోకి తొంగి చూసుకోండి. మీలో చాలా మంది అటు బక్కన్న చేసిన పనినిగాని ఇటు దేవన్న చేసిన పనిని గాని తప్పు

**కొత్తగాలి...**

**నీకీ విషయం తెలుసా?**
**అనకముందే**
**నీకా విషయం తెలుసుంటుంది**
**ఎందుకంటే, అది వట్టి 'పుకారు'**

—అనుముల బదరీనారాయణ,
జమ్మలమడుగు

పట్టడం లేదు. ఎందుకంటే మీ ప్రతి ఒకరిలో ఒక బక్కన్న ఉన్నాడు. మీ ప్రతి ఒకరిలో దేవన్న ఉన్నాడు. అందుకే వాళ్ల చర్యలు మీకు తప్పుగా అనిపించలేదు. వాళ్లు చేసిన పనే చేయాలని మీరు అనుకున్నారు. కాని వద్దు. ఎవరూ చావుతో యీ సమస్యకు పరిష్కారం వెతుక్కోకండి. ఏ సమస్యకూ చావు పరిష్కారం కానే కాదు. జీవితం పోరాడటానికి, బతకడానికి. మన పుట్టుకతో మన ప్రమేయం లేనట్టే, మన చావులో కూడా మన ప్రమేయం ఉండకూడదు" అంటున్న రామకృష్ణ మాటలను అందరూ తదేకంగా వింటున్నారు.

కొందరు దొరికిపోయిన దొంగల్లా సిగ్గుతో తలలు వంచుకుంటున్నారు.

"అమ్మా... తల్లీ మీ పిల్లలకు, మీ భర్తలకు మీరు ధైర్యం చెప్పండి, పంట నష్టాలతో ప్రాణనష్టం చేసుకోవద్దని. మీ వాళ్లకు మీరు నచ్చజెప్పండి. తగలబడిపోయిన చేనును రేపు పండించుకోవచ్చు. ఈ పంట కాకపోతే యింకో పంట పండించుకొని బతకవచ్చు. కాని ప్రాణాలు తీసుకోకండి. మీ ప్రాణాల మీదకి తెచ్చిన పంటను ఉరి తీయండి. మీ ప్రాణాలతో చెలగాటం ఆడే పంటను, విత్తనాలను మట్టు పెట్టండి. మిమ్మల్ని మీ ఆశలను వమ్ము చేసిన ఎరువులను, మందులను



బహిష్కరించండి. భూమిమీద మనిషి పుట్టినప్పటి నుండి ప్రకృతి యిచ్చిన విత్త నాలున్నాయి. చెట్లున్నాయి. అవి మనల్ని మోసం చేయవు. మన ప్రాణాలు తీయవు. కేవలం అధిక దిగుబడి యిస్తా యనే ఒకే ఒక ఆశతో దగ్గరికి తీసిన యీ వాణిజ్య పంటలను దూరంగా ఉంచండి. ఆ విత్తనాలు, పంటలు మన కోసం కాదు సృష్టించింది" అన్నాడు రామకృష్ణ.

కర్ణుడి చావుకు కారణాలనేకం అన్నట్టు పత్తి రైతుల ఆత్మహత్యలకు కారణాల నేకం. వ్యవస్థాగత హత్యలే పత్తి రైతుల ఆత్మహత్యలకు మొదటి ముద్దాయి. ఈ రా జ్యమే కనిపించని కత్తులతో గొంతులు కోసీ, తీరా శవమై తేలాక, లక్ష మొసలి కన్నీళ్లతో నటించడమే యీ కుట్రలో చివరి అంశం. అద్దెకు తెచ్చుకున్న సర్కారి హరిత విప్లవ ప్రయోగంతో హరీమన్న ప్రాణానికి విలువ ఎవడిక్కావాలి. చంద్ర వంకని గ్రహణం మింగినట్లు పత్తికాయలా మెరిసే రైతును వలస డాలర్ రాబందులు తన్నేసుకు పోతున్నాయ్.

పల్లె పల్లె తిరుగుతూ ఉన్న రామకృష్ణకు పత్తి రైతుల ఆత్మహత్యలు కల్లోల పరుస్తు న్నాయి. ఎటు చూసినా, ఏ పల్లెను చూసినా ఊరికో శవం లేచి ప్రతి గుండె పత్తికాయలా తల్లడిల్లుతుంటే ఎవరికీ పట్టదేం?

ఈ దేశంలో పల్లెలకూ దేశానికి లింకు తెగిందని తెలిసినా యింకా ఈ రైతులు నాగళ్లను, నేలను, చేలను, ఆరుగాలాల్ని, ఆకాశాన్ని నమ్ముకోవడం వారి అమాయక త్వానికి, నిజాయితీకి నిదర్శనం.

దేవన్న ఆత్మహత్యకు ప్రయత్నించాడని తెలిసి భూదేవి పలకరించిపోవడానికి వచ్చింది. "మొగోనికి ధైర్యం ఉండాలి. తలుచుకుంటే భూమినే చాపతీరు చుట్టే కాపోడు గిట్ల తెగించి పానం తీసుకును డేంది? రామాయణంలో రావణుని వేషం కట్టినవ్ గాని, రామునితోని తలపడి రావ ణుడెట్ల బతికిండో తెలుసుకోలేదు. ఆఖరు దమ్ముదాంక బతకాలి. అదే జీవనం" అంటూ చెప్పింది భూదేవి.

వయస్సు కన్న అనుభవం మనిషిని, ఎలా మాట్లాడిస్తుందో భూదేవిని చూస్తే తెలుస్తుంది.

జనం మధ్య మాట్లాడుతున్న రామకృష్ణ దగ్గరకు వెళ్లి రెండు చేతులు పట్టుకొని "ఇంటికి రా బిడ్డ, నీ కాలు మంచిది, నీ రాకతోని యియాల్ల యీ ఊల్లె రెండు పానాలు నిలవడ్డాయి. బక్కన్నకు ధైర్యం జెప్పు. ఏదో చెప్పి మనుషుల్ల పడేయ్యి" అని అంది భూదేవి.

"అదేం మాట తల్లీ... పెద్దదానివి. నువ్వు ఇంటికి రమ్మని చేతులు పట్టుకొని అడగాలా, పిలిస్తే, రానూ" అంటూ భూ దేవి వెంట వెళ్లాడు రామకృష్ణ.

బక్కన్న పరిస్థితి చూసి అశోక్, రమే ష్‌లు దిగాలుగా కనిపించారు.

బక్కన్న పత్తిచేల నష్టం 'షాక్' నుండి యింకా కోలుకోలేదని గ్రహించాడు.

"ఇయ్యాల్ల మా యింట్లోనే ఉండు, బక్క న్నను చూస్తే గుబులవుతున్నది" అంది భూదేవి.

"ఇక్కడే ఉంటా. బక్కన్న కొచ్చిన భయం లేదు. ఒకటి రెండు రోజుల్లో మనిషివుతాడు" అంటూ పిల్లలకు ధైర్యం చెప్పాడు రామకృష్ణ

భూదేవి మాటకు ఆ రాత్రికి అక్కడే విశ్రమించాడు రామకృష్ణ. దినమంతా మానసిక క్లేశానికి గురయిన రామకృష్ణ ఏవేవో ఆలోచనలు ముసురుతుండగా... నిద్ర వచ్చేసింది.........

ఒకప్పుడు మామూలు పత్తి పంటను పండించే రైతుకు ఇంకా ఆర్థిక లాభాలు చేకూరుస్తాం అంటూ హరిత విప్లవం పేర

హైబ్రీడ్ పత్తి పంటను ప్రవేశపెట్టారు- ఏలినవారు.

పత్తి పంటలో యింకా వినూత్నమైన మార్పుల కోసం కొత్త కొత్త సాగుబడులు, విధానాలు, మందులు, ఎరువులు, ఎన్నో సమకూర్చారు. రైతులే వాటిని సరిగా విని యోగించుకోక పంట సరిగా తీయక, తెలిసి తెలియని మనస్తత్వంతో ఆత్మహత్యలకు పాల్పడి, ప్రభుత్వం పరువు తీసి, అన్నింటికి ప్రభుత్వాన్నే జవాబుదారిగా చేసి, దోషిగా నిలబెట్టడంతో, ప్రభుత్వం ఎలాగైనా పేద రైతులను అదుకోవాలనుకుంది. ప్రతిపక్షాలు, మిత్ర పక్షాలు కాదన్నా రైతన్న మీది ప్రేమతో, ఎవరికీ యిష్టం లేకున్నా ప్రపంచ బ్యాంకు, ఐ.యం.యఫ్. ప్రపంచ వాణిజ్య సంస్థలతో ఒప్పందం కుదుర్చుకొని "బోల్ గార్డ్" అనే ఒక సరికొత్త రకం పత్తి విత్తనాన్ని అలాగే అన్ని రకాల "టర్మినేటర్ సీడ్స్"ని రైతన్నల కోసం ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి మనదేశంకు తెప్పించి యిచ్చింది.

ఇంత చేసినా గిట్టనివారు ఇంకా కేంద్రం కాని, రాష్ట్రం కాని రైతుల కోసం ఏమీ చేయలేదని అనడం ఎంతవరకు సమంజసమో మీరే ఆలోచించండి అని అడుగుతున్నారు ప్రజలను.

రైతులు పంటలు వేస్తున్నారు. ఏ పంట విత్తనం కావాలన్నా దుకాణాలకు వెళ్లి కొనాల్సిందే. దేశంలో ఎవరి ఇంట్లో కూడా ఒకసారి పంట వేశాక తిరిగి మొలకెత్తే విత్తనాలు లేవు. అన్నీ టర్మినేటర్ విత్తనాలే. ఆ విత్తనాలన్నీ విదేశీ కంపెనీలు రూపొందిస్తున్నాయి. అన్నీ మనకు దిగుమతి చేసుకొని ప్రభుత్వం రైతులకు స్వేచ్ఛా విపణిలో అమ్ముతుంది.

ఇప్పుడు ఈ దేశంలో ప్రజాస్వామ్యం అర్థాలే మారిపోయాయి.

అన్నీ ప్రైవేట్ కంపెనీలకు అప్పజెప్పటమే. నేటి పరిపాలన అంటే అలా అప్పజెప్పినందుకు లక్షల కోట్ల డబ్బులు మామూలుగా తీసుకొని పబ్బం గడుపుకోవడమే నేటి ఆధునిక రాజకీయం.

ప్రభుత్వం పని హాయిగా ఉంది. ఎటు చూసినా కంప్యూటర్లు.. నిమిషాల్లో, సెకన్లలో మనం ఎవరికి ఎంత బాకీ ఉన్నాం, ఎవరికి ఏది అమ్ముడుచేశాం, ఎవరికీ వడ్డీ రూపంలో ఏమేం చెల్లించాలి క్షణాల్లో కంప్యూటర్లలో తెలిసిపోతుంది.

అన్ని రోజులు ఒకేలా సాగవు.

ఏడు చేపల కథలా... ఎవరో ఏదో చేస్తే... అది అలా... అలా... వెళ్లి యుద్ధం వరకు వచ్చింది. ఫలితంగా భారతదేశానికి సరఫరా కావాల్సిన టర్మినేటర్ విత్తనాలు ఆగిపోయాయి.

రైతు నేల దున్ని అన్ని ఏర్పాట్లు చేసుకొని విత్తనం కోసం చూస్తే, విత్తనం బహుళజాతి సంస్థల చేతిలో ఉంది. ఈ దేశంలో ఎక్కడా ఒక్క విత్తనం కూడా లేదు. గత కొన్నేళ్లుగా ఈ దేశం ఆ టర్మినేటర్ విత్తనాలతోనే పంటలు పండిస్తోంది.

ఉండటానికి ధాన్యం ఉంది.

కాని అవేవి మొలకెత్తవు. అదే వాటి ప్రత్యేకత.

రోజులు గడుస్తున్నాయి. యుద్ధం ఆగడం లేదు.

విత్తనాలు సరఫరా జరగడం లేదు.

## కొత్తగాలి...

**కాకి ఎగురుతోంది**
**ఒంటరిగా**
**ఉమ్మడి కుటుంబం నుంచీ**
**వేరైంది కాబోలు**

*-యలమర్తి అనూరాధ,* పెనుగొండ



దేశంలో ఎక్కడా మొలకెత్తడం లేదు.

చిగిర్చడం లేదు. పూయడం, ఫలించడంలేదు.

ఉన్న ధాన్యం నిలువలు అయిపోయాయి.

రైతుకు అసలు పనే లేదు.

విత్తనమే లేని దేశంలో రైతుకు పనేం ఉంటుంది.

ఆకలి... హాహాకారాలు.

ఆకలి చావులు, ఎటు చూసినా శవాలు.

మొలకెత్తే విత్తనం లేని జాతి నశించడం సహజం.

మొలకెత్తే విత్తనాల సృష్టి వారికే సొంతం. వాళ్లు ఇస్తే మనం కొనుక్కోవాలి. అందుకు వాళ్లు చెప్పినట్టు వినాలి. కాదంటే... పరిణామం ఇదే అని చెపుతున్నాయి ఆ దేశాలు.

ఆకలికి తట్టుకోని మనుషులు ఏమైనా తినడానికి సిద్ధమవుతున్నారు.

ఆకులు, అలములు తిని బ్రతుకుతున్నారు. చెట్టు చేమ తింటున్నారు.

జంతువులను ఎప్పుడో తినేశారు. ఇంకా ఏమీ మిగలలేదు.

ఆకలికి మనిషిని మనిషి తినే ఆలోచన కొనసాగుతుంది.

మనుషులు గుంపులు గుంపులుగా మసలుతున్నారు.

మనిషిని మనిషి చంపుకు తినడానికి వెనకాడడం లేదు. ఎప్పుడు ఎవరు ఎవర్ని చంపుతాడో, తింటాడో తెలియని దుస్థితి.

ఒక మనిషిని చంపి తినడానికి, మనుషుల గుంపు.. పరుగు... హాహాకారాలు... ఆర్తనాదాలు.

విత్తు ముందా? చెట్టు ముందా? అనే ప్రశ్నను వెర్రితలలు వేస్తున్న విజ్ఞాన శాస్త్రం ఛేదించి, విత్తే ముందు అని తేల్చి పారేసింది. అందుకే చెట్లు ఎన్ని ఉన్నా, అసలు విత్తనం నుండే విత్తనాల ఉత్పత్తి, చెట్టు నుండి గింజలు, కాయలు పండ్లే తప్ప వాటిలో ఏ అంకురం ఉండదు. వాటిలో పునరుత్పత్తి శక్తి శూన్యం.

అందుకే మనిషి ఆకలి కోసం మనిషినే వేటాడే దశ.

ప్రాణమున్న మనిషినే వేటాడి కడుపు నింపుకునే దశలోకి వెళుతున్నాడు. మనిషి కోసం... మనిషి పరుగు... బలవంతుడి చేతిలో బలహీనుడు బలి...

మనిషి తన అస్తిత్వం కోసం ఆకలి కోసం ఏమైనా చేసే స్థితి.

కళ్లు మూసి పడుకున్న రామకృష్ణను ఒక మానవ భక్షకుల గుంపు చుట్టుముట్టింది. ఒక మేక మీద పది తోడేళ్ల గుంపు పడ్డట్టుంది. ఒకరు చేయి, ఒకరు కాలు, ఒకరు మెడ... యిలా తలా ఒక శరీర భాగాన్ని దొరికించుకొని గోళ్లతో రక్కుతూ, నోటితో కరిచి కండ లాగుతుంటే రామకృష్ణ ప్రాణం విలవిలాడుతోంది. గిజగిజ కొట్టుకుంటోంది.

రామకృష్ణకు ఒక్కసారి మెలకువొచ్చింది.

ఇంతవరకు చూసింది కల... భయంకరమైన కల.

దూదిపూల స్వప్నం చెదిరి పత్తి పూల దుఃఖంలోంచి పుట్టిన కల.

టెర్మినేటర్ విత్తనాలతో రాబోయే ఈ దేశం భవిష్యత్ చిత్రం... ఆ కల.

కల అయినా ఎంత వాస్తవంగా ఉంది. ఎంత భయంకరంగా ఉంది.

టెర్మినేటర్ విత్తనాలు ఈ దేశంలో చొరబడితే... ఈ దేశం పరిస్థితి రాబోయే కాలంలో కలగన్న దానికంటే మెరుగ్గా గాని, భిన్నంగా గాని ఏమీ ఉండబోదని రామకృష్ణకు అర్థమయ్యింది.

విత్తనాలను మానవ జాతి సంతరించుకోవడం ఒక యజ్ఞం కాబోతుంది.

భయంకరమైన టెర్మినేటర్ కల రామకృ

ష్టను మరోమారు విత్తనాల సేకరణ, సంరక్షణ యజ్ఞానికి ఉన్ముఖీకరుణ్ణి చేసింది.

★ ★ ★

రామకృష్ణ పల్లెపల్లెకు తిరుగుతున్నాడు. అంగళ్లు, సంతలు రామకృష్ణ ప్రచార వేదికలు. రామకృష్ణ యిప్పుడు ఒంటరి శక్తి కాదు. అతనికి తోడు ఒక విశ్వనాథం, గురువులు, రాములు, బక్కన్న ఉన్నారు. పత్తిపూల దుఃఖంలోంచి తేరుకున్న బక్కన్న కొన్నాళ్లకు తిరిగి మనిషై రామకృష్ణతో తిరుగుతున్నాడు.

ఉన్న ఒక్క పత్తి పంట కాస్త నేలమట్టమైపోవడంతో చాలా మందికి చేలో పనే లేదు.

అందరూ ఒక జనశక్తిగా పల్లెపల్లెకు తిరిగి 'పురుగు కాటేసే పంటలు మనకొద్దు' ప్రాణాలు పణంగా పెట్టి పండించే పంటలు మనకొద్దు. మన దేశీయ విత్తనాలే మనకు శ్రీరామరక్ష, విత్తనంలోనే జాతి శ్రేయస్సు ఉంది. క్లోనింగ్‌లు, టర్మినేటర్లు జాతి వినాశకారకాలు. అవి మనవి కావు" - అంటూ అందరూ అన్ని దిక్కులా ప్రచారం చేస్తున్నారు.

పత్తి పూల దుఃఖంతో బరువెక్కిన ప్రతి రైతు రామకృష్ణ మాటల్లోని నిజాన్ని గ్రహించారు. అతడి అడుగులో అడుగేసి నడుస్తున్నారు.

రామకృష్ణ మాటల ప్రభావం అటు పల్లెలో నుంచి పట్టణాలకు వ్యాపించింది. రామకృష్ణ మాటలు ఒంటబట్టిన ప్రతి రైతు ఒక రామకృష్ణే నేడు. పత్తి పూల దుఃఖంలోంచి తేరుకున్న రైతు ఆలోచిస్తున్నాడు. ప్రశ్నిస్తున్నాడు. తర్కిస్తున్నాడు.

ఊరు-వాడ, అంగడి-సంత, పల్లె-పట్నం, ఎక్కడ చూసినా ఒకటే మాట, ఒకటే నినాదం, ఒకటే వాదం. అందరి మనసుని, మెదళ్లని ప్రశ్నిస్తున్నాయి ఒక ఉద్యమంలా.

## కొత్తగాలి...

**మరణించిన తర్వాత**
**మన జీవితం**
**మరో మనిషికి**
**ఒక మధుర జ్ఞాపకం కావాలి**

*–తలకట్ల మహీపాల్‌రెడ్డి, గాంధీనగర్, హైదరాబాద్*

ఇరవై ఐదేళ్లపైనే మేము పత్తి పండించాం. అయినా మాకేం మిగిలింది. మిద్దెలా, మేడలా, మణులా, మాణిక్యాలా, నగలా, ఏమీ లేదు. అప్పులు, బాధలు, చివరికి ఆత్మహత్యలు యివేగా మనకు దక్కింది.

"ఇత్తునుండి పది ఇత్తులు పండించే మనల్ని ఇత్తనాల కోసం దేబరించేలా చేసింది లోకం. ఇత్తనాల కోసం ఎండలో పడిగాపులు గాస్తే పోలీసు లాఠీలతో తన్నించారు" అన్నాడు దేవన్న.

"వందలూ వేల రూపాయలు పోసి కొన్న ఇత్తనం మొలకెత్తక పోయినా, తప్పుడు చెట్లు మొలుచుకొచ్చినా ఎక్కడ చెప్పుకోవాలో తెల్వదీ దేశంలో" అన్నాడు రాములు.

"ప్రాణం లేని ఇంటికి, బండికి, రాయికి, రప్పకు, మిల్లుకు, మనిషికి భద్రత కల్పించే నిమిత్తం భీమా చేసే యీ ప్రభుత్వం పేద రైతు పంటకు భీమా చేయనీయదు" అన్నాడు బక్కన్న.

పండించే వాడికి ధర నిర్ణయించుకునే హక్కు లేదు. ప్రభుత్వం పట్టించుకోదు. పండించి యీ పైసల పంటలను అమ్మిందే గతి లేదు. తినలేం. దాచుకోలేం. అమ్మడం ఒక్కటే మార్గం. కొనడంలో పత్తి, పొగాకు అంతా దివాళ కోరుతనమే. అందుకే మాకీ గతి పట్టింది





నేడు. అందుకే యిక మేం యీ పత్తి పంటను పండించం" అన్నారొకరు.

"విత్తనాల కోసం ఎరువుల కోసం, మందుల కోసం, అప్పుల కోసం మీ యింటి చుట్టూ బానిసల్లా తిరగం" అన్నారింకొకరు.

"ఇంతవరకు పత్తి పంట కోసం చేసిన ఏ అప్పును ఎవరూ కూడ తీర్చరు. తప్పుడు విత్తనాలు, ఎరువులు, మందులు యిచ్చి మమ్మల్ని అప్పుల్లోకి తోసి, ఏళ్ల

తరబడి లాభాలను దండుకున్న మీకు మేం ఏమీ బాకీ లేం. ఏ న్యాయస్థానం ముందయినా మేం చెప్పే సమాధానం యిదే" అని ఇంకొకరన్నారు.

"ఇక ముందు మనమంతా యీ పైసల పంటలను వదిలి ధాన్యం, నూనెగింజలు, కూరగాయలు పండిద్దాం. అందులోనే రైతు సంక్షేమం ఉంది"

"మన పత్తి పంటతో కోట్లకు ఎదిగి, పత్తిమీద ఆధారపడే యిన్ని జిన్నింగ్, ప్రెస్సింగ్, ఆయిల్ మిల్లు, రిఫైనరీలు, దారం మిల్లులు నిర్మించుకున్న వీళ్లు, మేం రేపు పత్తి పండించకుంటే యీ మిల్లులన్నీ ఎలా నడుపుకుంటారో చూస్తాం" అని ఒకరు.

"రైతు ఒకడికి పెట్టేవాడే కాని అడుక్కునేవాడు కాదు. మా కోసం మీరే ప్రయోగాలు చేయవలసిన పనిలేదు. ఏ విదేశీ కంపెనీలను మోకరిల్లి దేబిరించనవసరం మాకు లేదు" అన్నారు ముక్తకంఠంతో.

"పత్తి మత్తు దిగిపోయింది మాకు. అప్పులు, బాధలు అన్నింటిని ఎదిరిస్తాం. కాదని అడ్డుకునే వాడితో మా పలుగు పారతో పోరాడి గెలుస్తాం"

జనం మాటల్లో కసి, క్రౌర్యం ధ్వనించాయి.

పల్లె ప్రజల మాటలు వింటున్న బస్తీ జనం, వ్యాపారులు దిగ్భ్రాంతి చెందారు.

రామకృష్ణ మాటలతో అంతర్ముఖమైన పల్లెలు పత్తిని పూర్తిగా వెలివేశాయి.

పత్తిపూల స్వప్నంలోంచి మేల్కొని, దూది పూల దుఃఖంలోంచి తేరుకున్న పల్లెలవి. ఆ పల్లెలో నేడు మళ్లీ ధాన్యం, నూనెగింజలు, కూరగాయల సాగుకోసం నాగళ్లు నడుస్తున్నాయి.

బక్కన్న, గురువులు, రాములు, ఇస్తారి, రాజయ్య, దేవన్న అందరూ...

మోసం చెయ్యని విత్తనాలతో...

మళ్లీ మళ్లీ మొలకెత్తే విత్తనాలతో...

పెంట ఎరువులతో, ఏపుగా పెరిగే విత్తనాలతో...

మందు మాకులు అవసరం లేని విత్తనాలతో...

దిగుబడి తక్కువొచ్చినా తప్పకుండా వచ్చే విత్తనాలతో...

సాగుకోసం నాగళ్లు నడుపుతూ... రేపటి ఉదయం కోసం ముందుకు నడుస్తున్నారు.

విశ్వనాథంకు పల్లెల బతుకులో మార్పు తెచ్చేది ఏమైనా చేయాలని ఉంది. అది ఈ పల్లెను, కొన్ని వందల కుటుంబాలకు మేలు చేసేదిగా ఉండాలి. తాను బుద్ధి తెలిసినప్పటి నుండి మనిషి తన కృషితో పట్టుదలతో ఊహించని విజయాలను సాధించినట్టు తెలుసు. అందుకు ఒక కృత నిశ్చయానికి వచ్చినట్టు తన నిర్ణయాన్ని జానకికి తెలియజేసాడు. జానకి అతడి నిర్ణయానికి ఎంతో సంతోషించింది.

"చూడు జానకీ, ఈ చివరి దశలో ఏదైనా చెయ్యాలనిపించింది. అందుకు మన డబ్బుని, ఆస్తి పాస్తులను పణంగా పెడ్దామనుకుంటున్నా. ఇంకా బతికినంత కాలం బతకం. మన పిల్లలు ఎలాగూ హాయిగానే ఉన్నారు. ఈ ఆస్తిపాస్తులు వాళ్లకో లెక్కకాదు. అందుకని వీటిని ఈ ఊరికోసం పెట్టుబడి పెడదాం. మన ఆశయం ఫలిస్తే మనవి మనకే ఉంటాయి. ఓడిపోతే ఇవన్నీ పోయి నాకు నీవు నీకు నేను ఉంటాం. ఏమంటావ్?" అన్నాడు.

"మీ ఇష్టం. మీకేది మంచి అనిపిస్తే అదే చేయండి. నాకు మీ కన్నా ఎక్కువ తెలుసా ఏంది? ఇక ఈ ఆస్తిపాస్తులపై నాకే మమకారం లేదు. ఊరి బాగుకోసం మీరేం చేసినా నాకు సమ్మతమే" అంది జానకి.





## కొత్తగాలి...

**ఇపుడు రచనలు ఎక్కువగా చేస్తున్నాను కారణం-టీవీ రిపేరొచ్చింది**

-చలపాక ప్రకాష్, విజయవాడ

ఒక ఆదివారం పని కట్టుకొని ఊరివారందరికీ కబురు పంపి అందర్నీ ఒకచోట చేర్చి సమావేశం ఏర్పాటు చేసారు.

"అందరికి రాం రాం. మారుతున్న కాలంలో మారలేక కొన్నిసార్లు మారే అవకాశం లేక నేడు మన పల్లెలు బోసి పోతున్నాయి. దేశానికి పట్టుకొమ్మలు పల్లెలు అని చెప్పడమే కాని వాటిని పట్టించుకునే వారు లేరు. ఎవరో వస్తారని, ఏదో చేస్తారని మనం అనుకోవడం మన తప్పు. మనల్ని మనమే ఉద్ధరించుకోవాలి. మనం ఒకరికొకరు చేయూత నిచ్చుకోవాలి. మనం పల్లెల్లోనే ఉండి ప్రగతిని సాధిద్దాం. రెక్కలొచ్చి ఎగిరిపోయిన నా కొడుకు లాంటి వారి గురించి ఆలోచించడం లేదు. కాని ఏదో ఆశించి ఇక్కడ ఇమడలేక ఏదో సాధిద్దామని, ఏమీ సాధించక పట్నాలలో ఊడిగం చేసి మీ బతుకులను అర్థం లేకుండా చేసుకోకండి. మన సమస్యలను మనం చర్చించుకుందాం. మన స్థితిగతులను, వనరులను మన శక్తిని అంచనా వేసుకుందాం. నేడు కాలం మారింది. ప్రభుత్వం ఎన్నో కార్యక్రమాలలో మనకు చేయూతనిస్తుంది. బ్యాంకులు తమ వంతు సహకారాన్ని అందిస్తాయి. మన మందరం కలిసికట్టుగా శ్రమిద్దాం. ఒక కొత్త స్వర్గాన్ని నిర్మించుకుందాం" అంటూ ఆవేశంగా చెప్పుకొచ్చాడు.

అందరూ విశ్వనాథం వ్యక్తిత్వం తెలిసిన వాళ్లే కాబట్టి ఎవరూ అతడి చిత్తశుద్ధిని శంకించలేదు.

"మనమేం చెయ్యాలో చెప్పండి, నాకైతే ఇక్కడ చేయడానికి ఏమీ కనిపిస్తలేదు" అన్నాడు బస్తీనుంచి వచ్చిన గాండ్ల మల్లయ్య మనువడు.

"మీరు చూసిన ప్రపంచం చిన్నది. అందులోంచి తెలుసుకున్నది కొద్దిగా. ప్రపంచం ఎంత తీరైంది. మనిషి తాను బతకడానికి ఎన్ని రకాలుగా ప్రయత్నిస్తాడు. మీకు కళ్లముందు చూపిస్తాను. వాళ్లతో మిమ్మల్ని పోల్చుకోండి. అక్కణ్ణించి వచ్చాక మనమేం చేయాలో మనమందరం కలిసి నిర్ణయిద్దాం" అని విశ్వనాథం అనడం అందరికీ నచ్చింది.

"మొదట మనం ఒక బస్సు మాట్లాడుకొని చూడాల్సినవి చూసి వద్దాం. ఈ ప్రయాణం ఖర్చులు మీరేమీ యివ్వద్దు. అంతా నేనే భరిస్తా. అన్నీ కంటితో చూసి అదే పని మన ఊళ్లో అయితే చేయగలమా? లేదా అని ఒక్కటే ఆలోచించండి. ఎలా చేయాలి? దానికి అవసరమైన అన్ని వసతులు, ఖర్చులు నేను చూసుకుంటా" అని విశ్వనాథం అనడంతో అందరూ సై అంటే సై అన్నారు.

"మనిషికి తెలివి ఉండాలి కాని దేన్నయినా నేడు అమ్ముకొని బతకొచ్చు. నేడు నగరాల్లో నీళ్లమ్మి, ఊరగాయలమ్మి, ఉప్పమ్మి, పిండి అమ్మి, అప్పడాలమ్మి, కొత్తిమీర మెంతికూరలను ఎండబెట్టి అమ్మి, వక్కలమ్మి లక్షలు, కోట్లు గడిస్తున్నారు. అదే పని మనమెందుకు చెయ్యలేం. మీరే చూస్తారు. మనిషి ఏం చేయగలడు. ఏం చేయలేడు అనేది. తొందరలోనే మన ప్రయాణం. అందరూ వారం రోజుల ప్రయాణానికి సిద్ధమై రండి. మన ఊరి నుంచే బస్సు బయలుదేరుతుంది" అంటూ ముగించాడు విశ్వనాథం

ఇంటర్‌నెట్‌లో సంప్రదించి రామకృష్ణను కూడ తమతో రావాల్సిందిగా కోరాడు విశ్వనాథం.

వారంరోజుల తర్వాత విశ్వనాథంగారి నేతృత్వంలో సుమారు వందమంది ఊరి వాళ్లు బస్సులో బయలుదేరారు. అన్ని కులవృత్తుల వాళ్లు, అన్ని కులాలవాళ్లు, యువకులు, వృద్ధులు, చదువుకున్నవారు, చదువుకోనివారు అంతా బయలుదేరారు. బస్సు బయలుదేరే సమయానికి రామకృష్ణ కూడ వారితో చేరిపోయాడు. బస్సు మొదట ధనోరా(కె) గ్రామంలో ఆగింది.

మొట్టమొదట ఒక గ్రామం చేరారు. ఈ గ్రామం చేరేవరకు రోడ్డుకు పది కిలోమీటర్ల పొడుగుతా రెండువైపులా టమాటా తోటలు. ఎటుచూసినా టమాటా తోటలే. కనుచూపుమేర యింకో పంటలేదు.

"ఒకప్పుడు ఈ గ్రామాల్లో రోడ్డుకు ఆనుకొని ఉన్న చేలల్లో ఒకర్ని చూసి, ఒకరు గత పదేళ్లలో టమాట పండించడం మొదలయింది. ఇప్పుడు ఆదిలాబాద్, కరీంనగర్, నాగపూర్ మార్కెట్‌లలో వీరి దిగుబడులను అమ్ముతారు. వీళ్లెవరు కాలు కదపరు, మార్కెట్‌కు వెళ్లరు. కొనేవారే వీళ్ల పొలం దగ్గరికొచ్చి సరుకు కొనుక్కొని పోతారు" అంటూ వివరించాడు విశ్వనాథం.

బస్సులోని వ్యక్తులు ఆ ప్రదేశమంతా తిరిగారు. ఎన్నో ప్రశ్నలు వేసి తమ అనుమానాలు నివృత్తి చేసుకున్నారు. బస్సు తిరుగుముఖం పట్టింది. రోడ్డుకు ఇరువైపుల వందలకొలది టమాటా గంపలు.

ఒక కొత్త ఆశ, ఒక వెలుగు వాళ్ల ముఖంలో చోటు చేసుకొంది.

"అందరూ ఈ ధనోరా(కె) చుట్టుపక్కల వందల ఎకరాల్లో పండిస్తున్న టమాటా పంటను గమనించారు కదా. ఈ పంటను నేడు రెండు మండలాల్లో రోడ్డువైపు గ్రామాలు పండిస్తున్నాయి. లాభాలు గొప్పగా లేకున్నా బతుకు గడుస్తోంది. కాని మనం ఇదే పంటను ఇంకా మెరుగ్గా సామూహిక పద్ధతుల్లో పండిద్దాం" అని విశ్వనాథం అంటుంటే,

"ఈ పంటను తెంపిన కూలి కూడ గిట్టక మార్కెట్‌లో లారీని గుమ్మరించి తొక్కేసి పోయిన రోజులు కూడా ఉన్నాయి" అన్నాడు ధనోరా రైతు ఒకరు.

"పండించిన పంటను గిట్టుబాటు ధరకు అమ్మాలి. లేదంటే దాచుకోవాలి. దాచుకోలేనప్పుడు రూపం మార్చి అమ్మే తెలివి రైతుకు కావాలి. అదే మనం చేయబోయేది" అన్నాడు రామకృష్ణ.

బస్సు మరో ఊరిలో ఆగింది. ఆ ఊరి చుట్టుపక్కల అన్నీ పూల తోటలే. మల్లెలు, కనకాంబరాలు, గులాబీలు, పూలతోటల మధ్య తిరిగి అక్కడి రైతుల అనుభవాలు తెలుసుకొని ఆశ్చర్యపోయారు. అక్కడ ఆ రైతులు పండించిన పువ్వులు ప్రపంచ దేశాలకే ఎగుమతి అవుతున్నాయని తెలుసుకొని విస్తుపోయారు.

అక్కణ్ణుంచి సుగంధ ద్రవ్యాల తోటలను, మందు మొక్కల తోటలకు, సంకర విత్తనాలు సీడ్‌ఫాంకు వెళ్లి వారి అనుభవాలు, దిగుబడి, రాబడి తెలుసుకొని రైతుకు యింత ఆదాయం యిచ్చే పంటలున్నాయా అని ఒకింత సంభ్రమంలో మునిగిపోయారు.

"ఈ ఊరి పేరు అంకాపూర్. ఇది ఒకప్పటి మన పల్లెలాంటిది. కాని నేడు వీళ్లు లక్షాధికారులు. తమ తలరాతను తామే మార్చుకున్న కష్టజీవులు. వీరు బహుళ జాతి సంస్థలకు దీటుగా సంకరజాతి విత్తనాలు రూపొందిస్తారు. పండే పంట చాలా తక్కువ. కాని ధర కిలోకు వందల్లో ఉంటుంది. చదువుకున్న వాళ్లు, చక్కటి పరిశీలన, నైపుణ్యం ఉన్నవాళ్లు అన్ని

కాలాల్లో ఈ రకం సేద్యం చేయొచ్చు. ఆడ వాళ్లకుచాలా అనుకూలమైన సేద్యం ఇది" అంటూ వివరించాడు వ్యవసాయ విస్తర ణాధికారి మురళీధర్.

వీరి రాక గురించి వారం రోజుల ముందే సమాచారం అందుకున్న వ్యవసాయశాఖ వీరి క్షేత పర్యటనకు పూర్తి ఏర్పాట్లు చేసింది. సాయంత్రం వరకు ఎవరి ఇష్టం వచ్చిన క్షేతంలో వాళ్లు తిరిగారు. అనుమానాలు నివృత్తి చేసుకొన్నారు. వారి జీవనశైలి, ఆర్థిక స్థితి చూసి ఆశ్చర్యపోయారు.

అక్కణ్ణించి మహారాష్ట్రలోని అన్నాహజారే రాలేగావ్ సిద్ధికి వెళ్లారు. ఒక వ్యక్తి సమిష్టి కృషితో ఒక గ్రామం ఎంత సస్యశ్యామలం కాగలదో తెలుసుకోవడానికి ప్రత్యక్ష ఉదాహరణ ఆ ఊరు.

అన్నాహజారే కలల స్వర్గం రాలేగావ్ సిద్ధి చేరుకునే సరికి వారికి స్వాగతం పలకటానికి ఒక రిసెప్షన్ కమిటీ సిద్ధంగా ఉంది. వెళ్లాల్సిన ప్రతి ఊరికి, ముందే తమ ప్రణాళిక, తమ క్షేత పర్యటన లక్ష్యాన్ని విశ్వనాథం గారు ఉత్తరాల ద్వారా, ఫోన్ ద్వారా, ఇంటర్‌నెట్ ద్వారా తెలపడంతో ప్రతిచోట యీ బృందానికి కావలసిన ఏర్పాట్లు, భోజన వసతి, క్షేత పర్యటన, అనుభవజ్ఞులు తమ అనుభవాలు తెల్పడం జరుగుతోంది.

వచ్చినవాళ్ళు బస్సుదిగి వారిచ్చిన ఆతిథ్యం స్వీకరించేలోగా అన్నా హజారే గారు వస్తున్నట్టు సమాచారం చేరింది. అన్నా హజారే నేడు ఇంటర్నేషనల్ పర్సనాలిటి. ఆయన చేపట్టిన కార్యక్రమాలు ఎందరికో స్ఫూర్తి కలిగిస్తున్నాయి. పత్రికల్లో చదివి, టి.వి. చానల్లో చూసి తరచూ అనేకమంది వ్యవసాయ క్షేత పర్యటకులు, విదేశీ టి.వి. ఛానళ్ల వాళ్లు, రాష్ట్ర ప్రభుత్వ అధికారులు వస్తూ పోతూ ఉంటారు.

## కొత్తగాలి...

**బియ్యపు గింజపై**
**చిత్రం అద్భుతమే**
**అది అన్నంగా మారితే**
**మరీ అందం**

*-ఎస్.ఆర్. భల్లం, తాడేపల్లిగూడెం*

ఇలా వ్యక్తులు రావడం, వెళ్లడం చాలా పరిపాటి అయిందని అన్నాహజారే అభిప్రాయం. అందుకని పెద్దగా పట్టించుకోడు. ఇలా వచ్చే వాళ్లలో రాష్ట్ర ప్రభుత్వ బృందాలే ఎక్కువ. రామకృష్ణతో ఉన్న పరిచయం కారణంగా అన్నాహజారే విశ్వనాథం బృందానికి ప్రత్యేకంగా ఆహ్వానం పలికారు.

"రాం రాం అన్నా సాహెబ్" అంటూ పలకరించాడు రామకృష్ణ. "సబ్‌కో రాం రాం" అంటూ చిరునవ్వుతో బదులిచ్చారు అన్నాహజారే. "అన్నా హజారే అంటే చెయ్యెత్తు మనిషనుకున్న. యింకా ఎట్లెట్లనో ఉంటాడని అనుకున్నా" అన్నాడు నర్సిగాడు.

"మనిషి రూపం, రంగు పుష్టి లేదు గాని మస్తు పేరున్నది. మస్తుసార్లు ఇన్నా. ఇయ్యాల్ల చూసుడయింది" అన్నాడు దేవన్న. అన్నాహజారే తనకు తాను పరిచయం చేసుకోవడంతో మొదలు పెట్టాడు. మాట అంతా హిందీలో, మరాఠీలో సాగుతోంది.

"నేను ఒక మామూలు సాదా సీదా మనిషిని. బ్రతకడానికి మిలటరీలో చేరిన. అక్కడ రిటైరయినంక కొద్దిపాటి పెన్షన్ పైసలతో మా ఊరు యీ రాలేగాం వచ్చిన. ఇంకా శక్తి సామర్థ్యాలున్నాయి.



ఉన్న ఊళ్లో ఏదన్న చేద్దామన్న ఆలోచనతో యిక్కడికి వచ్చిన. కాని ఇక్కడ పరిస్థితి ఏమీ బాగా లేదు. నీటి వసతి లేదు. పాత తరం వ్యవసాయం పద్ధతిలో మా బంధువులే వ్యవసాయం మాని ఏదో చేస్తున్నారు. నేను యిలాంటి పరిస్థితిలో ఏం చేయాలో అర్థం కాలేదు. మొదట నీటివసతి కల్పించుకోవాలి. వర్షాధార నీటిని వినియోగించుకోవాలి. పూర్వ కాలంలా చెరువులు తవ్వే పరిస్థితి లేదు. ఆధునికంగా డామ్‌లు కట్టే శక్తి లేదు.

చిన్న చిన్న కట్టలు కట్టి నీటిని నిలువ చేసి పంటలు పండించే పద్ధతికి మేం నాంది పలికాం. దాన్నే వాటర్ షెడ్ పథకం అన్నారు తర్వాత. వర్షాధారంతో ఏటవాలు ప్రదేశాలు, ఎక్కడికక్కడ గుర్తించి యీ వాటర్‌షెడ్‌లను నిర్మించి పంటలు పండించడం మొదలు పెట్టాం. వేసే పంటలో కూడా మార్పులు చేసాం. నేడు యిక్కడ వ్యవసాయం పరవాలేదు. ఇది ఒక వ్యక్తిగా నేను చేసిన కృషి. అందరి సహకారంతో నేడు రాలేగాంసిద్ది యీ రూపంలో ఉంది" అంటూ వివరించాడు.

"అన్నాహజారేగారి ఆలోచనను, కృషిని గుర్తించి యీ రాష్ట్ర ప్రభుత్వం వీరికి అన్ని రకాల సౌకర్యాలు, శాస్త్ర సాంకేతిక సహకారం అందిస్తోంది" అన్నాడు రామకృష్ణ.

"ప్రభుత్వమే అన్నీ చేయాలని మనం అనుకోవద్దు. మన కోసం మనమే శ్రమించాలి. అందరూ సమిష్టిగా శ్రమిస్తే ఆ శ్రమ ఫలం వేగంగా ఉంటుంది" అన్నారు అన్నాహజారే.

మళ్లీ తనే "మా రామకృష్ణ, విశ్వనాథం ఒక కొత్త ఆలోచనతో ముందుకొచ్చారు. మీ చేతులను కలపండి. తిరుగులేని ఒక కొత్త శక్తిగా మీరు ఎదుగుతారనే నమ్మకం నాకు ఉంది" అంటూ ముగించాడు.




ఒక్కొక్క మజిలి ఒక్కొక్క కాంతి కిరణం.

అందరూ తమలాంటి మనుషులే.

అందరివీ ముందు తమలాంటి అరకొర జీవితాలే.

ఎవ్వరూ పెద్దగా చదువుకున్నవాళ్లు కాదు.

అయినా స్వయంకృషితో, తెలివితో, పట్టుదలతో ఆలోచనలతో నేడు ప్రపంచానికే ఆదర్శమయ్యారు అని అందరూ అనుకున్నారు. ప్రయాణంలోనే తర్జన భర్జనలు మొదలయ్యాయి. ఎవరూ ఏం చెయ్యగలరు? ఎవరు ఏంచేస్తే బాగుంటుందని. అప్పుడే వాళ్లలో వాళ్లే నిర్ణయించుకున్నారు. వారి ఆలోచన ధోరణి, ఉత్సాహం చూసిన విశ్వనాథంకు ఎంతో తృప్తి, ధైర్యం కలిగాయి.

వారం రోజుల ప్రయాణం ముగిసింది.

వచ్చిన వారం రోజులకు ఊరి సహకార సంఘం నెలకొల్పబడింది. మొదటి ప్రయత్నంగా ఊళ్లోంచి వెళ్లి పోయిన వాళ్లందరూ తిరిగి ఊళ్లో మకాం పెట్టారు. పిల్లల చదువుకోసం పాఠశాలను పునర్వ్యవస్థీకరించారు. పిల్లల చదువు, ఆరోగ్యం, వినోదం, గురించి విశ్వనాథంగారు పూర్తిగా తన డబ్బునే వినియోగించాలని నిర్ణయించుకున్నారు.

సహకార సంఘం తరపునుండి ఊరి

భూములన్నీ భూసార పరీక్ష చేయించారు.

కులవృత్తులు కొనసాగించాలనే వారికి ప్రభుత్వం ప్రత్యేక శిక్షణ ఇచ్చి సబ్సిడీ ధరల్లో పనిముట్లను సమకూర్చింది.

"నర్సిగాడు ముందటి పాతరకం చెప్పులు కుట్టె తొడిగేది లేదు. కొత్త తరీఖున కొత్త నమూనాలు పనిచేయాలి" అన్నాడు నర్సిగాణ్ణి విశ్వనాథం.

"బక్కన్నా! ముందటి తీరు వ్యవసాయం వదిలిపెట్టు. కూరగాయలు పండించు. పూలమొక్కలు పెంచు, సంకరజాతి విత్తనాలు ఎలా తయారు చేసుకోవాలో నేర్చుకో" అంటూ బక్కన్నను ఉత్సాహపరిచారు.

"మనమంతా కష్టపడితే మన ఊరు ఒక రాలేగావ్ సిద్ధి అవుతుంది. ఒక అంకాపూర్ అవుతుంది. మారుతున్న కాలంతో రైతు మారాలి. రైతు ఉత్పత్తులు మారాలి. రేపు అన్నీ మనకాళ్ల దగ్గరకే వస్తాయి. నేనేం అభూత కల్పనలు చెప్పడం లేదు. నిజాలను మనం కళ్లతో చూస్తాం. మన కలల్ని మనం సాకారం చేసుకుందాం.

కష్టించే చేతులు రైతులు- ప్రపంచాన్ని శాసించాలి. కాని ప్రపంచం రైతును శాసించొద్దు.

ఈ విషయంలో మనం ప్రపంచానికి మరో ఆదర్శం అవుదాం.

క్షేత్ర పర్యటన ముగించుకొని వచ్చాక అందరూ ఒకనాడు సమావేశమయ్యారు. సమావేశానికి విశ్వనాథం, జానకి, రామకృష్ణ, బక్కన్న, భూదేవి, దేవన్న, నర్సిగాడు, అతడి కుటుంబం యిలా ఊళ్లో ఉన్న అందరూ వచ్చారు. ఆ రోజు ఆదివారం కావడంతో బయట ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళు కూడా హాజరయ్యారు.

విశ్వనాథం, రామకృష్ణ ముందుగా ఒక ప్రణాళిక అనుకున్నారు. ఆ ప్రణాళిక ప్రకారం ఎవరెవరు ఏం మాట్లాడాలో నిర్ణయించుకున్నారు. ఏ పనైనా ఒక నిర్దిష్టమైన ప్రణాళికతో చేయాలనేది వాళ్ళ ఆలోచన.

ఏ పనికైనా ప్రేరణ, స్ఫూర్తి అవసరం. క్షేత్ర పర్యటన అనుభవంతో ఊరి వాళ్ళలో ఒక ఉత్తేజం, ఉత్సాహం పుట్టుకొచ్చాయి.

తాము కొత్తగా చూసొచ్చిన ప్రదేశాల్లోని విషయాలు, అంశాలు తను ఊళ్లో తామెందుకు అమలు పరచకూడదనే ఆలోచన అందరి మెదళ్ళలో మెదులుతుంది.

మొదట రామకృష్ణ లేచి "మన క్షేత్ర పర్యటనలో మనం చూసిన వాటితో మీరేం తెలుసుకున్నారో దయజేసి చెప్పండి. మొదట బక్కన్న మాట్లడతాడు" అనగానే బక్కన్న తడబడ్డాడు.

"నేను ఏమి మాట్లాడుత సామీ. మీ ముందు మాట్లాడేటంతటోణ్ణా" అన్నాడు బక్కన్న.

"అది కాదు బక్కన్న. నీకు ఏమనిపించిందో చెప్పు"

"ఏమేమో అనిపించింది. తాతముత్తాతల నుండి పండించే పంటలనే పండించి మోసపోతున్నం. కాలంను బట్టి మారాలనేది తెలిసింది. తిండి దినుసులు, పత్తే కాదు యింకా చానా పంటలు పండించొచ్చని తెలిసింది"

"అ పనులు నువ్వు భూదేవి చేయగ

## కొత్తగాలి...

**టీవి వచ్చింది**
**మాటలను దూరం చేసింది**
**సెల్‌ఫోన్ వచ్చింది**
**మాటలను మిగిల్చి**
**మనుషులను దూరం చేసింది**

–చప్పు, పాములవలస, విజయనగరం జిల్లా



లరా?" అడిగాడు విశ్వనాథం. బక్కన్న ఒక్కక్షణం అలోచించి "చెయ్యొచ్చు. కాకుంటే మొదట్ల ఎవలన్న కొంతచెప్పాల" అన్నాడు బక్కన్న.

"మేం చాలా పెద్ద అలోచనతో ఉన్నాం. కాని ఒక్కసారే అమలు కాదు. మన మీద మనకు, మందికి కొంత నమ్మకం కలగా లంటే మనం ముందు ఒక ఏడాది మన పద్ధతులు మార్చుకుందాం. మరీ వాళ్ళ లాగా కాకుండా కొంతలో కొంత మార్చి వ్యవసాయం చేద్దాం. అందుకు అవసర మైన శిక్షణలు, ప్రణాళికలు రూపొందించు కుందాం. వచ్చే ఏడు ఉగాది నుండి మనం కొత్త ప్రపంచంలోకి పూర్తిగా అడుగేద్దాం. అందుకు ఇప్పట్నించే ఒక ప్రణాళిక, ప్లాన్ తయారుచేసుకొని ముందుకు పోదాం" అన్నాడు విశ్వనాథం.

"ఈ ఊళ్లో నుండి ఎంతమంది వలస పోయిండ్లో అంత మందిని తిరిగి రప్పిం చడం మన లక్ష్యం. ఈ ఊళ్లో మొత్తం జనాభా, వలసవెళ్లిన వాళ్లు ఎక్కడికి వెళ్ళారు? ఏం వృత్తి చేస్తున్నారు? నెలకు లేదా రోజూ ఎంత సంపాదిస్తున్నారు? మొదట మనం ఆ వివరాలు సేకరించాలి. వాళ్ళను కలవాలి. వాళ్ళు తిరిగి వచ్చేట్టు చెయ్యాలి. ఇది మన లక్ష్యం" అన్నాడు రామకృష్ణ.

మళ్లా తనే, "ఈ పని దుబాయ్ వెళ్ళి వచ్చిన ఫులాజి చేస్తాడు" అన్నాడు.

"నెల రోజుల్లో ఫులాజీ తిరగాల్సిన చోట్లు తిరిగి అన్ని వివరాలు సేకరించి పట్టుకొస్తాడు" అంటుంటే, ఫులాజీ "వాళ్ళంతా తిరిగి వస్తే వాళ్ళకు పని ఎట్లా చూపిస్తాం సార్" అన్నాడు.

"ఒక సంవత్సరం తర్వాత మనం అమలు పర్చబోయే బృహత్ ప్రణాళిక అమలుకు యీ సంవత్సరం కూడా చాలా మంది అవసరం. వచ్చిన వాళ్ళకు పని కల్పించబడుతోంది. ఉదాహరణకు యిప్పుడు నీకు నెల రోజులకు మన సంఘం తరపున పని కల్పించబడింది. చేయాల్సిన పనులు బోలెడున్నాయి. అవి చేయటానికి సరిపడ మనుషులే లేరు మనకు. మనుషులు అందుబాటులో ఉండ డమే దేశానికి పెద్ద వనరు. ఇక దాన్ని ఎలా ఉపయోగించాలో మీరే తెలుసుకుం టారు" అన్నాడు రామకృష్ణ

"ఈ ఊరి భూమిలో ఉండే క్షారాలు, లవణాలు, యితర సూక్ష్మ పోషక పదా ర్థాల వివరాలకు అశోక్, రమేష్‌లు శాస్త్రీయ పద్ధతిలో భూసార పరీక్షలు చేయించి నివేదికలు ఒక నెల లోపల సమర్పించాలి. ఈ పని మీరు చేయగలరా ఏమైనా ఇబ్బందా!"

"చేస్తాం, కాని ఏం చేయాలో మాకు తెల్వదు. మీరు ఇది చెయ్యి అంటే చేస్తం"

"అలా కాదు మొదట మీకు భూసార పరీక్షా కేంద్రంలో శిక్షణ యిప్పిస్తాం. త ర్వాతనే మీరు మీ పని మొదలుపెట్టండి"

"చాలా పెద్ద ఎత్తున వర్మీ కంపోస్ట్ ఎరువు తయారు చేసుకోవాలి మనం. దీనికి కూడా కొంతమందికి శిక్షణ యిప్పిం చడం జరుగుతుంది. దీనికి ఆడవాళ్ళయితే మంచిది. ఇష్టమున్న వాళ్ళు నిలబడండి" అన్నాడు రామకృష్ణ

"నాకు యిష్టమే" అంటూ జానకి నిలబ డింది.

అందరూ ఆశ్చర్యపోయారు.

అందరి కన్న ఎక్కువ విశ్వనాథం ఆశ్చ ర్యపోయాడు.

జానకిని అనుసరిస్తూ యింకా పది మంది స్త్రీలు నిలబడ్డారు. అందులో భూదేవి కూడా ఉంది.

"ఇదొక ఉద్యమం. అందరూ పాలుపం చుకోవాలి. జానకమ్మ లాంటి వాళ్ళు ముందుకు రావడం చాలా చాలా

సంతోషం"

"మన ఊరి బడిపంతులు, పంతులమ్మ ఈ ఊళ్లో చదువు మధ్యలో ఆపేసిన వాళ్ళ చదువు కొనసాగేలా చూడాలి. ఉదాహరణకు పదవ తరగతి ఫెయిల్ అయి ఉంటే మళ్లీ పరీక్ష కట్టించాలి. అలాగే ఇంటర్. ప్రతి ఒకరు కనీసం పదవ తరగతి వరకైనా చదవాలి. అసలే చదువురాని వాళ్ళ కోసం మీరు దగ్గరుండి ప్రత్యేక రాత్రి పాఠశాలలో, దినం పాఠశాలలో ఏదో ఒక ప్రత్యామ్నాయ ఏర్పాటు చేయాలి. దీనికి సంబంధించిన వివరాలు వారం రోజుల్లో అందించాలి. మీరు ప్రభుత్వ ఉద్యోగులైనా మీరు యీ ఊరి వాళ్ళకిందే లెక్క. కాబట్టి మీరు మీ వంతు సహకారాన్ని అందించండి" అన్నారు విశ్వనాథం.

అంతలో సహకార సంఘ బ్యాంకు వాళ్ళ జీబు వచ్చి ఆగింది. అందులోంచి బిలబిలమంటూ నలుగురైదుగురు దిగి సమావేశం దగ్గరికి వచ్చారు.

"క్షమించండి సార్. ఆలస్యమయింది. అదీగాక మీ ప్రతిపాదన మా హెడ్డాఫీసుకు తెలిపి వారి మౌఖిక అదేశం తీసుకున్నాక వద్దామనుకుంటే లేటయింది" అంటూ వచ్చిన వాళ్లు చెప్పారు.

"మీరు వచ్చారు సంతోషం. మా బృహత్ ప్రణాళికలో మొదట మీ అంశమే ఉంది. మీరు అవునంటే రైతులకు కొండంత అండ" అన్నాడు విశ్వనాథం.

"తప్పకుండా... మీ మాటలు విన్నాక నిజంగా నాక్కూడా మీకు ఏదైనా చేయాలని అనిపిస్తుంది. మీరు పెట్టిన ప్రతిపాదనకు మా హెడ్డాఫీసు అంగీకరించింది. ఇక మీ వాళ్ళు రావడమే ఆలస్యం"

"ఆ సంగతి మీరే చెప్తే బాగుంటుంది. అలాగే గుజరాత్ క్షీర విప్లవం గురించి కూడా వాళ్ళకు మీ శైలిలో వివరించండి" అన్నాడు రామకృష్ణ.

"అలాగే ప్రియమైన రైతు సోదరులకు, ఊరి ప్రజలకు, ఇతరులకు అందరికి వందనాలు. మేము కోఆపరేటివ్ బ్యాంక్ మనుషులం. మీ ఊరి నుండి వచ్చిన ప్రతిపాదనను మేము ఆమోదిస్తున్నాం. మొదటి విడతగా ప్రతి కుటుంబానికి రెండు మేలు జాతి పాడిపశువులు అప్పుకింద యిస్తాం. వాటి సంరక్షణకు అదనంగా యింకా కొంత సొమ్ము నగదుగా కూడా యిస్తాం. మీ పాలను, పాల ఉత్పత్తులను మాకే అమ్మాలి. ప్రతిరోజు ఉదయం, సాయంకాలం మా తరపునుండి ఏర్పాటు చేయబడిన పాల వ్యాన్ వస్తుంది. ప్రతి నెల కొంత అప్పుకింద మినహాయించుకొని మిగతా సొమ్ము మీ బ్యాంకు ఖాతాలో జమచేస్తాం అని గుజరాత్ క్షీర విప్లవం గురించి కూడ వివరించాడు.

అందరూ ఆశలు పురివిప్పుకుంటూ వింటున్నారు. మళ్లా ఆయనే- రైతుకు వ్యవసాయం ఎంత ముఖ్యమో పశుసంపద అంతే ముఖ్యం. వ్యవసాయదారుడు డబ్బు మిగుల్తే మా బ్యాంకులో పెట్టొద్దు. బంగారం, వెండి కొనొద్దు. పశువులను కొనండి. అదే పల్లెటూరి రైతు సంపద. అదే అతడి సొమ్ము. అందుకే ఆవులను కొన్ని ప్రాంతాల్లో సొమ్ములంటారు.

పశువుల పేడ ఎరువుగా, వాటి సంతతి రేపు మంచి ఆదాయానికి మార్గం చూపుతాయి.

## కొత్తగాలి... 

**నడక**
**ఆరోగ్యకరం**
**పరుగుపందెం**
**ఆందోళనకరం**

**- లక్కోజు శ్రీనివాసరావు, నెల్లూరు**



**కొత్తగాలి...**

**దిక్కులేనివాళ్లకోసం**
**అనాథ శరణాలయాలు!**
**పట్టింపులేనివాళ్లకోసం**
**వృద్ధాశ్రమాలు**

*-గరిశుర్తి రాజేంద్ర, భికనూర్*

"మీలో ఎవరైనా ముందుకొస్తే గోబర్ గ్యాస్ ప్లాంట్‌కు కూడా మేం సబ్సిడీ పద్ధతిలో అప్పు యిస్తాం. ఇంటికి గ్యాస్, కరెంట్ ఖర్చు ఉండదు. ఆలోచించండి" అన్నారు బ్యాంక్ సిబ్బంది.

"భవిష్యత్తులో ఈ ఊళ్లో ప్రతి ఇంటికి ఒక గోబర్ గ్యాస్ ప్లాంట్ ఉండితీరుతుంది. ఈ కరెంట్ కోత, ఖర్చు ఉండవు. ఈ గ్యాస్ కొరత ఉండదు. ఒకసారి పెట్టుబడి పెడితే జీవితాంతం సుఖం. రెండు పశువులుంటే ఒక చిన్న కుటుంబానికి సరిపోతుంది. పైగా గోబర్ గ్యాస్ ప్లాంట్‌కు అనుబంధంగా కంపోస్ట్ ఎరువూ వస్తుంది. మనం సేంద్రియ ఎరువుల్ని దూరం చేయాలనుకుంటున్నాం కాబట్టి ప్రతి కుటుంబం ఈ కంపోస్ట్ ఎరువు, వర్మీకంపోస్ట్‌పై శ్రద్ధ పెట్టాల్సి ఉంటుంది" అన్నాడు రామకృష్ణ.

వంటనూనెల ధరలు ఆకాశానికి అంటుతున్నాయి కాబట్టి మనం వచ్చేఏడు నూనెగింజల పంటలు నువ్వులు, సన్‌ఫ్లవర్, పల్లి పండించాలి. ఎవరూ బయట మార్కెట్‌లో నూనెలు కొనొద్దు. మన పంటలతో మనం స్వయం పోషకం కావాలి.

"గాండ్ల మల్లయ్యకు మల్లా చేతి నిండా పని" అన్నారెవరో.

గాండ్ల మల్లయ్య ముసలివాడయిపోయాడు. నేను యింత ఉన్నప్పుడు మల్లయ్య గానుగ మొద్దుమీద తిరిగింది ఎరుక. అతడు కాదు గాని అతడి కొడుకులు మనుమలు బస్తీల ఉన్నారు. వాళ్లు మళ్లీ వచ్చే ఏర్పాట్లు జరుగుతున్నాయి.

విశ్వనాథం మాటలకు అందరూ ఆశ్చర్యపోయారు. బ్యాంక్ వాళ్ళను రమ్మని పాడిగేదెల గురించి మాట్లాడి పెట్టడం-

గాండ్ల మల్లయ్య కుటుంబంతో సంప్రదించి వాళ్ళు మళ్లా ఊళ్లోకి వచ్చేట్టు చేయడం నిజంగా ఆశ్చర్యాన్ని కలిగించాయి.

"ఇంకా ఎవరెవరు తిరిగి మన ఊరికి వస్తరో చెప్పండి" అన్నాడు దేవయ్య.

"చిన్న చితకా ఉద్యోగాలకు వెళ్లిన వాళ్లందరూ వచ్చే ఏర్పాట్లు జరుగుతున్నాయి" అన్నారు విశ్వనాథం. మళ్లీ తనే-

"కులవృత్తులకు ఆదరణ లేదని వేరే వృత్తులలోకి వెళ్లిన వాళ్లను తిరిగి రప్పిస్తున్నాం. ముఖ్యంగా కుమ్మరి రాములు కుటుంబం తిరిగి వస్తుంది. ఏడాది పొడుగుతా అతడి కుటుంబం రంజన్లు చేసినా అమ్మిపెట్టె బాధ్యత యీ ఊరి సంఘం తీసుకుంటుంది. అదిలాబాద్ రంజన్‌లంటే పేదవాడి ఫ్రిడ్జిలనే పేరుంది. ఈ రంజన్‌లను కరీంగనర్, వరంగల్, హైదరాబాద్, నిజామాబాద్... మొత్తం తెలంగాణా జిల్లాల్లో ప్రత్యేకంగా బ్యానర్ కట్టి అమ్ముతారు అదిలాబాద్ రంజన్లని. అలాంటి కుమ్మర్లకు అదిలాబాద్‌లో పని లేకపోవడమేమిటి... శివకాశిలో యాడాది పొడుగునా టపాకాయలు తయారుచేస్తారు. అవి ఒక్క దీపావళి పక్షంలో అమ్ముడయిపోతాయి. ఈ రంజన్లను కూడా అలాగే అమ్మిస్తే ఏ కుమ్మరికీ పని లేకపోవడం అంటూ ఉండదు. కాలం మారింది. మనిషికి అందం మీద ధ్యాస పెరిగింది. నీళ్ళు కుండనే నగిషీ పెట్టి చెయ్యాలి. నగిషీ పెట్టడం నేర్చుకోవాలి. లేదా నగిషీలు దిద్దేవాడికి పని కల్పించాలి. దశాబ్దాలు మారు

# మంచులో శవం






బ్రెడో మోల్‌స్టోల్ నార్వేలోని లాండ్‌స్కేప్ ఆర్కిటెక్ట్. అతడు మరణించాక అతని మనవడు అందరిలా ఆ శవాన్ని పాతిపెట్టలేదు. ఎప్పటికైనా సైన్స్ అభివృద్ధి చెంది తన తాతని బతికించే టెక్నిక్ రావచ్చన్న ఆశతో దాన్ని మైనస్ 60 డిగ్రీల్లో 325 కిలోల డ్రై ఐస్‌లో కాపాడుతున్నాడు. ఈ పని చేయడానికి ఓ ఉద్యోగస్తుణ్ని కూడా నియమించాడు. అతను రెండు మూడు వారాలకోసారి శవం ఉన్న పెట్టెలోని టెంపరేచర్‌ని చెక్‌చేసి ఐస్‌తో నింపుతాడు. ఆ శవం వయసు ఇప్పటికి మూడేళ్లు!

తున్నా తమ పనిలో కించిత్ మార్పు తేకుంటే ఎలా బతుకుతారు" అన్నాడు.

"మన ఊరినుండి కుమ్మరం వదిలి కూలీ చేసుకుంటున్న కుమ్మరులను హైదరాబాద్ శిల్పారామంకు పంపి శిక్షణలు యిప్పించే ఆలోచన ఉంది" అన్నాడు రామకృష్ణ.

"ఒక్క వ్యవసాయం బాగుంటే దాన్ని అల్లుకొని ఉన్నా అనేక వృత్తులు బాగుంటాయి. ఇంకొక ముఖ్య విషయం మన ఊర్లో ఎవరూ రేపటినుండి ప్లాస్టిక్ ఉపయోగించరు. ప్లాస్టిక్ బ్యాగులు, ప్లాస్టిక్ కవర్లు, ప్లాస్టిక్ కప్పులు మనం వాడం. వాటికి బదులు మనం మన పాత పద్ధతులే వాడతాం. అందుకని ప్లాస్టిక్ మనకే నిషేధం. ఎవరన్నా మనకు ప్లాస్టిక్ కప్పులో చాయ్ యిస్తే మనం తాగం. ఇదీ మన కట్టడి. అందరికీ సమ్మతమేనా" అన్నాడు విశ్వనాథం.

అందరూ ముక్త కంఠంతో అంగీకరించారు.

"మరి మన యింట్లో ఉన్న బకెట్- బుట్టల సంగతేంటి?" అడిగారు ఒకరు. వాటిని యిప్పటికి ఉండనీయండి. తొందర్లో మీకు ప్లాస్టిక్ వాడకంపై మన సంఘం తరఫు నుండి ఒక అవగాహన సదస్సు నిర్వహిస్తాం. అప్పుడు అన్ని విషయాలు యింకా వివరంగా తెలుసుకుందాం" అన్నాడు విశ్వనాథం.

"మన సంఘం ఎంపిక చేసిన కొన్ని నిత్యావసర వస్తువులను మనం కమీషన్‌లు, దళారీల బెడదలేకుండా నేరుగా డీలర్ నుండిగాని, సరుకు ఉత్పత్తిదారు నుండో రప్పించే ఆలోచన ఉంది. మనకు వచ్చే వస్తువుకు - నేడు మార్కెట్‌లో కనిపించే ప్యాకింగ్ ఉండదు. ఉదాహరణకు సబ్బులు- మామూలు కాగితంలో చుట్టి వస్తాయి. బిస్కట్లు, అవి కూడా మామూలు కాగితంలో చుట్టి డబ్బాలో



వస్తాయి. వస్తువు ఉత్పత్తి కంటే కొన్ని సార్లు ఆకర్షణీయమైన ప్యాకింగ్‌కే ఎక్కువ ఖర్చు పెడ్తారు. అది మనకు పొదుపు. ఊరివాళ్ళ అందరి ఆమోదం పొందిన వస్తువులను మన సంఘం నేరుగా పెద్ద మొత్తంలో కొని అందిస్తుంది. కాబట్టి నాణ్యతలో, ధరలో మోసం ఉండదు" అన్నాడు రామకృష్ణ.

ఇలా ఆ గ్రామ సంఘం సభలో ఎవరు ఏం పనులు చేయాలి? భవిష్యత్ ప్రణాళిక లేమిటి నిర్ణయించుకొని విడిపోయారు.

విశ్వనాథంగారికి క్షణం తీరికలేదు. తోడుగా పులాజీని, యింకా ఒక పదిమంది యువకులను వెంటబెట్టుకొని పనులు నిర్వహిస్తున్నారు.

కొన్నిచోట్ల అపహాస్యమౌతున్నారు. కాని మళ్లా వీళ్ళ చిత్తశుద్ధి, కార్యదీక్ష చూపి దారిలో కొస్తునారు. సంవత్సరకాలం గడవబోతోంది.

ఊరు వదిలిపోయినవాళ్ళు చాలామటుకు పల్లె యిస్తున్న హామీతో తిరిగి పల్లెకు రావడం ప్రారంభమయింది.

ఆ ఊళ్లో యిప్పుడు ప్లాస్టిక్ చెప్పులు ఎవరూ వాడరు.

ప్లాస్టిక్ తాళ్ళకు స్వస్తి పలికారు.

నర్సిగాడికి చేతినిండా పని. పులాజీకి కులవృత్తి నచ్చక ఊరి సంఘంలో ఇతర పనులు చూస్తున్నాడు.

కుమ్మరుల రంజన్లు, కుండలు కొత్త శోభతో టెర్రాకోట పనితనంతో పోటీ పడుతుంటాయి.

కమ్మరి కొలిమిలో ఇప్పుడు చిన్న వెల్డింగ్ కార్ఖానా వెలిసింది. వ్యవసాయ పనిముట్లను సరిచేయటానికి వడ్లదాటి కళ కళలాడుతోంది.

ఆ ఊళ్లో రసాయన ఎరువుల వాడకం పూర్తిగా తగ్గిపోయింది. సస్యరక్షణకు స్వయంగా తయారు చేసుకున్న క్రిమిసంహారాలను వాడుతున్నారు.

పేడ ఎరువు, కంపోస్టు, వర్మికంపోస్టుతో పంటలు, కూరగాయలు పండిస్తున్నారు. మార్కెట్‌లో ఇతర రకాలకన్న వీటికే ఎక్కువ ధర పలుకుతోంది.

దేశవాళి టమాటా ఆ ఊరి పంటలో ప్రత్యేక ఆకర్షణ.

మట్టికుండల వాడకం పెరిగింది.

ప్రతి ఇంటికీ ఒక పెరుగుదుత్త వెలిసింది.

అందరూ మట్టి దుత్తలో పెరుగే తింటున్నారు.

మార్కెట్‌కు కూడా మట్టి దుత్తలోని తోడేసిన పెరుగునే అమ్ముతున్నారు. 'పాత దుత్తయిచ్చి ఈ పెరుగు దుత్త తీసుకుపో' అనే దశకు వచ్చింది.

ఆ వూళ్లో కూల్ డ్రింకులు లేవు, మజ్జిగ, చెరకు రసం తప్ప. ఆ వూళ్లో ఇప్పుడు ఎవరికి నిద్రలేని రాత్రుల్లులేవు. పంట పట్ల, పని పట్ల, ధర పట్ల భయంలేదు.

ఆర్నెల్లకో యాడాదికో ఒకసారి వచ్చే వాళ్ళు, తాము తిరిగి వస్తే బాగుంటుందని అనుకుంటున్నారు.

అంతా సామూహిక వ్యవసాయం.

విత్తనాలు, సస్యరక్షణ, మార్కెటింగ్, ధర అన్నీ ఊరి సంఘమే చూసుకుంటుంది.

అందరి జమా ఖర్చులు ఇంటర్‌నెట్‌లో పేరు పేరున నమోదయి ఉంటాయి.

నూటికి నూరు శాతం పారదర్శకత.

ఒకప్పుడు ఏమీ లేదని ఊరు వదిలిపెట్టి పోయినోళ్ళు నేడు తిరిగి వస్తున్నారు.

భూమి బల్లపరుపుగా ఉంటే పోయినోడు పోయినట్టే. కాని యీ భూమి గుండ్రంగా ఉంది. గుండ్రంగానే ఉండాలి. అప్పుడే తప్పిపోయిన మనిషి తిరిగి గమ్యం చేరతాడు. ©

# శత్రువు

ట్యాంక్‌బండ్ 9 కథలు



అతని దవడ కండరాలు బిగుసుకున్నాయి. మరో ఇరవై సెకన్లలో కారొచ్చేస్తుంది. అంటే అల్లా వాడికి ఇంకా కేవలం ఇరవై సెకన్లు మాత్రమే ఆయుర్దాయం ఇచ్చాడన్నమాట. అవును చేసిన పాపం ఊరకే పోతుందా? అల్లా మాత్రం ఏం చేయగలడు?



రాత్రి ఒంటిగంట.

విద్యుత్ దీపాలు బద్ధకంగా వెలుగుతున్నాయి.

చెదురుమదురుగా పోయే ఒకటీ అరా వాహనాల మోత తప్ప ట్యాంక్‌బండ్ రోడ్డంతా నిశ్శబ్దంగా ఉంది.

శ్రీకృష్ణదేవరాయల విగ్రహం వద్ద నక్కి కూర్చున్నాడతను. అంటే సికింద్రాబాద్ వైపు నుంచి వచ్చేవారికి కనబడడతను. వారికి కనబడకపోయినా అతని దృష్టి మాత్రం ఆ వేపే కేంద్రీకరించి ఉంది.

అతనెంత సేపటినుంచీ నిరీక్షిస్తున్నాడో ఏమో గానీ విసుగ్గా ఓసారి చేతిగడియారం చూసుకున్నాడు.

ఒ...ం..టి..గంట..!

ఇకనో మరికొన్ని క్షణాల్లోనో రాకేశ్ వచ్చేస్తుంటాడు. సర్దుకు కూర్చున్నాడతను. ఆ సమయంలో అతని చేతిలోని నల్లని రివాల్వర్ వీధిదీపం వెలుగులో తళుక్కున మెరిసింది.

రాకేశ్ తనకెంత నమ్మక ద్రోహం చేశాడు? ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకున్న స్నేహితుడికే వెన్నుపోటు పొడిచాడు. తన అమాయకత్వాన్ని, తనవాళ్ల నిరక్షరాస్యతనూ అడ్డంపెట్టుకుని అన్నం పెట్టిన ఇంటికే కన్నం వేశాడు వెధవ. తను దుబాయ్ నుంచి పంపిన సొమ్మంతా నొక్కేసి తన కుటుంబాన్ని చెట్టుకొకరు పుట్టకొకరూ అయ్యేలా చేశాడు. అన్నింటికంటే ఘోరం... రమిజాబీ సంగతి!

రమిజాబీ వేరెవరో కాదు.. తనెంతో ఇష్టపడి, ప్రేమించి పెళ్లాడిన భార్య! తాను దుబాయ్‌లో అందమైన ఆడపిల్లలతో అడ్డమైన తిరుగుళ్లూ తిరుగుతున్నానని, డబ్బంతా వాళ్లకే తగలేస్తున్నానని ఆమెకు లేనిపోని చాడీలు చెప్పాడు. మనసు విరిచేశాడు. సానుభూతితో తనే సొంతంగా వందా యాభై సాయం చేస్తున్నట్లు చెప్పుకుని ఆమెకు వలవేశాడు. మాయమాటలతో ఆమెకు శారీరకంగానూ దగ్గరయ్యాడు... స్నేహితుడనేవాడు ఎవడైనా ఇంత ఘోరం చేస్తాడా?

మూడేళ్ల తర్వాత తను తిరిగొస్తే ఏముంది? ఇల్లుపాడుపడింది. అమ్మ కాలం చేసింది. కనీసం తనకా కబురు కూడా తెలియచేయలేదు వాడు. చెల్లాయి జాడ ఏమైందో తెలియదు. రమిజాబీ మాత్రం వాడితోనే ఉంటోంది. తన ముద్దుల కొడుకు ఐదేళ్ల అబ్బాస్ వాళ్ల దగ్గరే ఉంటున్నాడని తెలిసింది. వాడ్ని ఎంత హింస పెడుతున్నాడో?

అయినా తనదీ తప్పేలే. పూర్తిగా వాడినే నమ్ముకుని కళ్లుమూసుకుని కూర్చున్నాడు. తన వాళ్లకు ఇవ్వమంటూ నెల నెలా యాభైవేల దాకా పంపేవాడు. మూడేళ్లుగా సుమారు ఇరవై లక్షలు తిన్నాడు వెధవ. డబ్బుతో సరిపెట్టాడా? కుటుంబాన్నే చిందరవందర చేశాడే? ఇంత చేసినవాడిని ఊర్కే వదుల్తానా? ఇవ్వాళే వాడికి ఆఖరు రోజు! రివాల్వర్‌ను గట్టిగా బిగించి పట్టుకున్నాడతను.

తను దుబాయ్ నుంచి వచ్చిన మర్నాడే రాకేశ్‌గాడి గుట్టంతా వెల్లడైంది. వాడి పాపాలన్నీ ఒక్కొక్కటే బయటపడ్డాయి. తన చేతిలోనే వాడికి చావు రాసిపెట్టి ఉంది కాబోలు.. అందుకే ఇంత దుర్మార్గానికి ఒడిగట్టాడు.

కూటికి లేనివాడు ఇవ్వాళ సికింద్రాబాద్‌లో పెద్దబార్‌కు యజమాని. రియల్ ఎస్టేట్ వ్యాపారి. ఇదంతా నన్ను ముంచి సంపాదించిందే గదా?

బార్ నుంచి రోజూ అర్ధరాత్రివేళ ఒంటరిగా ఇంటికి కార్లో వెళ్తాడని తెలిసే ఇక్కడ కాపేశాడు తను. ఈ వేళప్పుడు డ్రైవర్ కూడా ఉండడనీ, తనే కారు నడుపుతాడనీ,

బార్ నుంచి తెస్తున్న క్యాష్ దగ్గరుటుందని తెలిసింది. ఇవన్నీ ఆలోచించే పకడ్బందీగా ప్లాన్ వేశాడు.

ఇలాంటి టైమ్‌లో అయితే వెధవని లేపెయ్యడంతోపాటూ డబ్బూ దక్కించుకోవచ్చు. చేసిన పాపాలకు ఫలితం మరి కొన్ని క్షణాల్లోనే అనుభవించబోతున్నాడు. డబ్బు కోసమే ఎవరో హత్యచేశారని అనుకుంటారుగానీ తనవరకూ రాదు. అందుకే దుబాయ్‌నుంచి వచ్చాక తను వాడి కంట పడలేదు.

సమయం ఒంటి గంటా ఇరవై నిముషాలు..

సికింద్రాబాద్ నుంచి ఏదో వాహనం వస్తున్న చప్పుడు.. అదుగో హెడ్‌లైట్లు కనబడుతున్నాయి.. బహుశా వాడే అయ్యుంటాడు. ఔను... కారదే! బ్లాక్ స్కార్పియో!! బైనాక్యులర్స్‌లో నుంచి చూస్తే నంబరూ కన్పిస్తోంది!

అతని దవడ కండరాలు బిగుసుకున్నాయి. మరో ఇరవై సెకన్లలో కారొచ్చేస్తుంది. అంటే అల్లా వాడికి ఇంకా కేవలం ఇరవై సెకన్లు మాత్రమే ఆయుర్దాయం ఇచ్చాడన్నమాట. అవును చేసిన పాపం ఊరకే పోతుందా? అల్లా మాత్రం ఏం చేయగలడు?

అరె.. అదేంటి? ఏమైంది? కారు రోడ్డు మీద రాకుండా ఏకంగా ఫుట్‌పాత్ ఎక్కేస్తోంది? కంట్రోల్ తప్పినట్లుంది...

అతను అలా అనుకుంటుండగానే అనూహ్యంగా ఫుట్‌పాత్ ఎక్కిన స్కార్పియో పెద్ద శబ్దంచేస్తూ వెళ్లి అక్కడున్న సిమెంట్ దిమ్మను ఢనేల్‌మని గుద్దేసి ఆగిపోయింది..

లోపలనుంచి ఏడ్పులు.. కేకలు..!

తనేస్థితిలో ఉన్నది మరిచి అటు పరుగుతీశాడతను. అక్కడికి చేరేసరికి డ్రైవింగ్ సీట్లో ఉన్న వ్యక్తి స్టీరింగ్ వీల్‌పై తలవాల్చేసి ఉన్నాడు. తలపైకెత్తి చూస్తే రాకేశే! తలపగిలి కారుతున్న చిక్కటి నెత్తురు చేతులకు అంటింది. అతను 'అబ్బా.. అబ్బా' అంటూ తల వాల్చేస్తున్నాడు. పక్క సీట్లో ఎవరో కుర్రవాడు..

ఎవరు వాడు? ఒళ్లంతా నెత్తురుతో పడున్నాడు..

ఎవరా అని ఆ వైపు డోర్ బలంగా లాగి

**సికింద్రాబాద్ నుంచి ఏదో వాహనం వస్తున్న చప్పుడు.. అదుగో హెడ్‌లైట్లు కనబడుతున్నాయి.. బహుశా వాడే అయ్యుంటాడు. ఔను... కారదే! బ్లాక్ స్కార్పియో!! బైనాక్యులర్స్‌లో నుంచి చూస్తే నంబరూ కన్పిస్తోంది!**

బయటకు తీశాడతను..

వీడు అబ్బాస్ కదూ? ముద్దుల మాట గట్టే తన కొడుకు అబ్బాస్! తన రక్తం పంచుకుపుట్టిన అబ్బాస్ కదూ?

అతని కళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి...

అంతలో వెనకసీట్లో ఎవరిదో మూలుగు..

బ్యాక్‌డోర్ అద్దం పగలగొట్టి బయటకు లాగిచూస్తే రమిజాబీ! తన ముద్దుల భార్య!!

స్పృహలో లేదు.

అతనికి పిచ్చెక్కిపోతోంది. ఏంచేయాలిప్పుడు?

ఇంకేం ఆలోచించకుండా అతను తన చేతిలో రివాల్వర్‌ను సాగర్‌లో పడేలా గిరాటేశాడు. మరో జేబులోంచి సెల్‌తీశాడు. అత్యవసర సేవలకోసం అతని వేళ్లు ఒకటి... సున్న... ఎనిమిది నెంబర్లను నొక్కసాగాయి..

–చంద్రప్రతాప్

# ఇది వేదం

# స్త్రీ -ప్రతిభావంతురాలు

-డాక్టర్ సంధ్యావందనం లక్ష్మీదేవి

వేదంలోని స్త్రీ బహుముఖ ప్రజ్ఞావంతు రాలు. విశిష్ట ప్రతిభావంతురాలు ఆ నాటి సమాజంలోని స్త్రీ ప్రతికార్యంలోను తనదైన పాత్రను పోషించింది. సమర్థవంతంగా నిర్వహించింది. సమస్త రంగాలను ప్రభా వితం చేసింది. తనదైన ప్రత్యేక ముద్రను వేసింది.

వేదాన్ని పరిశీలిస్తే :

**పావకానః సరస్వతీ వాజేభిర్ వాజినీ వతి!**

**యజ్ఞం వష్టుదియా వసుః॥**

(ఋగ్వేదం 1-2-10)

విదుషీనారి తన విద్యాబలంతో అందరి జీవితాలను వికసింపచేస్తుంది. ధార్మికపర మైన తన వ్యవహారంతో ఇతరుల మనస్సును రంజింపచేస్తుంది. తన శ్రేష్ఠ (వ్యవహారంతో) జ్ఞానంతో తన సంతా నాన్ని శిష్యులను గుణవంతులుగా తీర్చిది ద్దుతుంది. ఇతరులకు సత్కర్మలలో ప్రేర ణనిస్తుంది. కుటుంబాన్ని ఉత్తమ పద్ధ తిలో నడిపిస్తుందని- వేదమంటుంది.



**చోదయిత్రీ సూనృతానం చేతంతి సుమతీనామ్।**

**యజ్ఞందదే సరస్వతీ॥**

(ఋగ్వేదం 1-2-11)

విద్వాంసురాలైన స్త్రీ ప్రియమైన సత్యాన్నే చెప్తుంది. అందులో ఉత్సాహాన్ని నింపుతుంది. సమాజంలో మంచి నీతిని జాగృత పరుస్తుంది. అట్లాంటి స్త్రీలు లోక కళ్యాణాన్ని కాంక్షిస్తారు. ఉత్తమగుణ కర్మ స్వభావాలున్న స్త్రీ సమాజాన్ని నీతి మార్గంలో నడుపుతుందని ఈ వేద మంత్రం స్పష్టంచేస్తుంది.

పూర్వకాలంలో గార్గి, మైత్రేయి సులభా మొదలైన స్త్రీలు వేదశాస్త్రాలను చదువుకొని పూర్ణ విదుషీమణులుగా ఉండేవారు.

వైదిక సాహిత్యమంతా స్త్రీ పురుషులి ద్దరూ విద్యావంతులు కావాలని ఉపదేశి స్తుంది. భర్త విద్యావంతుడై భార్య విద్యా

వంతురాలు కాకపోతే ఆ గృహంలో నిత్యం దేవాసుర సంగ్రామం జరుగుతుందని మహర్షి దయానంద సరస్వతి అన్నారు. స్త్రీ విద్య-గృహానికి సమాజానికి శోభనిస్తుం దని మహర్షులన్నారు. స్త్రీలు వ్యాకరణం ధర్మశాస్త్రాలు వైద్యం గణితం మొదలైన విద్యలు నేర్చుకునేవారు. విదుషీమణులైన స్త్రీలు ఎందరో మహిళలను విద్వాంసు లుగా, శిక్షకులుగా తయారుచేసేవారు.

**ఓం దేవ్యేదమ్రో భూతస్య ప్రథమజా**

(యజుర్వేదం 37-4)

ఈ వేదమంత్రంలో స్త్రీలు విద్వాంసులు కానంతవరకు ఉత్తమ విద్యలు వృద్ధిచెంద వని, స్త్రీలు తప్పనిసరిగా వేదవిద్యలు నేర్చు కోవాలనే ఆదేశం వుంది.

స్త్రీలు ఉత్తమ అధ్యాపకులుగా ఖ్యాతిని పొందాలి. కన్యల మనస్సులను పవిత్రం చేయాలి. శరీరాన్ని పుష్టివంతం చేయాలి. ప్రాణాలను దృఢపరచాలి. మంచి గుణ, కర్మ స్వభావాలతో వారిని తీర్చిదిద్దాలని వేదమాదేశిస్తుంది.

అందుకే రాజులు విద్యా వ్యవస్థకు సంబంధించిన అంశాలలో ప్రత్యేక శ్రద్ధ వహించాలని వేదంలో వుంది. రాజ్యం లోని స్త్రీలనందరిని విదుషీమణులను చేయాలని వేదమంటుంది.

**"అంబితమే నదీతమే దేవీతమే సరస్వతీ"** (ఋగ్వేదం 2-41-16)

రాజ్యంలోని కన్యలందరకు విదుషీమణు లైన స్త్రీలతో విద్యాభ్యాసం చేయించాలి. వారంతా గొప్ప విద్యావంతులు కావాలని వేదం ప్రబోధిస్తుంది.

**"వాచంతే శుంధామి ప్రాణంతే శుంధామి చక్షుస్తే శుంధామి"**

(యజుర్వేదం 6-14)

స్త్రీలు వేదాలు ఉపవేదాలు వేదంగాలు-ఉపాంగాల శిక్షణతో బ్రహ్మచారిణులు కన్యలు బాలికల దేహాన్ని, ఇంద్రియాలను పవిత్రపరచాలని వేదంలో వుంది.



**"గౌరీర్మిమాయ సలిలాని తక్షత్యేక పదీ ద్విపదీ సాచతుష్పదీ"-**

(ఋగ్వేదం -1-164-41)

సాంగోపాంగంగా వేదాలను చదివి చది వించే స్త్రీలు సమస్త మానవ కళ్యాణాన్ని ఆశిస్తారని వేదమంటుంది.

వేదంలో ఇవి కేవలం విద్యకు సంబం ధించిన అంశాలు. మహిళలకు చెందిన మరికొన్ని అంశాలు కూడా సందర్భానుసా రంగా ఇందులో పొందుపరచడం జరి గింది.

రాజ్యంలో రహస్య సమాచార విభాగం ఒక ముఖ్య విభాగం! ఈ విభాగంలో రాజ్యాల మధ్య సంబంధాలు స్థిరంగా ఉంటాయి. దీనివలన రాజనీతి నిర్ధార ణలో సహాయం లభిస్తుంది. తన దేశ స్థితిని ఇతర దేశాలతో సుదృఢం చేస్తుంది. ఇట్లాంటి ప్రశస్త దౌత్యకార్యాన్ని కూడా స్త్రీలు చక్కగా సమర్థంగా చేయగలరని వేదం తెలియచేస్తుంది.



వానరరాజు వాలి అతని భార్య తార రాజనీతిని విశేషమైన ఆమె బుద్ధిని వాల్మీకి మహర్షి ఎంతో ప్రశంసించారు.

రాణి మండోదరి రావణునకు రాజధర్మా లకు సంబంధించిన కుశల మార్గాన్ని బోధించింది.

ఝాన్సీ లక్ష్మీబాయి, రాణి చెన్నమ్మ, మహారాణి విక్టోరియా, గోల్డామేయర్ మార్గరేట్ థాచర్, సుచేత కృపలాని, ఇందిరాగాంధీలు ఆయా రాజ్యాల దేశాల రాజకీయాలను ప్రభావితం చేశారు.

వేదకాలం తరువాత కొందరు స్వార్థపరులు స్త్రీలు సభలు సమావేశాలకు వెళ్లకూడదని నిషేధించారు. దీనిని మహర్షి యాజ్ఞవల్క్యుడు గట్టిగా వ్యతిరేకించారు. సాధికారిత మనుష్య జాతిలోనే ఉంది. ఇతర పశుపక్ష్యాదులలో ఇది కనపడదు.

ఎద్దు చెప్తేనే ఆవు వెళ్లడం గాని, గుర్రం చెప్తేనే ఆడగుర్రం పరుగెత్తడంగాని, పిల్లి చెప్తేనే ఆడపిల్లి కదలడంగాని, చిలక చెప్తేనే ఆడచిలుక ఎగరడంగాని మనకు కనబడదు. అవి సహజంగా, స్వతంత్రంగా వ్యవహరిస్తాయి. అధికారం చలాయించే గుణం కేవలం మనుష్యుల్లోనే ఉంది. ఈ గుణమే స్త్రీని వేదాధ్యయనానికి యజ్ఞకార్యాలకు దూరం చేసింది.

ఈ విషయాన్ని జైమిని మహర్షి మీమాంసాశాస్త్రంలో 6వ అధ్యాయం తృతీయ అధికరణంలో చాలా విస్తారంగా చర్చించారు. 'కృతుషు స్త్రియా అప్యధికారాధి కరణమ్' అనే పేరుతో స్త్రీల అధికారాలను సమర్థించారు.

ఋగ్వేదంలో 6-61-3/7-31-2 మంత్రాలలో స్త్రీలు భూగర్భ విద్యలు తెలిసినవారై ఉండాలని ఉంది.

యజుర్వేదం 12-53వ మంత్రంలో స్త్రీ కాలగణనకు సంబంధించిన అంశాలను అంటే జ్యోతిష్య విద్యలను తెలుసుకోవాలని ఉంది.

ఋగ్వేదంలో 10-114-3వ మంత్రంలో స్త్రీని 'చతుష్కపదీ' అనే పేరుతో సంబోధించింది. 'చతుష్కపర్దా యువతి సుపేశా' అంటే ధర్మ, అర్థ కామ, మోక్షాలనే జీవనతత్త్వాలు తెలిసిన స్త్రీ అని భావం.

**'అవ సృష్టా పరాపత శరవ్యే బ్రహ్మ సంశితే'** (యజుర్వేదం 17-45)

ధనస్సును ఎక్కుపెట్టి బాణాలను సంధించి శత్రువులను సంహరించే స్త్రీ కుశలురాలు.

**"ఆలాక్తా యారురు శీర్ష్ణి అదోయస్యా ముఖమ్"**

హే! వీరాంగనా! విషంతో నిండిన బాణంవలె శత్రువులను సంహరించు. రక్షణకై శిరస్త్రాణం లోహ కవచం ధరించమని స్త్రీని వేదం హెచ్చరిస్తుంది.

**ఆదాయ పన్ను విభాగ అధ్యక్షురాలు:** రాజు ప్రజల నుండి పన్నులు వసూలు చేసి ప్రజాహిత కార్యాలు చేస్తాడు. ఈ విభాగంలో మహిళలుండాలని ఋగ్వేదం 10వ మండలం 108వ సూక్తంలో ఉంది.

వేదంలోని స్త్రీలు వివిధ రంగాలలో గణనీయమైన ప్రగతిని సాధించారు. మహిళలకు సంబంధించిన ఇన్ని విషయాలు వేదంలో ఉన్నాయంటే మనకు ఎంతో ఆశ్చర్యమేస్తుంది. మరోవైపు వేదకాలం నాటి స్త్రీలే అన్ని విధాల సమస్యలు లేని సమాజాన్ని నిర్మించుకున్నారని అనిపిస్తుంది. వేదం స్త్రీల విషయంలో చెప్పిన అద్భుతమైన కార్య సాధన ఈ నాటి కాలానికి కూడా వర్తిస్తుంది. ఒకప్పుడు సాధ్యమైంది. మరొకప్పుడు అసాధ్యమయ్యేందుకు వీలు లేదు. కాని జాగ్రత్తగా పరిశీలించి పరిశోధించి ఆశావహ దృక్పథంతో ముందుకు పోవడమే మన పని.

*లోకాః సమస్తా సుఖినో భవంతు* ©

# కన్నీటి కథ




ప్రపంచంలో కన్నీళ్లని ఉద్వేగంతో కార్చేదీ ఒక్కమనిషే. కుక్కలు, కోతులు, మొసళ్ల కళ్ల నుంచి నీరు కారుతాయి. కానీ అవి ఎలాంటి ఉద్వేగంవల్లా కాదు. మనిషి ఒక్కడే ఉద్వేగ సమయంలో కన్నీరు పెట్టుకుంటాడు.

అమెరికన్ శాస్త్రజ్ఞులు కన్నీటి మీద అనేక పరిశోధనలు చేసి కొత్త విషయాలను తెలుసుకున్నారు. మనం అనుకున్నట్లుగా కన్నీళ్లు, కంటి పక్కభాగం లోపలి నుంచి పుట్టవు. కేవలం అక్కడ నుంచి స్రవిస్తాయి. నుదురు, కనురెప్పల పైభాగాల మధ్య బాదంకాయ ఆకారంగల లాక్రిమల్ గ్లాండ్స్ నుంచి కన్నీరు జనిస్తుంది. మనం మెలకువగా ఉన్నప్పుడు ఈ గ్లాండ్స్ కన్నీటిని ఉత్పత్తి చేస్తూనే ఉంటాయి. సాధారణంగా కన్నీటిలో నీరు, చక్కెర పదార్థాలు, ప్రోటీన్స్, ఉప్పు, లాసోజైన్ అనే ఎంజైమ్ ఉంటాయి. ఈ ఎంజైమ్‌లో ఇన్ఫెక్షన్‌తో పోరాడే శక్తి ఉంది.



ముక్కుకింద రెండు చిన్న తిత్తుల్లో కన్నీరు నిలువ ఉంటుంది. అవి నిండగానే ముక్కులోకి ప్రయాణిస్తుంది. ముక్కు తేమగా ఉండటానికి ఇదే కారణం. ఉద్వేగం, తీవ్రకోపం, ఆవులింత లేదా బాగా నవ్వడంవల్ల ముఖంలోని కండరాలు ఒత్తిడిచెందుతాయి. ఆ ఒత్తిడి ఈ కన్నీటి తిత్తుల మీద పడి, నీళ్లు కళ్లద్వారా బయటికి వస్తాయి. అంతేకాక, కంట్లోకి ఈ నీరు సదా వెళ్లి, ఆవిరైపోతుంటుంది. కళ్లు పొడిగా ఉంటే అవి అనారోగ్యానికి గురవుతాయి. కాబట్టి ప్రకృతే అలాంటి ఏర్పాటు చేసింది.

పసిపిల్లలు బాగా ఏడ్చినప్పుడు స్వరపేటికలోని తంత్రుల చర్యవల్ల కన్నీరు కారే ఏర్పాటు ఉంది. పసితనంలో ఎక్కువ ఏడవని పిల్లలు త్వరగా మరణించే ప్రమాదం ఉందని డాక్టర్ ఏష్లీ మోంటేగ్ చెప్తున్నారు. కన్నీటి ద్వారా ఉత్పత్తయ్యే, శరీరంలోని బాక్టీరియాతో పోరాడే ఎంజైమ్ అధికంగా తయారు కాకపోవడం దీనికి కారణం. ఆధునిక అమెరికన్ ఏడవడానికి తిరస్కరిస్తాడు. అందువల్ల కన్నీరు విడుదలై, మరికొంత తయారయ్యేందుకు అవకాశం ఉండదు. దీంతో అస్తమా, అల్సర్స్, హై ఫీవర్ తదితర రోగాలు వచ్చాయంటే... వారు ఏడుపుని నివారించుకున్న ఫలితమే అది అని అమెరికన్ శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. లాస్‌ఏంజెలెస్‌కి చెందిన డాక్టర్ రాబర్ట్ బర్నిష్ చేసిన పరిశోధన ప్రకారం కన్నీళ్లలోని పదార్థాలలో తేడాలుంటాయని తేలింది. ఉల్లిపాయలవల్ల కారే కన్నీళ్లలోని రసాయనిక పదార్థాలకు, దుఃఖంతో వచ్చే కన్నీళ్లలోని రసాయనిక పదార్థాలకు చాలా తేడాలున్నాయని ఆయన కనుగొన్నారు.

స్టాన్‌ఫర్డ్ మెడికల్ సెంటర్‌లోని డాక్టర్ ఆవిల్ ఎఫ్. ఎరిక్సన్ చేసిన మరో పరిశోధనలో కన్నీరులోని రసాయనిక పదార్థాలను బట్టి రాబోయే రోగాలను కనుక్కోవచ్చని తేలింది. ఆర్థరైటిస్, రుమాటిక్ ఫీవర్, సిస్టిక్ ఫైబ్రోసిస్‌లు, ఇంకా మరికొన్ని వ్యాధులను, కన్నీటిలోని రసాయనిక పదార్థాలను బట్టి తెలుసుకోవచ్చనే విషయాన్ని ఆయన కనుక్కున్నారు. కన్నీటిని విశ్లేషించే డాక్టర్స్ అమెరికాలో చాలా హాస్పిటల్స్‌లో ఉన్నారు.

ఆడవాళ్లు నెలకి సగటున 5.3 సార్లు ఏడిస్తే మగవాళ్లు 1.4 సార్లే ఏడుస్తారని డాక్టర్ ఫ్రే తన పరిశోధనలో కనుగొన్నాడు. నిజానికి ఏడుపువల్ల జలుబులాంటి జబ్బులు నయమవుతాయట. హార్ట్ ఎటాక్స్ కూడా తగ్గుతాయి. ఆడవాళ్లకు హార్ట్ ఎటాక్స్ మగవాళ్లకన్నా తక్కువ రావడానికి ఇదే కారణం. కొందరికి నిద్ర లేచాక, బాగా జలుబు చేసినప్పుడు కన్నీరు కారుతుంటుంది. అయితే ఉద్వేగంవల్ల కారే కన్నీళ్లు దీనికన్నా ఆరోగ్యకరం. సగటున మనిషి ఆరు నిమిషాలు ఏడుస్తాడని, ఏడ్చిన తర్వాత హాయిగా అనిపించడానికి కారణం రక్తంలోని అనేక మలినాలు కన్నీటి ద్వారా బయటికి రావడమేనని డాక్టర్ ఆల్గిల్ సిద్ధాంతీకరించాడు. ఏది ఏమైనా మన ఏడుపు మనకు మంచిది. కానీ చాలామంది పరాయివాళ్ల ఏడుపుని ఇష్టపడుతుంటారు.

## కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక



# ఒక జీవితం

పదిహేడేళ్ల జీన్‌కు 1819లో కాన్వెంట్ చదువు పూర్తయింది. అయిదేళ్లపాటు లోకానికి దూరంగా నాలుగ్గోడల మధ్య ఆశ్రమంలో గడిపిన కూతురికి 'జీవిత' వాస్తవాలు" గ్రహించే అవకాశం దొరకలేదని ఆమె తండ్రికి తెలుసు. అతడు నార్మండీ ప్రాంతంలో ఒక బేరన్. అంటే సంపన్నుడు. అరిస్టోక్రాట్. బేరన్ ఆస్తికి ఏకైక వారసురాలు జీన్. త్వరలోనే పెళ్లి చేసుకుని, పిల్లాపాపలతో యిక్కడే స్థిరపడాలని తండ్రి కోరిక.




ఎస్టేట్ అందానికి పరవశించిపోయింది జీన్. పల్లెపట్టులెంత ఆహ్లాదకరంగా వుంటాయి! ఒంటరిగా పొలాల్లో, కాలవ గట్ల మీద, కొండలు, గుట్టలమీద రోజంతా తిరిగి వచ్చింది. ఈ ప్రశాంతత, ప్రకృతి సౌందర్యం, మలయమారుతం మత్తెక్కించింది. ఈ అద్భుత జీవితం జీన్‌లో యిన్నాళ్ళూ నిద్రాణంగా వున్న కోరికల్ని జాగృతం చేసింది. కూతురి వాలకం చూసి, ఆమెక్కావలిసిందేమిటో తండ్రికి తెలిసిపోయింది. వీలైనంత త్వరగా పెళ్లిచెయ్యాలి. స్త్రీ జీవితానికి పరిపూర్ణతనిచ్చేది వివాహమే.

ఒక ఆదివారం నాడు చర్చి వెలుపల వైకౌంట్ జూలియన్ డిలామార్‌ను పరిచయం చేశాడు ప్రీస్టు. సమీపంలో వున్న మరో ఎస్టేట్‌కు యిటీవలే వచ్చిన ఈ యువకుడు మంచి కలుపుగోలు మనిషిగా కనిపించాడు. పెద్దగా ఆస్తిపాస్తులు లేవుగాని అందగాడు. బేరన్‌గారికీ, ఆయన భార్యకూ జూలియన్ నచ్చాడు. ఇంక ఆలస్యమెందుకు? డిన్నర్

ఆహ్వానాలతో ప్రారంభమైన పరిచయం పెరిగింది. ఏదో ఒకపని కల్పించుకుని తరచుగా యింటికి వచ్చాడు జూలియన్. తల్లిదండ్రులు వూహించినట్టే జీన్ అతడితో ప్రేమలో పడింది. పరిస్థితి చేయిదాటక ముందే ఘనంగా కూతురి పెళ్లి జరిపించాడు బేరన్.

అయితే శోభనం నాడు ఓ చిక్కు వచ్చిపడింది.

జీన్‌ది తెలిసీ తెలియని వయసు. ఎవరూ చెప్పకపోయినా, లోపలి కోరికలే దారి చూపిస్తాయి.

ఆ రాత్రి పనిపిల్ల రోసాలీ వచ్చి, పగలు వేసుకున్న డ్రెస్సు విప్పి, నైట్‌గౌన్ తొడిగినప్పుడు ఆమె భయంతో వణికిపోయింది. ఆ తర్వాత దిండులో తలదాచుకుని నిద్రపోవటానికి ప్రయత్నించింది.

గదిలో ప్రవేశించిన భర్త ప్రేమగా పలకరించాడు.

"వద్దు" అంది జీన్ గుసగుసగా.

"నీ కిష్టం లేదా? "

ఆ ప్రశ్న వినిపించిందో లేదో గాని జీన్ జవాబివ్వలేదు.

మరోసారి అడిగాడు జూలియన్.

"ఇప్పుడే కాదు"

రెండు మూడుసార్లు ప్రయత్నించి, విసిగి అటు తిరిగి పడుకున్నాడు. చిన్నపిల్ల. కాస్త ఓపిక పడితే తనే దగ్గరకు వస్తుంది.

ఆ తర్వాత కోర్సికాకు హనీమూన్ వెళ్లినప్పుడు 'తొలిరేయి' రుచి చూసింది జీన్. బాగానే ఉంది. నిష్కారణంగా యిన్నాళ్లూ వాయిదా వేశానే అని తనలో తాను నవ్వుకున్నది. హనీమూన్ ఒక మధుర స్వప్నంగా మిగిలిపోయింది.

అయితే త్వరలోనే ఆ తియ్యని కల ముగిసింది. ఇంటికి తిరిగి వచ్చిన కొద్దిరోజులకే 'దాంపత్య సుఖమంటే యింతేనా?' అనిపించింది. వాంఛా తీవ్రత తగ్గి, జీవితం 'రుచీ పచీ లేని చల్లారిన భోజనం'లా కనిపించింది.

తన ఆస్తి, జీవితం అర్పణ చేసిందీ యువకుడికి. నిజంగా యితడంటే ప్రేమ ఉందా? 'డబ్బు ఖర్చు పెట్టటంలోనే నిజమైన ఆనందం' ఉందని నేర్పించాడు తండ్రి? భర్తేమో మహా పొదుపరి, పిసినారి. కేవలం డబ్బు మనిషి.

జూలియన్‌కు కూడా భార్య పట్ల ఆసక్తి తగ్గింది. పక్కనే పడుకున్నా కోరిక కలగలేదు.

★ ★ ★

నెలలు గడిచాయి. పెళ్లి కాకుండానే పనిపిల్ల ఒక పిల్లకు జన్మనిచ్చింది. ఎంత అడిగినా తండ్రి ఎవరో చెప్పలేదు.

కొంత డబ్బిచ్చి ఆమెను పంపేద్దామన్నాడు జూలియన్. కాని బాలింత మీద జాలిపడిన జీన్ తల్లీ పిల్లల్ని యింట్లోనే ఉండమంది.

ఒకనాడు నిద్రపట్టక, కబుర్లు చెప్పుకోవటానికి రోసాలీ గది కెళ్లింది జీన్. అందరూ నిద్రపోతున్నారు. సందేహిస్తూనే తలుపు తెరిచింది. లోపల ఎవరూ లేరు. భర్త గది తలుపు తీసింది అంతే. ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి నేల కూలింది. మంచం మీద రోసాలీ.

మనుషులింత నీచంగా వుండగలరా! వైవాహిక జీవితమంటేనే అసహ్యమేసింది. తోటలో పిచ్చిగా పరిగెత్తింది. కొండపై నుండి సముద్రంలోకి దూకి ఆత్మహత్య చేసుకోవాలనుకుంది.

దట్టంగా మంచు కురుస్తూ రాకపోకలకు ఆటంకం ఏర్పడింది. ఇద్దరు పనిమనుషుల సాయంతో ఆ ప్రాంతమంతా గాలించి భార్యను కనుగొన్నాడు జూలియన్. అప్పటికే ఆమె బాధతో మూర్ఛపోయింది.

రంకు గురించి తెలిసినా బేరన్, ఆయన భార్య తేలుకుట్టిన దొంగల్లా నోరు మెదపలేదు. 'జూలియన్ తన పిల్లకు తండ్రి' అని

# గైడి మపాసా

## (1850-1893)

**న**లభైమూడేళ్లు మాత్రమే బతికిన మపాసా ఫ్రెంచి సాహిత్యంలో ధృవతార. చిన్న కథలు రాయటంలో తనకుతానే సాటి. తండ్రి నార్మండీలో స్టాక్ బ్రోకర్. విశృంఖలత మపాసా స్వభావంలోనే వున్నట్టుంది. స్కూల్లో క్రమశిక్షణ ఉల్లంఘించి చాలాసార్లు చిక్కుల్లో పడ్డాడు. 1870-71 మధ్య ఫ్రాంకో-ప్రష్యన్ యుద్ధకాలంలో సైన్యంలో చేరాడు. ఆ తర్వాత దగ్గరబంధువైన గుస్తావ్ ఫ్లోబేర్ (1821-1880) పర్ఫెక్షనిస్టుగా పేరుపడ్డ ప్రముఖ రచయిత 'మదాం బావరీ' రాసిం దీయనే) వద్ద శిష్యరికం చేసి రచనలోని మర్మాలు తెలుసుకున్నాడు. 'కథలు, కవిత్వం, పెద్ద కథలు, చివరికి నాటకం కూడా రాశాను' అని చెప్పుకున్నాడు. ఈయన కవితా సంకలనాన్ని ఆనాటి ప్రభుత్వం నిషేధించటానికి ప్రయత్నిం చింది కూడా.

ప్రతి ఆదివారం, లంచి తర్వాత శిష్యుడి కథలు చదివి విశ్లేషించిన ఫ్లోబేర్ 'సహనా నికి మారు పేరు ప్రతిభ' అన్న మంత్రం ఉపదేశించాడు. 'మనకు బాగా తెలుసను కున్న ప్రతి విషయంలోనూ తెలియనితన మొకటుంటుంది. సాధారణంగా కనిపించే అంశంలోని అసాధారణత్వాన్ని పట్టుకోవ టమే కథ'

ఆనాటి అగ్రశ్రేణి రచయితలు తుర్గేనేవ్, దాదె, ఎమీల జోలాలు మపాసాకు మిత్రులు. 1880లో జోలా కోరిక మేరకు రాసిన Boule de Suif (కొవ్వు ముద్ద) కథా సాహిత్యంలో కొత్తపుంతలు ఆవిష్క రించింది.

ఆ తర్వాత పదేళ్లపాటు రష్యన్ జీని

ప్రీస్టు ముందర కన్‌ఫెస్ చేసింది రోసాలీ. గుట్టుచప్పుడు కాకుండా రోసాలీకి పెళ్లి చేసి దూరంగా పంపించాడు బేరన్.

అయిష్టంగా మళ్లీ 'కాపురం' చేసింది జీన్. ఏడాది తిరక్కుండానే పిల్లాణ్ణి కూడా కన్నది. ముద్దుగా 'పాల్' అని పేరు పెట్టుకుంది. వాణ్ణి పెంచి పెద్ద చెయ్యటమే యిప్పుడు తన జీవిత లక్ష్యం.

★ ★ ★

బేరన్‌గారి యిరుగు పొరుగులందరూ సంపన్నులే. అందులో 'ఫోర్విల్' కుటుం బంలో జూలియన్‌కు రాకపోకలెక్కువ. ముఖ్యంగా కౌంచెస్ గిల్బర్ట్ ఫోర్విల్ అతని అమితంగా ఆకర్షించింది. ఒకనాడు జీన్ ఎస్టేట్ వెనక అరణ్యంలో నడుస్తున్నప్పుడు రెండు గుర్రాలు కనిపించాయి. అందులో ఒకటి తన భర్తది. మరొకటి గిల్బర్ట్‌ది. త్వరలోనే సందర్భం అర్థమైంది. జూలియన్ స్వభావంలో మార్పు రాలేదన్నమాట.

★ ★ ★

మొదటి నుండీ జీన్‌కు తండ్రి కన్నా, తల్లి వద్దే చనువెక్కువ. అన్నింట్లోనూ ఆవిడనే ఆదర్శంగా తీసుకున్నది. జీన్ దృష్టిలో ఆమె పరిపూర్ణ మహిళ. అంటే పరిపూర్ణ సతి. పరిపూర్ణ మాతృమూర్తి.

అనారోగ్యంతో ఆమె మరణించిన కొన్నా ళ్లకే జీన్, తల్లి భద్రంగా దాచుకున్న వుత్త రాలూ, డైరీ చదివి నిర్ఘాంతపోయింది. ఆమె తను వూహించినంత పవిత్రురాలేమీ కాదు. పెళ్లైన కొత్తల్లోనే మరో వ్యక్తితో ప్రేమా

యస్ చెకోవ్‌తో కలిసి చిన్న కథల్ని అప్పటిదాకా పాఠకులు కనీవినీ ఎరుగని రీతిలో పరిగెత్తించాడు మపాసా. ఈయన 'నెక్‌లెస్' గురించి తెలియనివారుండరు. హెన్రీ జేమ్స్ అభిప్రాయంలో యిది మోస్ట్ పర్ఫెక్ట్ షార్ట్ స్టోరీ.

మపాసా కథల అనుకరణలు పుంఖానుపుంఖంగా వున్నాయి. ఇప్పటికి కనీసం 65 నకిలీ మపాసా కథలు ప్రచారంలో వున్నాయి.

తొలి రచనలతోనే కీర్తి శిఖరాలనధిరోహించిన మపాసా జీవితం అర్ధాంతరంగా ముగియటానికి కారణం సాహిత్య కృషి మాత్రం కాదు. విశృంఖల జీవిత ఫలితంగా 1886లో సిఫిలిస్ సక్రమించింది. కండరాలూ, నరాలూ పట్టుతప్పిపోవటం ప్రారంభమైంది. చూపు మందగించింది. అంధత్వం ఎంతో దూరంలో లేదు.

కేవలం పదకొండేళ్లలో 300 కథలూ, ఆరు నవలలూ రాసిన మపాసా ఒక్క అయిదేళ్ల కాలం (1882-87)లోనే 250 కథలు రాశాడు. Une Vie ఈయన తొలి నవల 1883లో అచ్చయింది. చిన్న కథలలో పాటించే కథనంలోని చిక్కదనాన్ని నవలా రచనకు కూడా విస్తరింపచేసిన రచయిత ప్రతిభ అసామాన్యం.

నలభై నిండకుండానే మపాసాకు జబ్బు ముదిరింది. ఉన్మాద లక్షణాలు కనిపించాయి. ఈయన కాళ్లూ, చేతులూ కట్టేసి కాన్ నగరంలోని ఆసుపత్రికి తీసుకుపోవటం ఆనాటి పత్రికల్లో పతాక శీర్షికగా మారింది.

పరిస్థితి పూర్తిగా చేయిదాటిపోవటానికి ముందురోజు మపాసా, ఆసుపత్రి గోడ మీద యిలా రాసుకున్నాడు- "ఇవాళే అనుభవించు బాధను. రేపు నీకు ఈ స్పృహ కూడా వుండదు"

ఆ తర్వాత కొద్దిరోజులకే అత్యంత దయనీయమైన స్థితిలో మరణించాడీ మహా రచయిత.

1900లో రూన్ నగరంలో మపాసా స్మృతి చిహ్నం ఏర్పాటు చేశారు.

శ్రీశ్రీ మపాసాను ఆధునిక మహర్షుల్లో ఒకడన్నాడు.

యణం నడిపింది. ఈ లోకంలో అందరూ యింతేనా?

జీవితంలో యిప్పుడు తను ఏకాకి. కనీసం పాల్‌కు తోడుగా వుండటానికైనా ఎవరో ఒకరు కావాలి. భర్తతో సంబంధాలు పునరుద్ధరించుకోక తప్పదు.

జూలియన్ మొదట బెట్టు చేశాడు. అనేకసార్లు బతిమాలించుకుని, ఏదో మహోపకారం చేస్తున్నట్టుగా అంగీకరించాడు. కాని యిప్పుడు ఆమె అవసరమే అతడికి లేదు. రాత్రంతా గడిపినా, జీన్ గర్భం దాల్చకుండా జాగ్రత్త పడ్డాడు. ఆ తర్వాత ప్రీస్టు సలహా ప్రకారం, ఎత్తుకు పైఎత్తుగా జీన్ తను గర్భవతిననీ, యింకే జాగ్రత్తలూ పాటించవలసిన అవసరం లేదనీ భర్తతో అబద్ధమాడింది. ఆ తర్వాత మరికొన్నాళ్ళకే జీన్ నెల తప్పింది.

★ ★ ★

పాత ప్రీస్టుకు ప్రమోషన్ వచ్చి వెళ్లిపోయాడు. కొత్త ప్రీస్టు పేరు టోల్బియా. తన పారిష్‌లోని 'విశ్వాసు'లందరూ పవిత్రంగా వుండాలని, కట్టుబాట్లను కఠినంగా అమలు చేశాడు. అంటే జూలియన్ గిల్బర్ట్‌ల 'రంకు' యింక సాగటానికి వీల్లేదు.

మతగురువులు పాపపుణ్యాల గురించి వుపన్యాసాలివ్వగలరే గాని శాసించలేరు. టోల్బియాను అవహేళన చేశాడు జూలియన్.

ఇంకేముంది? ఆ ఆదివారం చర్చి సందే



శంలో భాగంగా, ఈ 'పాపులిద్దర్నీ' పేరు పెట్టి విమర్శించాడు టోల్బియా. కౌంట్ ఫోర్విల్‌ను అవమానం దహించివేసింది.

ఒక మధ్యాహ్నం ఆకాశం మేఘావృత మైంది. తుఫాను గాలి వీచింది. సముద్రం హోరెత్తింది. కౌంట్ ఫోర్విల్ తన భార్య కోసం వూరంతా వెదికాడు. అతని ఆదుర్దా చూసి జీన్ మనసు కరిగింది. కొండ శిఖరం మీద పశువుల కాపరులు ఒక పాక వేసుకు న్నారు. సాధారణంగా అది ఖాళీగానే వుంటుంది. భార్య కోసం అన్వేషిస్తున్న గిల్బ ర్ట్‌కు అక్కడ, కట్టేసివున్న గుర్రాలు రెండు కనిపించాయి. ఆత్రుతగా వెళ్లి చూశాడు. లోపల ప్రేమికులిద్దరూ గాఢాలింగనంలో వున్నారు. కోపం పట్టలేక కౌంట్, బైటినుండి గొళ్లెం పెట్టి, తన బలమంతా ప్రయోగించి పాకను కిందికి తోశాడు. స్పృహలోకి వచ్చిన జూలియన్, గిల్బర్ట్‌లు ప్రాణభయంతో కేకలు వేశారు. ఆ రాత్రే జీన్ మృత శిశు వును ప్రసవించింది. కలలు ఆవిరైపోతున్న జీవితంలో నిర్వేదమే మిగిలింది. మూడు నెలలు జబ్బు పడింది.

బేరన్, ఒక దూర బంధువు ఆంట్ లైస న్‌ల సేవలతో ఆరోగ్యమైతే కాస్త కుదుటప డింది గాని మానసికంగా బాగా కుంగిపో యింది. తొలిరోజుల ఆనందం గుర్తుకు వచ్చి బాధ రెట్టింపైంది. తన తృప్తి కోసం, జూలియన్ తప్పుల్ని క్షమించింది.

పాల్ అల్లారుముద్దుగా పెరిగాడు. 'చర్చిలో తప్ప అంతటావున్నాడు దేవుడు' అంటూ పాల్‌కు బోధించాడు బేరన్.

★ ★ ★

పదిహేనేళ్లప్పుడు పాల్‌ను బోర్డింగ్ స్కూల్‌కు పంపారు. కొడుకు కూడా దూరం కావటంతో జీన్ మరింత ఒంటరిదైంది. ఇప్పుడామె నిరీక్షణంతా స్కూలు సెలవుల కోసమే. ఒకప్పటి అందాల బరిణ, అకాల వృద్ధాప్యంతో తండ్రికి చెల్లెలిలా కనిపిం చింది.

గారాబంగా పెరిగిన పాల్ దురలవాట్లకు బానిసయ్యాడు. ఇరవయ్యేళ్లకే తాగుడు, జూదం, వ్యభిచారం నిత్యకృత్యాలుగా మారాయి. త్వరలో ఆస్తంతా హారతి కర్పూ రంగా హరించుకుపోవటం ఖాయం. డబ్బుకోసం తప్ప తల్లికి వుత్తరాలు రాయటం కూడా మానేశాడు.

ఆంట్ లైసన్ మరణించింది. రోసాలీ సంపద యిబ్బడి ముబ్బడిగా పెరిగింది. మనిషి కూడా లావెక్కింది. జీన్ పరిస్థితి తెలిసి తోడుగా వుంటానని వచ్చింది. ఒక ప్పటి పనిపిల్ల, యిప్పుడు సమాన హోదాలో మాట్లాడుతోంది.

పాల్ పుణ్యమా అని ఎస్టేట్ మొత్తం అప్పులవాళ్ల స్వాధీనమైంది. ఊరి చివర ఒక చిన్న యిల్లు కొనుక్కుని అందులోకి మారింది జీన్. రోసాలీ చెప్పినట్టు వినటం తప్ప చెయ్యగలిగిందేమీ లేదు. ఎప్పటికైనా కొడుకు తిరిగి వస్తాడనే ఒకే ఒక్క ఆశనింకా సజీవంగా వుంచింది.

అప్పులవాళ్ల నుండి ఎస్టేట్‌ను తిరిగి కొనుగోలు చేసింది రోసాలీ. ఒకనాడు ఆమెతో కలిసి వెళ్లి తనకు సుపరిచితమైన యింటిని చూసి వచ్చింది జీన్.

రోజులు భారంగా గడిచాయి. పాల్ నుండి ఉత్తరం వచ్చింది. తను సహజీవనం చేస్తున్న స్త్రీ పురిట్లో మరణించిందనీ, పుట్టిన శిశువును తీసికెళ్లి పెంచుకొమ్మనీ రాశాడు.

రోసాలీ వెళ్లి పసికందును తీసుకొచ్చింది.

ఇప్పుడు జీన్ జీవితానికి పరిపూర్ణత వచ్చింది. మనవణ్ణి ఒళ్లో వేసుకుని అలౌకికా నందాన్ని అనుభవించింది.

'జీవితం విచిత్రమైంది. అది మనం వూహించుకున్నంత మంచిదీ కాదు. చెడ్డదీ కాదు.'

–ఎం.వసంత



# చతుర ప్రవేశిక



## జులై - 08

జులై 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అన్నీ సరిగా రాసినవారికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి.. (ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. విజేతల ఎంపికలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. సంపాదకులదే తుదినిర్ణయం).

1. జమిందార్ తెచ్చిన వింత వస్తువు?
2. పెట్రోమాక్స్‌లైట్ వెలిగించేదెవరు?
3. బక్కన్న భార్య పేరు?
4. సుభద్రమ్మ కోడలు?
5. పాతవిత్తనాలు సేకరించే వ్యక్తి?
6. నర్సిగాడికొడుకు ఉద్యోగం ఎక్కడ?
7. భూమిని రక్షించుకునేందుకు బక్కన్న వేసిన తోట?
8. విశ్వనాథం పిల్లలు అమెరికాలో ఉండేదెక్కడ?
9. విశ్వనాథం, రైతులు బస్సులో మొదట చేరిన ఊరు?
10. విశ్వనాథం బృందం మహారాష్ట్రలో కలుసుకున్నదెవరిని?
11. బెర్నార్డ్‌షాకు ఇష్టమైన బుక్కు?
12. పదకొండేళ్లలో మపాసా రాసిన మొత్తం కథలు?
13. వాల్మీకి ప్రశంసలందుకున్న వాలి భార్య?
14. అతడు ఏ విగ్రహం వెనుక నక్కి కూర్చున్నాడు?
15. రమ్య పాత్ర ఉన్న సీరియల్?

---

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (  )

చిరునామా: ------------------------------------------------

------------------------------------------------------------

------------------------------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

# జూన్ విజేతలు వీరే!

జూన్ చతుర ప్రవేశికకు వచ్చిన అసంఖ్యాక స్పందనల్లో సరైన సమాధానాలు పంపి డ్రాలో విజేతలైన ఈ అయిదుగురికీ అభినందనలు. వీరికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. **కె.మహేశ్** - తిలక్‌నగర్, గుంతకల్
2. **ఎం.ఎస్. శైలజ** - ముసారాంబాగ్, హైదరాబాద్
3. **జి.టి. సుందరి** - ఏనుగులవారివీధి, పోలవరం
4. **మంచాల శ్రీలక్ష్మి** - సాగర్‌నగర్, విశాఖపట్నం
5. **ఎం.సుమలత** - దేవీనగర్, బళ్లారి, కర్ణాటక



## అన్ని సమాధానాలు సరిగా పంపిన ఇతరులు

1. పులి శ్రావణ్‌కుమార్, ముల్కలపల్లి, వరంగల్ జిల్లా 2. ఏనుగుల సురేష్, గడ్డివానిపల్లె, కరీంనగర్ జిల్లా 3. యు. విజయశేఖరరెడ్డి, భాగ్యనగర్‌కాలనీ, కుకట్‌పల్లి హైదరాబాద్ 4. యు.యు.యు. ఎమ్మిగనూరు5. టి. ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి 6. యు. కృష్ణమూర్తి, ఊటుకూరు, నెల్లూరు జిల్లా 7. బందా శ్రీనివాసరావు, కొత్తపేట, ఒంగోలు 8. జి. సరళ, సింహాచలం, విశాఖజిల్లా 9. గొట్టుముక్కల బ్రహ్మానందం, సంగారెడ్డి 10. ఎ.వి.ఆర్. కృష్ణ, కాట్రేనికోన 11. పారుపల్లి వెంకటేశ్వరరావు, నల్లకుంట, హైదరాబాద్ 12. జయశ్రీ జనమంచి, ట్రూప్ బజార్, హైదరాబాద్ 13. నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం 14. ఎస్. రాజ రాజేశ్వరీదేవి, సరూర్‌నగర్, హైదరాబాద్ 15. నెల్లుట్ల ప్రేమలత, విద్యానగర్, హన్మకొండ 16. కొల్లు రాజశ్రీ, బ్రాడీపేట, గుంటూరు 17. నల్లమోతు సుబ్బారావు, సాయిబాబారోడ్డు, గుంటూరు 18. ఎ. రామారావు, లలితానగర్, విశాఖపట్టణం 19. ఎస్. ఖాజీవలి, గుత్తి 20. శైలూషి, అరసవిల్లి, శ్రీకాకుళం 22. వి. మోహన వెంకట రత్నాజి, సైదాబాద్, హైదరాబాద్ 23. ఎస్. సుధాకర్, సరూర్‌నగర్, హైదరాబాద్ 24. వి. ఇందిర, నందిగామ, కృష్ణాజిల్లా 25. బి. ఎస్. లక్ష్మి, రాజమండ్రి 26. రామకూరు లక్ష్మి, గుజరాతిపేట, శ్రీకాకుళం 27. కన్నేపల్లి నారాయణమూర్తి, మంగువారితోట, శ్రీకాకుళం 28. రాయల్లి లాలెప్పచౌదరి, బళ్లారి 29. పిన్నమనేని కృష్ణారావు, విజయవాడ 30. గంటి భానుమతి, మల్లాపూర్, హైదరాబాద్ 31. పి. సత్యవతి, గచ్చిబౌలి, హైదరాబాద్ 32. ఎస్. నరసింహాచారి, గాంధీనగర్, హైదరాబాద్ 33. మణిమేఖల, విజయవాడ 34. పుట్ట విజయశ్రీ, తణుకు 35. ఎ. తిరుమలేశ్వరి, గుంటూరు 36. ప్రతాపురం రామానుజాచారి, హన్మకొండ 37. శ్రీనివాస్, తిమ్మాపూర్‌పేట్, రాయచూరు 38. జి. రమాకుమారి, అమీర్‌పేట్, హైదరాబాద్ 39. వి. శివశంకర్, బేగంపేట్, హైదరాబాద్ 40. అమిరినేని వివేకానంద, రేపల్లెవాడ, ఖమ్మం జిల్లా 41. కమతం వజ్రపణి, కాజీపేట, వరంగల్ జిల్లా 42. వి. పార్థసారథి, బళ్లారి, కర్ణాటక 43. వాసాల వెంకటేశ్వరరావు, ఇంగ్లీష్‌పాలెం, మచిలీపట్నం 44. టి. సుందరరామయ్య, రాజమండ్రి 45. శ్రీదేవి గుండిమెడ, విజయవాడ 46. భిల్లా మనోహర్, వరంగల్ 47. ఎ.ఎస్. రాధాకృష్ణ, కడప 48. బి. ఉషారాణి, అరసవిల్లి, శ్రీకాకుళం జిల్లా 49. ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు 50. పి. రాఘవరెడ్డి, క్రిష్టియన్‌పల్లి, మహబూబ్‌నగర్ జిల్లా 51. పి. రత్నకుమారి, కాకినాడ 52. జి.వి.ఎస్. కామేశ్వరరావు, విశాఖపట్నం 53. కె.వి. రమణమూర్తి, సైదాపేట్ వెస్ట్, చెన్నయ్ 54. బి. ప్రభావతి, అలకాపురి, హైదరాబాద్ 55. నవిత పోతుల, క్రిష్టియన్‌పల్లి, మహబూబ్‌నగర్ 56. సి. హెచ్. మోహన్‌రావు, విద్యానగర్, హైదరాబాద్ 57. వి. ఆంజనేయ ప్రసాద్, బెంగళూరు 58. కె. కామేశ్వరరావు, జంగారెడ్డిగూడెం 59. డి. భారతి, పెదమజ్జిపాలెం, విజయనగరం జిల్లా

# 50 శాతం క్లబ్

అమెరికాలో ఆర్లింటన్ నగరంలోని ఇల్లింగర్ తన భార్య ఏన్‌తో కలిసి ఓ విచిత్రమైన క్లబ్ స్థాపించాడు. దానిపేరు '50శాతం లీగ్'. తమ ఆదాయంలోని సగభాగం ఈ క్లబ్‌కి ఉచితంగా ఇవ్వడం ఇందులో చేరడానికి అర్హత. ఆ ధనాన్ని సమాజంలో అట్టడుగు వర్గానికి సహాయం చేయడానికి ఆ క్లబ్ ఉపయోగిస్తోంది.




అమెరికాలో నలుమూలల నుంచి ఈ క్లబ్‌కి సభ్యులున్నారు. వారి సంఖ్య తొంభై దాటింది. వారు ఆ క్లబ్‌లో చేరడానికి కారణాలు అనేకం. తమకి ఎక్కువ, కొందరికి తక్కువ ఆదాయం ఉండటం సబబుకాదన్న సదుద్దేశంతో కొందరు దీంట్లో చేరితే, సామాన్యంగా జీవించాలనే కోరికని తీర్చుకోవడానికి మరికొందరు, మతపరమైన భావాలవల్ల ఇంకొందరు, మరణించిన తమ ప్రియమైనవారి జ్ఞాపకార్థం తమ ఆదాయంలోని సగభాగాన్ని ఇచ్చేవారు కొందరు ఉన్నారు. ఇలా అనేక కారణాల వల్ల దీనిలో తొంబైకి పైనే సభ్యులయ్యారు.




ఉదాహరణకి డేవిడ్ లుడ్లో(64), అతని భార్య వేండా 1996లో పర్వతారోహణ చేస్తూ ప్రమాదంలో మరణించాక ఆమె జ్ఞాపకార్థం దీంట్లో సభ్యుడయ్యాడు. భార్యనుంచి సంక్రమించిన ఆస్తిమీద మీద వచ్చే ఆదాయం కూడా పెరగడం ఇంకో కారణం. ప్రస్తుతం అతనికి ఏటా మూడు లక్షల డాలర్ల ఆదాయం వస్తుంది. ఫ్రీలాన్స్ ఫొటోగ్రాఫరైన ఇతనిలో మొదటినుంచీ వామపక్ష భావాలు బలంగా ఉండటంతో తను అసమానతలతో జీవించకూడదని, అమెరికాలో ఒకే ఒక్క శాతం అత్యంత ధనికులైనవారిలోకి తను చేరకూడదని భావించి ఈ క్లబ్‌లో సభ్యుడయ్యాడు. ఏటా లక్షన్నర డాలర్లు ఈ క్లబ్‌కు ఇస్తున్నాడు.

మరో సభ్యురాలు జెన్నిఫర్ లాడ్‌కి ఆమె ఇరవై ఒకటో ఏట చాలా ఆస్తి సంక్రమించింది. సమాజంలో తక్కువ ఆదాయంతో జీవించేవారికి సహాయం చేయాలన్న సత్సంకల్పంతో ఈ క్లబ్ మొదలవ్వగానే చేరింది. ఇప్పుడు ఆమె వయసు 54.

ఈ క్లబ్‌కి ఒకతను అత్యధికంగా ఇచ్చే ధనం నాలుగు లక్షల డాలర్లు. దాన్నిచ్చే వ్యక్తి గుప్తంగా ఉండదలచుకోవడంతో అతని వివరాలు వెల్లడికాలేదు. అలాగే అతి తక్కువ ఆదాయం నలభై వేల డాలర్లు. కోడక్ కంపెనీ ఉన్నతాధికారి ఫ్రాంక్ బట్లర్ నుంచి ఈ మొత్తం వస్తుంది. 2007లో మొదలైన ఈ '50 శాతం క్లబ్' అనతి కాలంలోనే అత్యధిక ప్రాచుర్యం పొందింది.




## కార్ల దుకాణం

జర్మనీలో మ్యూనిచ్ నగరంలో కార్ల దుకాణాన్ని ఇలా బహుళ అంతస్తుల భవనంగా నిర్మించారు. కొనుగోలుదారులు ఎంపిక చేసుకున్నాక లిఫ్ట్‌లో వాహనాల్ని కిందకి తరలిస్తారు.
చోటు సమస్య దృష్ట్యా భాగ్యనగరంలోనూ ఇలాంటి ఏర్పాట్లు అవసరం.

చతుర కథలు

# అహల్య

ఆరోజు అహల్య బజారునుండి వస్తుంటే కలిశాడు ఇంద్ర. అహల్య ముఖం తిప్పుకుని విసురుగా వేగంగా నడవసాగింది. ఇంద్ర ఆమెతో సమానంగా వేగంగా నడుస్తూ పక్కగా వచ్చాడు.

"మరోసారి ఆలోచించు అహల్యా"

కోపంగా చూసింది అహల్య.

"నేను నిన్ను ఎంతగా యిష్టపడుతున్నానో... నువ్వు మాత్రం కాదంటే కాదంటున్నావు"

"అది జరగని పని ఇంద్రా... నువ్వంటే యిష్టంలేదని ఎన్నోసార్లు చెప్పినా నా వెంట పడటం మానటం లేదు... పైగా నేను వివాహితను... పరాయి స్త్రీని కోరుకోవటం తప్పని నీకు తెలియదా ఇంద్రా" ...

"నువ్వంటే నేను పడి ఛస్తాను... నిన్ను పెళ్లిగాక ముందునుంచే ఆరాధిస్తున్నాను... కాబట్టి నా దృష్టిలో నువ్వు ఎప్పటికీ నా దానివే"

"మూర్ఖంగా ఆలోచించకు ఇంద్రా... నువ్వెంత తప్పుపని చేస్తున్నావో నీకు తెలియటం లేదు" కోపంగా అరిచి వెళ్లిపోయింది అహల్య.

"ఎప్పటికైనా ఏదోరకంగా నిన్ను లోబరచుకుంటాను. సమయం కోసం ఎదురుచూస్తాను" వెళ్తున్న ఆమెను కోరగా నవ్వుకుంటూ చూస్తూ కాసేపు అక్కడే నిలబడిపోయాడు ఇంద్ర.

★ ★ ★

"ఏమండీ... ఇప్పుడు మీరు క్యాంపు వెళ్లాల్సిందేనా"? అడిగింది అహల్య.

"తప్పదుఅహల్యా ఇదిచాలా ముఖ్యమైన పని" అన్నాడు గౌతమ్.

"పోనీ రెండురోజులు వాయిదా వేసుకోగూడదూ? "

"లేదు- వాయిదా వేస్తే రెం(డ్రోజుల క్యాంపు వారం రోజుల వరకు పట్టొచ్చు"

"ప్చ్"

"అసలే నువ్వు పిరికిదానివి... తలుపులన్నీ జాగ్రత్తగా వేసుకుని పడుకో...



వస్తా" అంటూ వెళ్లిపోయాడు గౌతమ్.

ఆఫీసు పనుల రీత్యా తరచూ క్యాంపులకు వెళ్తుంటాడు గౌతమ్. అతను లేనప్పుడు ఒంటరితనం తప్పటం లేదు అహల్యకు.

★ ★ ★

"అహల్యా! అహల్యా" పిలిచాడు గౌతమ్. ఉలిక్కిపడి లేచి డోర్‌మిర్రర్ లోంచి చూసింది అహల్య. బాగా వర్షం పడుతుంది. రెయిన్‌కోటులో గౌతమ్ ఎదురుగా ఉన్నాడు.



"అదేంటి? రెండ్రోజులదాకా రానని వెంటనే వచ్చాడేంటబ్బా" క్షణకాలం ఆలోచనలతో పడిపోయి మరోసారి అటే చూసింది... మనసులో చిన్న అనుమానం కలిగింది.

"అక్కడే నిల్చున్నావేం? లోపలికి రా గౌతమ్" పిలిచింది అహల్య. గౌతమ్ డోర్ తెరవటానికి ప్రయత్నించాడు... కానీ తెరచుకోవటం లేదు.

అహల్య బిగ్గరగా నవ్వింది.

"నువ్వు గౌతమ్‌వి కావు... నువ్వు ఇంద్రవి... అవునా ఇంద్రా... నీ అసలు రంగు నేనప్పుడే కనిపెట్టాను. నన్ను, నా కళ్లను మోసం చేసినా నా డోర్‌లాక్‌ని నువ్వు మోసం చేయలేవు... అవి గౌతమ్ వేలిముద్రలకు మాత్రమే తెరుచుకునే బయోమెట్రిక్ లాక్స్... నువ్వు వేషం మార్చినంత మాత్రాన వేలిముద్రలు మార్చలేవు... యూ ఫూల్... గెట్ అవే... నేను పురాణకాలపు అహల్యను కాను... బికేర్"...

ఇంద్ర అవమానంతో తలొంచుకుని నడిచివెళ్లిపోతున్నాడు. అహల్య నవ్విన నవ్వు ఇంకా అతనికి వినపడుతూనే ఉంది.

–కోటమర్తి రాధా హిమబిందు

# ఐడియాలు అమ్మబడును

ఉద్యోగం నుంచి రిటైరై సొంత వూరు వచ్చి సెటిలయింతరువాత నెలకోసారైనా ఒంగోలులో వుంటున్న నా మిత్రుడు, లాయర్ హనుమారెడ్డి దగ్గరకు పోయి సాహితీ కబుర్లు చెప్పుకోవడం పరిపాటయిపోయింది. హనుమారెడ్డి గొప్ప క్రిమినల్ లాయరే గాక మంచి కవి. జిల్లా రచయితల సంఘం అధ్యక్షుడు గూడాను. ఆయన ఒక కవితా సంపుటి, రెండు మూడు దీర్ఘ కవితా కావ్యాలు కూడా ప్రచురించారు.

నాకు పుస్తకాల పిచ్చి. నేనుండేది పల్లెటూరు. అక్కడ పుస్తకాలు దొరకవు. రెండు మూడు దినపత్రికలు ఆదివారం అనుబంధంతో సరిపుచ్చుకోవాలి. దగ్గర్లో ఎక్కడా లైబ్రరీ గూడా లేదు. రాతి దేవుళ్ళ దేవాలయాలకు లక్షలకు లక్షలు భయపడి ఇచ్చే భక్తులున్నారు గానీ గ్రంథాలయాలకు పది పైసలివ్వలేని జనం బతికే వూరు మాది. అందువల్ల నెల మొదట్లో పెన్షన్ పుచ్చుకొని ఒంగోలుకో, గుంటూరుకో పోయి కొన్ని మాసపత్రికలు, వారపత్రికలు, కొత్తగా వచ్చిన ఒకటి రెండు పుస్తకాలు కొనుక్కుని, అవే నెలంతా మేస్తూ, చాలకపోతే నా దగ్గరున్న చిన్నపాటి లైబ్రరీలోని ఇష్టమైన పాత పుస్తకాలు నంజుకుంటుంటాను.

ఎప్పట్లానే ఆరోజు హనుమారెడ్డి దగ్గరకు పోయాను. ఆయన రీసెంట్‌గా కొన్న పుస్తకాలు తిరగేశాను. తరువాత కబుర్లలో ఆయనే అన్నారు.

"ఏమోయ్ కనకం! ఇదిగో 'జీవన గీతాలు' ఈ నెలలోనే వచ్చింది. చాలా బాగుంది చూడు" అంటూ తన టేబుల్ మీదున్న పుస్తకాన్ని నా ముందుంచాడు.

కొత్త పుస్తకాన్ని కవర్ పేజీతోనే కొలత వేయడం నా పాడుబుద్ధి. ఆ తరువాత ప్రచురణ, రేటు, కాపీల సంఖ్య, ప్రాప్తిస్థానం మొదలైనవి చూస్తాను. ఆ తరువాత 'ముందుమాట'లు, 'ఒక్కమాట'లు, 'జేజేలు', 'బాకాలు', 'కాకాలు' యెవరు రాశారో చూస్తాను. అవి రాసిన వారిని బట్టి ఆ పుస్తకాన్ని కొంతలో కొంత

అంచనా వేస్తాను.

అలాగే ఆ పుస్తకాన్ని చూశాను. వెల వంద రూపాయలు. కాబట్టి ఆ రోజుకది కొనడం కష్టమే. ఎందుకంటే నా పుస్తకాల కొనుగోలు బడ్జెట్ నెలకు రెండు వందల రూపాయలు. ఈ ఒక్కదానికే అంత ఖర్చు చేస్తే మిగతాయేవీ కొనలేను. యేవో కొన్ని మ్యాగజైన్లు తప్ప. సరేలే చూద్దాం



అనుకుంటూ ఆ పుస్తకం పైపైన చూస్తుండగా, ఎవరో క్లయింట్స్ గాబోలు హనుమారెడ్డిగారి కోసం వచ్చారు.

"సరే రెడ్డిగారూ! బజార్లో ఓ గంట పనుంది. ఆ టైములో ఖాళీ దొరికితే వీలైనంత వరకు ఈ పుస్తకాన్ని చూస్తాను" అంటూ ఆ పుస్తకంతో లేచాను.

"ఏమోయ్ కనకం! జాగ్రత్త. నేను పుస్తకాలు బయటకివ్వనని తెలుసుగా" అన్నాడు హనుమారెడ్డి.

"తెలుసు స్వామీ! ఇక్కడే కూర్చొని సాయంత్రందాకా చదువుకున్నా, కాఫీలు, టిఫిన్లు, టయానికి భోజనాలు ఏర్పాటు చేస్తావుగానీ, పుస్తకాలు బయటకు పట్టుకుపోనీయవు. తెలిసిందే గదా! టైము వేస్టుగాకుండా వుండేందుకు తీసుకుపోతున్నా. తరువాత బాగున్నట్లు తోస్తే కొనుక్కుంటాను" అంటూ బయటపడ్డాను.

గంట లోపల నా పనులు పూర్తి చేసుకొని తిరిగి హనుమారెడ్డి దగ్గరకు పోయాను.

"ఏమిటోయ్! పనైపోయిందా! పద భోజనానికి టైమయింది. తింటూ మాట్లాడుకుందాం!" అని మరచిపోయిందేదో గుర్తొచ్చిన ఫీలింగుతో "అవునూ! నా జీవన గీతాలేదోయ్" అన్నాడు.

"వుందిలే మహాప్రభూ!" అంటూ బాగ్ లోనుంచి తీసిచ్చాను. అది చూసి ఆశ్చర్యపోతూ "అరె. దీన్ని బైండు చేయించుకొచ్చావా? చాలా బాగుందోయ్. థాంక్సె లాట్. ఏమైనా మంచి పుస్తకాల మీద నీకున్న జాగ్రత్త గొప్పదోయ్. నిన్ను అప్రీషియేట్ చేయకుండా వుండలేకపోతున్నాను. కీపిటప్. అవునూ బైండింగ్ కెంతయింది? చాలా నీట్ గా వుంది" అన్నాడు.

"ఎంతలెండి నలభై రూపాయలేగా!" అన్నాను తేలిగ్గా.

"బైండింగుకి నలభై రూపాయలా! ఎవడయ్యా వాడు. నీకెవడో బాగా టోపీ పెట్టాడు. టౌన్లో మెత్తగా వుండగూడదయ్యా! నీ మెతకదనం చదివినట్లున్నాడు. తెలివిగా పదిరూపాయల పనికి నలభై రూపాయలు కొట్టేశాడు మోసపు వెధవ" అన్నాడు. నన్ను పల్లెటూరి బైతూ అని వెక్కిరించినట్లుందాయన మొహం.

ఇంకా పొడిగించడమెందుకులెమ్మనుకొని, చిన్నగా చెప్పడం ప్రారంభించాను. "అది బైండింగ్ ఖర్చుగాదు రెడ్డిగారూ! ఆ బుక్కు ఖరీదే నలభై రూపాయలు. మేలు

ప్రతి" అన్నాను.

నమ్మలేనట్లుగా దాన్ని తెరచి చూసి "యిక్కడ రేటు వంద రూపాయలనుం దిగా" అన్నాడు.

"అది సాదా ప్రతి రేటండీ బాబూ! మేలు ప్రతి నలభై రూపాయలే" అన్నాను.

"అదేమిటోయ్ కనకా! వెర్రి వెంగళప్పలా మాట్లాడుతున్నావ్. సాదా ప్రతి వందరూపాయలేమిటి? మేలు ప్రతి నలభై రూపాయలేమిటి? నీకేమైనా మతిగాని పోయిందా? రివర్స్‌లో మాట్లాడుతున్నావ్. బాబూ! నిజంగా నీకేదో అయింది. సైకియాట్రిస్ట్ దగ్గరకు పోదాం పదవయ్యా!" అన్నాడు.

"దీనికి సైకియాట్రిస్ట్‌దాకా యెందుకుగాని, మేలు ప్రతి రేటు నలభై రూపాయలు యెందుకు పెట్టారో చెబుతాను. వినండి" అన్నాను.

"అబ్బా! దీనికో కథ అల్లావన్నమాట. ఏమిటో చెప్పు" అన్నాడు. అది వినాలన్న కుతూహలమో, కోపమో యేదో అర్థంగా లేదు నాకు.

నా బాగ్‌లోనుంచి ఆయన పుస్తకం తీసి "ఇదిగోండి. ఇది మీ వందరూపాయల పుస్తకం. అథవా పునరాయేతి జీర్లేచ లా కాకుండా, యేమీ నలక్కుండా మీది మీకు ముట్ట చెబుతున్నాను తీసుకోండి" అంటూ ఆయనకిచ్చాను.

"అవునోయ్ కనకా! ఇది నా పుస్తకమే"

"మీదేలెండి. దానికెన్ని పేజీలో యేమిటో చూడండి" అన్నాను.

"ఎన్నేమిటోయ్! 63 పేజీలు" అన్నాడు చివరి పేజీ చూసి.

"అవునా! జాగ్రత్తగా వినండి ఇప్పుడు జిరాక్సు మిషన్లకి యెంతో పోటీవుంది. పేజీ 50 పైసలకు చేస్తున్నారు. మరీ యెక్కువగా వందల్లో వుంటే 40 పైసలకు గూడా చేస్తారు. ఆ విధంగా లెక్కేసుకుంటే 63 పేజీలు 32 రూపాయలు. అర్థరూపాయిదేముందిలెండి. ఇక కలర్ జిరాక్సులు గూడా వున్నాయి. అలా కలర్‌లో జిరాక్సు తీసిన కరెన్సీని సైతం నకిలీదని మనం కనుక్కోలేము. అటువంటి కలర్లో కవర్ పేజీలు రెండూ మూడు రూపాయలు. బైండింగు ఛార్జీలు అయిదు రూపాయలు. వెరసి నలభై రూపాయలు. ఇదీ ఆ మేలు ప్రతి ధర. టౌను వాళ్ళకీ, పల్లెటూరి వాళ్ళకీ తెలివిలో 60 రూపాయలే తేడా. అంతే" అన్నాను.

హనుమారెడ్డి అవాక్కైపోయి అలాగే చూస్తుండిపోయాడు. కొద్దిసేపటికి తేరుకొని "ఇక మీదట జాగ్రత్త పడతానోయ్. పేజీలు- ధర చూసుకొని పుస్తకాలు కొంటాను. ఎంతైనా నా 'క్రిమినల్ లా' బుర్ర పనిచేయలేదోయ్. 'ఐడియాలు అమ్మబడును' అనే నీ కథా సంకలనం వుందిగా, సెకండ్ ఎడిషన్ తేవాలంటున్నావుగా. అందులో బోనస్‌గా యీ కథ గూడా చేర్చు" అంటూ భుజం తట్టాడు.

**-అయినాల కనక రత్నాచారి**

---

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2233216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. www.eenadu.net.

